విశ్వసాహిత్యమాల - 58.



# మపాసా కథలు

## గై డీ మపాసా

అనువాదం:

మహీధర జగన్మోహనరావు





1954, ఫిబ్రవరి.

వెల రు. 2/-

విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

2

Stories taken from the standard translation of
GUY DE MAUPASSANT.

Translated into Telugu
by M. JAGANMOHAN RAO.

మొదటి ముద్రణ 1954 ఫిబ్రవరి.
1000 కాపీలు.

9 పుట మొదలు 72 వరకు వేణుప్రెస్, రాజమండ్రి.
మిగిలినదంతా మెజస్టిక్‌ప్రెస్, రాజమండ్రి.

# విషయసూచిక

ఉత్తమరచయిత, కళోపాసకుడు, తత్త్వాన్వేషకుడు,

ఆధునిక కథాశిల్పాన్ని తెలుగులో

తీర్చి దిద్దిన వారూనైన

'చలం' గారి

ప్రతిభా వ్యుత్పత్తులకూ,

కవితా నైశిత్యానికీ,

ఆలోచనలు రేకెత్తింతే ఆయన రచనలనూ

స్మరిస్తూ.

3 23-8-54

# మపాసా జీవితము, రచనలు.

ఫ్రాన్సులో నార్మండీ రాష్ట్రంలో డీయెప్పీరేవుకి ఆరుమైళ్లు దిగువగా ఒక యెస్టేటువుంది. దానిలో సుందరమైన రాజభవనం 'చాట్యూ డీ మిరో మెస్నిల్' పేరిటిదివుంది. ఇది 17 వ శతాబ్దంలో అప్పటి ప్రభుకుటుంబీకులచే నిర్మించబడిరది. ఈభవనంలో వుంటూ, ఆ ప్రాంతాన్ని కౌలుకు తీసుకొని వ్యవసాయం చేయించేవాడు మపాసా తండ్రి. ఈభవనంలోనే 1850 అగష్టు 5 వ తేదీన జన్మించేడు, గై డీ మపాసా. ఈతని బాల్యం యీ రాజభవనంలోనూ, తరువాత ఎట్రిటాట్‌లో మాతామహుని యింటా గడిచింది. మపాసా తలిదండ్రుల దాంపత్యజీవితం చాల అసుఖకరమైనది. వారిద్దరూ విడిపోవడం, తల్లి పుట్టింటికిపోవడంవల్ల మపాసాకు తండ్రితో పరిచయం అంతంతమాత్రమే. ఎవిటాట్ మఠపాఠశాలలోనూ, లీ రోయ్ - పెటిట్ అనే ప్రైవేటు పాఠశాలలోనూ, అటు తర్వాత రోయెన్‌లోని లైసీ కోర్నిల్లీలోనూ విద్యాభ్యాసం చేసేడు. 1870 లో ఫ్రాంకో - జర్మన్ యుద్ధకాలంలో పటాలంలో చేరేడు. కాని మపాసా నిజమైన యుద్ధం చూడనేలేదు. తరువాత సివిల్ సర్వీసులోచేరి, పదేళ్లపాటు పారిస్‌లోనే నౌకా, విద్యాశాఖలలో పని చేసేడు. అందుచేతనే మూడో రిపబ్లిక్ పాలనాకాలంలో అనగా 1870–1890 ల మధ్య ఫ్రాన్సుదేశపు సాంఘిక జీవితమే మపాసా కథల్లో ప్రతిబింబిస్తూంటుంది.

మహాకవి ఫ్లాబర్ట్ యితనికి అభిమానపిత. ఆయనే మపాసాను రచనావ్యాసంగానికి ప్రోత్సహించేడు. 1880 లో మపాసా గీతికా సంపుటి ఒకటి ప్రచురించబడింది. మపాసావ్రాసిన బృహత్కథ బౌలీ-డీ-సూయ్ (చలంగారి 'సత్యం' కథకిదే మాతృక) అనే దానితో ప్రారంభమయింది, జోలా ప్రచురించిన కథా సంపుటి ఒకటి.

సోదరు డొకడు పిచ్చెత్తి చనిపోవడంతో మపాసాకు మతిస్థిమితంతప్పి **1891** డిసెంబరులో ఆత్మహత్యకు యత్నించేడు. చావు తప్పింది కాని పక్షవాతం వచ్చి ఆసుపత్రిలోనే వుండిపోయేడు. పారిస్‌లోని పాసీ అనే చోట మతిభ్రష్టులయిన పక్షవాతరోగుల శరణాలయంలో మపాసా జూలై **6** న చనిపోయేడు.

**1880** నుంచీ మపాసా తన రచనలవల్లనే జీవిస్తూ వచ్చేడు. ఆయన రచనలు యెన్నో వున్నాయి. గీతాలు గాక ఆరు నవలలు, మూడు సంపుటాలుగా యెన్నో యాత్రాకథనాలు, నాలుగు నాటకాలు, మూడు నూర్లకు పైగా కథలూ రాసేడు, మపాసా.

ఆయన రచించిన గీతాలు, నాటకాలు విస్మృతి పథానబడినా, నవలలంతగా ఖ్యాతిబడయకున్నా, చిన్నకథలలో మపాసా లబ్ధప్రతిష్ఠుడై, కవియశస్సు నార్జించి, విశ్వసాహిత్యంలో శాశ్వతుడైనాడు. ఆయన నవలలు కథామాలికలవలె నుంటాయంటారు.

చిన్నకథల ప్లాటుల నెత్తుకొనడంలో ఆయన సిద్ధహస్తుడు. కథల్లోని వర్ణనా భాగాలు తెచ్చి అతికించినట్లు కృతకంగా వుండక చక్కగా అతికి, క్లుప్తంగా, ఆహ్లాదకరంగావుంటాయి. ఈయన రచనలో హాస్యము, చమత్కృతీ నిండి వుంటాయి. మానవస్వభావ చిత్రణలో యీయన అందెవేసిన చేయి. చాలమంది అనుకొనేటట్లు మపాసా కేవలం సెక్సు కథలనేగాక అత్యుచ్ఛ్రితములైన యుద్ధ వ్యతిరేక కథలు, జాతీయాహంకార నిరాసకములైన కథలు, నీతిస్ఫోరకములైన కథలు రాసేడు. అశ్లీలము లితని కథల్లో హెచ్చుగా వున్నాయనే వాదన ఒకటి వుంది. మానవుని నిత్యజీవితంలోనే నిండివున్న సంకుచిత స్వార్థాన్నీ, పశుత్వాన్నీ, మూర్ఖతనూ, ఆడంబరాన్నీ, లాభలోభ దుల్నియెత్తి చూపి, అంకుశంతో పొడిచి మేల్కొలుపుటయె ఆయన ఆశయమని చెప్పవచ్చును.

తెలుగులో గొప్పకథకులుగా కీర్తిగాంచిన శ్రీ చలంగారి రచనలలో యెన్నో మపాసా ప్రభావం పట్టవిగా కనిపిస్తాయి.

మహాకవి ఆస్కార్ వైల్డ్ ఒకచో యిల్లా రాసేరు: 'నీతిదాయకమైనవీ, నీతిబాహ్యమైనవీ అంటూ గ్రంథాల్లో తెగలు లేవు. చక్కగా రాయబడ్డవీ, చేతగానివీ అనే రెండు తరహాల క్రిందే విభజించాలి, వాఙ్మయాన్నంతనీ.' నీతిబాహ్యత విషయమై రచనలకి యీ సూత్రాన్ని కొలబద్దగా తీసుకోవచ్చు.

మపాసా కథల్లో గీటుకు నిలబడే కథలనే ప్రచురించలేదు, యీ సంపుటిలో. హాస్యం, చమత్కృతి గలిగి, చిన్నవిగావుండే కొన్నికథల్ని యిందులో కూర్చినాను. ఆయన కథల్లో అత్యుత్తమములని నాకుతోచిన మరి కొన్ని కథల నింకొక సంపుటముగా తేదలచినాను.

చలంగారు ఒకచోట యిల్లా రాసేరు: 'శృంగార వర్ణనలతోనే ఆకర్షించాలి, మీ రుచుల్ని............నా వర్ణనలు మీ రుచులకు యెర. తిట్టు కుంటూ వాటికోసంవచ్చి నా అభిప్రాయపు బోనులో చిక్కుకోవాలనే నా ఉద్దేశ్యం.' దీనినే యీ గ్రంథంలోని కథల కనువర్తింపజేయుండి.

తననాటి ఫ్రెంచి సమాజంలోని వాస్తవిక ప్రవృత్తుల్ని నగ్నంగా యెత్తి చూపి, ఖండించేందుకూ, తన్మూలంగా మానవస్వభావాన్ని సంస్కరించేందుకూ తనకథలను సాధనాలుగా తీసికొన్నాడేగాని బూతులను చెప్పేందుకు గాదని మపాసాను గురించి యెందరో సాహిత్య విమర్శకు లుగ్గడించి యున్నది సత్యమేనని తోస్తుంది. పైన ఉల్లేఖించిన చలం, ఆస్కార్ వైల్డ్‌ల వాక్యాలను మపాసా కథలకు అనువర్తింపచేసి చూస్తే మీకే తెలుస్తుంది.

కథాసాహిత్యానికీ, శిల్పానికీ మూలపురుషులుగా మపాసా, చెకోవ్‌లను చెప్పుతూంటారు, సాహిత్యవేత్తలు. కాని యిద్దరిదీ చెరొక పంథా. చెకోవ్ కథా సంపుటి నొకదాన్నికూడ తెలుగులో తీసికొని వస్తున్నాము, త్వరలోనే.

మపాసా కథల అనువాదాలు కొన్ని పత్రికల్లో యిదివరలో వచ్చినవి గాని అవన్నీకూడా యే డజనుకో మించవు. చాలమంది చర్విత చర్వణంగా రాస్తూనూవచ్చేరు. ఈ సంపుటిలోని కథల్లో చాలవరకు యిదివరలో యెవరూ తెలుగులో ప్రచురించనివే. ప్రామాణికమైన అనువాదాలనుంచే యీ అనువాదం గావించేను. ఎంతవరకూ కృతకృత్యత నొందిననదీ పాఠకులే చెప్పాలి. సెలవు.

రాజమండ్రి,
31–2–1954.

మహీధర జగన్మోహనరావు
అనువాదకుడు,

# మపాసా కథలు.

## బేరం

సీజర్ ఇసీడోర్ బ్రూమెంటు, ప్రోస్పర్ నెపోలియన్ కోర్నూ,-యిద్దరూ ముద్దాయిలుగా కోర్టువారి యెదుట హాజరు పెట్టబడ్డారు. మొదటి ముద్దాయిభార్య మదాం బ్రూమెంటును నీటిలో ముంచి చంప యత్నించేరనే అభియోగం మోపబడింది, వాళ్ళిద్దరిమీాదా.

మామూలుగా ముద్దాయిలు కూర్చునే బెంచిమీాద పైదీలిద్దరూ కూర్చున్నారు, సరసనే. ఇద్దరూ రైతుకుటుంబీకులే. బ్రూమెంటు పొట్టిగా, దుక్కలా వుంటాడు. కాళ్ళూ చేతులూ కురచలు. గుండ్రని తల, మొటిమల ముఖం, పెద్ద బానను పోలిన మొండెంమీాద, అతని తల సరాసరిగా అతికించబడిందా? అన్నట్లుంటుంది. మెడ అనే దెక్కడా వున్నట్లు కనిపించదు. అతని వృత్తి పందుల్ని పెంచడం. నివాసం క్రిక్యేటాట్ శివారు కాచివిల్లీ-లా-గాపిల్.

కోర్నూ సన్నగా వుంటాడు. ఎత్తు మధ్యమం. చేతులు బాగా పొడుగ్గావున్నయ్. వంకరమెడ, ప్రక్కకి త్రోసుకుపోయిన దౌడలు, మెల్లకన్ను,-యివి ఇతనికి అలంకారాలు.

పొడుగ్గావుండి మోకాళ్ళవరకూ వ్రేలాడుతూన్న నీలి అంగీ ధరించేడు. పల్చగా పరకవాటుగావున్న పసుపురంగుజుట్టు తల నంటుకొనివుండి, అతని ముఖానికి అలిసిపోయిన వైఖరి నిస్తూంది. ఇతన్ని చూడ్డంతోనే జబ్బుపడ్డవాడిలాగాను, మురికి గానూ అగుపిస్తాడు. కోర్న్యూకి 'పూజారి' అని బిరుదు పేరు కూడావుంది. చెర్చిలోని ప్రార్థనలు, ఫలశ్రుతి వగైరా కర్మ కాండనంతను అచ్చంగా అదే స్వరంతో, తుచ తప్పకుండా,- ఆఖరికి భూతధ్వనితోసహా,- అనుకరించగల యీతని అఖండ సామర్థ్యాన్ని గుర్తించిన లోకమే యితనికీ బిరుదు నిచ్చింది. ఇతనికి కాతాదారుల్ని హెచ్చించినదికూడ యీతనిలోని యీ సామర్థ్యమే. అన్నట్లు చెప్పడం మరిచేపోయేను; కోర్న్యూ క్రిక్వె టాట్‌లో హోటలు యజమానని! చెర్చిలో ప్రార్థనలకంటె కోర్న్యూ ప్రార్థనలంటేనే చాలామందికి యిష్టం!

సాక్షులుకూర్చునే బెంచిమీద మదాం బ్రూమెంటు కూర్చునివుంది. ఆవిడ అటుకి గింజలాంటి పల్చటి పైతుస్త్రీ. ఎప్పుడూ కునికిపాట్లు పడుతూన్నట్లే కనిపిస్తుంది. చేతులురెండు మోకాళ్ళమీదా అటునిటుగా వేసుకుని, పిచ్చిదానిలా కను రెప్ప వాల్చకుండా యెదురుగా చూస్తూ కూర్చునివుం దామె.

జడ్జిగారు వాఙ్మూలం తీసుకుంటున్నారు.

"సరే. తరువాత, మదాం బ్రూమెంట్! వీళ్ళు మీ యింట్లోకి వచ్చి, నిన్ను పట్టుకుని నీళ్ళతొట్టిలో పడేసేరు. అంతే గాదూ? వివరాలు కోర్టువారికి చెప్పు. లేచి నిలువో."

మదాం బ్రూమెంట్ లేచింది. నెత్తిమీద టోపీ ఆవిడా జెండా కొయ్యలావుంది. ఫ్రెంసు అంటిపెట్టుకున్నట్లున్న టోపీ సర్దుకుని నీరసంగా మాట్లాడనారంభించింది.

"అప్పుడు నేను బటానీలు వొలుస్తున్నానండి. వీళ్ళిద్దరూ వచ్చేరు. నాలోనే ఏమిటి చెప్మా. వీళ్ళ వ్యవహారం? వీళ్ళ వాలకం చూస్తే మామూలుగా కనిపించడం లేదే! ఏదో దుర్మార్గం తలపెట్టినట్లున్నారు! అనుకున్నాను. వాళ్ళు ప్రక్కవాటుగా నన్ను పరికించి చూడనారంభిచేరు. అందులోనూ కోర్న్యూ వున్నాడే, మెల్లకూడానేమో, (అభినయిస్తూ) యిల్లా చూసేడు. ఈ యిద్దరూ కలిసేరంటే క్రిందపెడితే పంటలూ, పైనపెడితే నానలూ వుండవు. అంచేత వీళ్ళిద్దరూ కలిసి రావడంవల్ల నాకు అనుమానం వేసింది. కొరగాని కొరవిలు! 'మీకేం గావాల'ని అడిగేను. బెల్లం కొట్టిన రాళ్ళలా మాట్లాడరు! నా అనుమానం బలపడింది......"

ముద్దాయి బ్రూమెంటు వెంటనే సాక్షిమాటలకి అడ్డు దగిలి అన్నాడు

"నే నప్పుడు బాగా త్రాగివున్నాను!"

ఆ పళంగా కోర్న్యూ కోటిముద్దాయిని బుజంతో పొడుస్తూ, బోదుమకప్పలా బొంగురుగొంతుతో యెత్తిపొడుపుగా అన్నాడు.

"ఇద్దరమూ త్రాగివున్నామని చెప్పరాదురా? అల్లా చెబితే నీ సత్యవ్రతాని కేమీ భంగంరాదుగదరా!"

జడ్జి గంభీరంగా ముఖం పెట్టి, కఠినంగా ప్రశ్నించేడు:

"ఇద్దరూ బాగా తాగివున్నారనా మీ అభిప్రాయం?"

"అందుకు సందేహమా?" అన్నాడు బ్రూమెంటు.

"ఆ స్థితి యెవరికేనా రావచ్చు!" నన్నాడు కోర్నూ.

"అమ్మా! నీ సాక్ష్యం కానీయ్" అన్నాడు జడ్జి, ప్రమాదానికి గురియైన మదాం బ్రూమెంటుతో.

"చిత్తం, బాబూ! ఆ మట్టున బ్రూమెంటు నాతో అన్నాడుగదా: 'నీకు నూరు సౌలు (పైసవంటినాణెం) సంపాదించాలనివుందా?' నేనన్నాను 'ఆఁ! వుంది!' అని; నూరుసౌలు తేరగా రోడ్డుమీద దొరికేవి కాదుగదా? అతగాడు తిరిగి నాతో 'కళ్ళు తెరిచి వుంచుకుని నేను చెప్పినట్లు చెయ్!' అన్నాడు. వాకిట్లో వానగొట్టంక్రింద మూలగా ఓ పెద్దతొట్టి వుంది. ఇతగాడు గబగబా వెళ్ళి దాన్ని బోర్లించి, దొర్లిస్తూ వంటింట్లో మధ్యకి తెచ్చి నిలబెడుతూ 'వెళ్ళు! నీళ్ళు తెచ్చి దీన్నిండా పోయి" అన్నాడు.

"నేనూ కోనేటికి పోయి, రెండుబాల్చీలతో నీరు మోసుకొచ్చి, తొట్టి నింపేను. పక్కా-గంటసేపు నీళ్ళు మోసి మోసి, చచ్చిచెడి తొట్టి నింపేననుకోండి, బాబూ! దిక్కు-మాలిన తొట్టి చిన్నచెరువంత వుందండి! సందర్భం వచ్చింది గనుక చెప్పేను, అయ్యా! ప్రెసిడెంటుగారు! క్షమించండి!"

"అంతసేపూ యీ పనికిమాలినవా ళ్ళిద్దరూ కూర్చుని గ్లాసుమీద గ్లాసు పుచ్చుకుంటూనే వున్నారు. పీఖ్ఖా ముగించ

బోతుంటే నే నన్నాను; 'మీరూ పీకలదాకా పుచ్చుకున్నారు. ఈ తొట్టికంటే నిండుగావున్నారు!' బ్రూమెంటు అన్నాడు: 'మాకోసం బెంగెట్టుకోక నీపని చూసుకుంటూ. నువ్వేం కంగారుపడకు. నీవంతూ వస్తుంది. ఎవరి కెంత ప్రాప్తమో అంతా వాళ్ళకి ముట్టకండాపోదు!' పూరాగా తాగి వున్నాడు గదా యని అతడి మాటలు నేనేమీ పట్టించుకోలేదండి."

"తొట్టి అంచులపైకి నిండేక 'నాపని పూర్తి అయింది,' అన్నాను. అప్పుడు కొర్న్యూ నాకు నూరుసౌలు తీసిచ్చేడు. బ్రూమెంటు కాదు, కోర్న్యూ యేనండి, బాబయ్యా! నాకు డబ్బిచ్చింది. మళ్ళా బ్రూమెంటు అన్నాడుగదా: 'నీ కింకో నూరుసౌలు సంపాదించాలనివుందా?' 'ఆఁ!' అన్నాను నేను. నాకటువంటి బహుమతులు యెప్పుడూ దొరకనే లేదు. ఎవరిస్తారో చెప్పండి, నాకు? అప్పుడు బ్రూమెంటు అన్నాడు, 'గుడ్డలు విప్పేసెయ్, ఐతే!' నేను అడిగేను; 'నా బట్టలు తీసెయ్యనా?' 'ఔను!' అన్నాడు, బ్రూమెంటు. 'ఏవేవి తీసెయ్యను?' 'అన్నీ తీయాలని లేకపోతే కమీజుమాత్రం వుంచుకో పోనీ! అదున్నా మాకేం బాధలేదులే!' ఈ మాదిరిగా నిర్ణయం అయింది."

"నూరుసౌలు అంటే నూరుసౌలే గదాండి! వాటికోసం నేను బట్టలు విప్పాల్సిందే, మరి. కాని యీ పనికిమాలిన వాళ్ళ యెదుట గుడ్డలు తీసెయ్యడం నాకు యెంతమాత్రం మనస్కరించలేదు. ఐనా తప్పే దేముందండీ? సరే, ముందుగా టోపీ తీసేను, తర్వాత జాకెట్, పిమ్మట షట్టు, కొయ్య చెప్పులు

కూడా వదిలేసేను. అప్పుడు బ్రూమెంటు అన్నాడు; 'స్టాకింగులు వుంచుకో పోనీ. ఫర్వాలేదులే. మేం మంచివాళ్ళంలే.' కోర్నూ అందుకుని 'ఆఁ! ఔను! మేము చాలా మంచివాళ్ళం!' అన్నాడు."

"ఆ రీతిగా తయారై వాళ్ళయెదుట నిలబడ్డాను; ఇంచుమించు పుట్టినప్పటిలానే అనుకోండి. అచ్చంగా అంతే మరి! ఆ పళంగా వాళ్ళిద్దరూ కుర్చీలమీంచి లేచేరు. కాని, నిలబడలేక తూలిపోతున్నారు. పూరాగా తాగివున్నారు గదాండి, బాబూ! మీరు క్షమించాలి, జడ్జిగారూ! ఇటువంటి సంగతులు మీదగ్గర చెపుతూన్నందుకు...నేనప్పుడే అనుకున్నా, 'వీళ్ళేదో ఘాత చేసేటట్లున్నారా, దేవుడా!' అని."

"బ్రూమెంటు 'సిద్ధంగా వున్నావురా?' అనడిగేడు. 'ఓ! తయార్!' అని కోర్నూ జవాబిచ్చేడు. ఆ మట్టున వాళ్ళిద్దరూ నన్ను పట్టుకున్నారు. బ్రూమెంటు తలగట్టా, కోర్నూ కాళ్ళా పట్టుకున్నారు. వుతికిన బట్టని పిండడానికి సాయంపట్టినట్లే! నేను తెగగోలపెట్ట నారంభించేను. బ్రూమెంటు తిట్ట నారంభించేడు; 'నోరుమూసుకోవే, దిక్కుమాలినలంజా!...' నన్నా పళంగానే సాయంపట్టి పైకెత్తి నీళ్ళతొట్టిలో పడేసేరు. చలికి నావొళ్ళు కొంకరించుకుపోయి, గుండెలు ఆగిపోయినట్లయింది. బ్రూమెంటు 'యిది చాలా?' అనడిగేడు. 'చాల్లేరా!' అని జవాబిచ్చేడు, కోర్నూ. 'తలయింకా పైనేవుందిరా! కొలతలో తేడావస్తుంది!' అని మళ్ళా బ్రూమెంటు అభ్యంతర

పట్టగా, 'ఐతే, తలకూడా ముంచు!' అని కోర్న్యా సమాధానం చెప్పేడు."

బ్రూమెంటు నా తల క్రిందికి నెట్టుతూంటే ఉక్కిరిబిక్కిరై పోయేను. స్వర్గం కనిపించిందనుకోండి! బలవంతంగా నా తల నీళ్ళలో ముంచేసేడు, బ్రూమెంటు చివరకి.

"వాళ్ళకి భయం వేసిందో యేమో, నన్ను బైటికి లాగేరు. బ్రూమెంటు, 'వెళ్లు! తుడుచుకోవే శవప్పీనుగా!' అన్నాడు."

"అప్పుడు నేను బ్రతుకుజీవుడా! అని వెనకతిరిగి చూడకుండా పరుగుచ్చుకున్నా. పూజారిగారింటిదాకా ఒకటే పరుగనుకోండి! ఆ పుణ్యాత్ముడు నా అవస్థ చూసి, ధైర్యం చెప్పి, వారి నౌకరు చొక్కా యిచ్చి తొడుక్కోమన్నారు. అయ్యో దేవుడా! నేనప్పుడు యించుమించు పుట్టినదాన్ని పుట్టినట్లే వున్నాను గదాండి! పూజారిగారే వెళ్లి కాపలాదారు మైత్రీ ఫికొట్‌ని పిలుచుకొచ్చేరు. అతడు పట్నానికిపోయి పోలీసుల్ని వెంటబెట్టుకొచ్చేడు. పోలీసులతోకూడా నేనూ మాయింటికి వెళ్లేను."

"మేమందరం వెళ్లేటప్పటికి వీళ్లిద్దరూ పొట్టేళ్లలా పోట్లాడుకుంటున్నారు. బ్రూమెంటు అరుస్తున్నాడు; 'అదంతా అబద్ధం! కనీసం ఒక ఘనపు మీటరేనా వుండితీరుతుం దని ఢంకా బజాయించి చెపుతా!' కోర్న్యా బిగ్గరగా అరుస్తున్నాడు; 'నాలుగు బాల్చీలంటే సుమారు అరఘనపుమీటర న్నమాట!

నువ్వింకేం మాట్లాడకురా, ఇదియింతే! ఒకసారి బేరం యిచ్చేక తప్పుకోలేవు! ఇదే ననుకోండి, అయ్యా! ఒక టే కాకిగోల."

"పోలీసు కెప్టెన్ పీళ్ళిద్దర్నీ అరెస్టు చేసేరు. అంతే నేను చెప్పాల్సిం దింకేమీ లేదు."

ఇప్పు ముగించి మడాం బ్రూమెంటు కూర్చుంది. కోర్టు లోని ప్రేక్షకులంతా గొల్లుమని నవ్వేరు. విభ్రాంతులైవున్న జూరీలు ముఖముఖాలు చూచుకున్నారు. జడ్జి అన్నారు;

"ముద్దాయి కోర్న్యూ! లజ్జాకరమైన యీ కుట్రకు ప్రోత్సాహకుడవు నువ్వేనని నేరారోపణ చేయబడింది. దీనికేం సంజాయిషీ యిస్తావు?"

కోర్న్యూ లేచి నిలుచుని చెప్పేడు;

"జడ్జీగారూ! ఆ సమయంలో నేను పూరాగా త్రాగి వున్నానండి."

జడ్జి గంభీరంగా ముఖం పెట్టి అన్నారు;

"ఆ విషయం నాకు తెలుసు, చెప్పు, తర్వాత!"

"చిత్తం, చెప్తానండి. మరేం, ఆ రోజున బ్రూమెంటు నాహోటలుకి వచ్చేడు. రెండు పానీయాలకి ఆర్డరిచ్చి, నన్ను పిలిచి చెప్పేడు. 'కోర్న్యూ! అదిగో, అది నీకు.' వాడి కెదురుగా టేబిలుదగ్గర కూర్చుని నేను ఆ గ్లాసు త్రాగేను. నేను మరో రెండుగ్లాసులు తెప్పించి, ఒకటి వాడికిచ్చేను. మర్యాద పాటించాలి, చూడండి! వాడు మళ్ళీ మొదటిలాగే చేసేడు. నేనూ అంతే, ఈ విధంగా వాడోసారీ, నేనోసారీ సారా తెప్పి

స్తూనే వున్నాం. మధ్యాహ్నం కావచ్చేసరికి, మా కడుపులు నిండి చెరువులై పోయాయి."

"అప్పుడు బ్రూమెంటు యేడవడం ఆరంభించేడు. నాకు జాలేసింది. 'ఏమిట్రా సంగతి?' అనడిగితే వాడన్నాడుగదాండి; 'లక్షన్నరవారం నాటికి వెయ్యిఫ్రాంకులు కావాలి.' ఆ మాట వినడంతోనే నేను చల్లబడిపోయాను. తమకు మాత్రం తెలియని దేముంది గనక? ఆ తర్వాత వున్నట్లుండి హఠాత్తుగా 'నా భార్యని కావలిస్తే అమ్మేస్తా!' నన్నాడండి బ్రూమెంటు. నేనూ బాగా తాగేవున్నానాయె. అదీగాక నాభార్య పోయి చాలాకాలమైంది. తెలిసిందాండి, బాబయ్యా! ఆ మాట వినడంతో కాస్త ఆశగలిగి మెత్తపడ్డాను. నేనాతని భార్య నెరుగ ననుకోండి. కాని, ఆమె ఆడదే అయివుంటుందిగదాండి? కాదని యెవరంటారు, చెప్పండి? నే నడిగేనుగదా: 'ఎంతైతే అమ్ముతావురా?' వాడు ఆలోచించేడు. పోనీ, ఆలోచిస్తూన్నట్లు నటించే డనండి! బాగా తాగివున్నప్పుడు యెవడైనా సరే పూర్తిస్పృహలో వుండడు. 'ఘనపు మీటర్ల లెక్కని అమ్ముతా!' నన్నాడు, బ్రూమెంటు వుండివుండి."

"వాడిమాటలు నాకూ ఆశ్చర్యం కలిగించలేదు. నేను మాత్రం తక్కువ తాగేనా? నా వ్యాపారంలో అలవాటు గనుక ఘనపు మీటరంటే నాకూ తెలుసు. వెయ్యిలిట్ల న్నమాట. (లిట్టరు-సుమారు శేరు) ఆఁ! ఇంకేం! అది నాకు అనుకూలంగానే వుంటుందనుకున్నా. ఇక ధర తేలాల్సివుంది.

అదంతా సరుకు నాణ్యాన్నిబట్టి వుంటుందనుకోండి. 'ఘనపు మీటరు ధర యెంతరా?' అనడిగేసేను. 'రెండు వేల ఫ్రాంకు' లన్నాడు, బ్రూమెంటు."

"నేను తేలు కుట్టినట్లు వులికిపడి, కుందేల్లా యెగిరి గంతేశాను. తుళ్ళి కొంచెం స్థిమితపడి ఆలోచించేను. ఏ ఆడదీ మూడువందల లిట్టర్లకంటె హెచ్చుండదుగదా. అంచేత ఫర్వాలేదు. అయినా కొనడం అమ్మడంలో బేరం వుంటుంది, చూడండి. అందుకని నేనన్నాను: 'ఇది చాలా హెచ్చుధర.' వాడన్నాడు: 'అంతకంటె తక్కువకి యివ్వలేను. నాకు చాలా నష్టం వస్తుంది."

"అయ్యో! తెలుస్తూందిగాదండీ? ఎవడేనా పందులతో వ్యాపారం చేస్తున్నాడూ అంటే వూరకే పోతుందాండి? ఎవడి వ్యాపారం వాడికి కొట్టినపిండే గద! కాని, పందిమాంసం అమ్మేవాడు తెలివైనవాడైతే,- నేనో, - సారా, మాంసం కూడా అమ్మే నేనంతకంటె తెలివైనవాణ్ణి! హ్హా! హ్హా! హ్హా! అందుచేత నేనన్నాను. 'ఆమె కొత్తదైతే నేను మారుమాట చెప్పేవాణ్ణి కాదురా. కాని ఆవిడకీ నీకూ పెండ్లయి చాలా కాలం అయింది. వెనకటంత తాజాసరుకు కాదుగదా, యిప్పుడు? పోనీ, ఘనపు మీటరుకి పదిహేనువందలిస్తాను. అంతకంటె ఒక్క సౌకూడా యెక్కువివ్వను. నీకు యిష్టమైతే చూడు!' అని. అప్పుడు వాడు 'సరేలేరా! అల్లాగే చేదాం. ఏదో, బేరానికి తెగింపు వుండాలిగదా?' అన్నాడు."

"నేనూ అంగీకరించేను. ఇద్దరం చేయీచేయీ కలుపుకుని రైలుదేరేము. ఈ లోకంలో మనం ఒకరకొకరం తోడ్పడుకోడానికే గదాండీ వున్నది...కాని నాకో భయం పట్టుకుంది. 'ద్రవపదార్థంలో ఆమెని ముంచకండా కొలవడం యెల్లాగా?" అప్పుడు బ్రూమెంటు తన ప్రమాను యెంతో కష్టంమీద నాకు బోధచేసేడు. కష్టం దేనికంటారా? ఇద్దరం త్రాగేవున్నామాయె! వాడన్నాడు: 'పెద్దతొట్టెని, అంచుల దాకా నీళ్లతో నింపుదాం. ఆమెని దాంట్లో ముంచుదాం. బైటికివచ్చేసిన నీళ్ళని కొలుస్తే పరిమాణం తేలుతుంది. ఇదే మంచిపద్ధతి!' 'తెలిసిందిలేరా. అర్థం అవుతూంది. కాని, క్రింద పడ్డ నీరు అటూయిటూ చెదిరి పోతుందిగదా. దాన్నెల్లా చేరుస్తావు? కొలుస్తావు?' అనడిగేను."

"అక్కణ్ణుంచి వాడు నాకు నూరిపోయ నారంభించేడు, తనభార్యని ముంచగా వెలుపలికి కారిపోయిన నీటి పరిమాణం తెలుసుకోడానికి వుపాయం. ఆమెని బైటికి తీయగానే తొట్టెని తిరిగి నీటితో నింపడమే నని బోధించేడు. లోపలికి మళ్లా పోయాల్సివచ్చిన నీరే ఆమె పరిమాణమని విపులీకరించేడు! బహుశా పదిబకెట్లు పట్టవచ్చు ననుకున్నా. ఐతే ఒక్క ఘనపుమీటరన్న మాట! ఏదేమైనా బ్రూమెంటు శుద్ధ మొద్దుమాత్రం గాదు! పూరాగా త్రాగి వున్నప్పుడైనా వాడి బుద్ధి నిశితంగానేవుంది! అంతా కొట్టినపిండే! ముసలిగుర్రం, పిణ్ణె తగలెయ్యా!"

"త్వరగా ముగించుతాను, నా కథంతా. ఇద్దరం కలిసే వాళ్ళింటికి వెళ్ళేము. నేను వాడి పెళ్లామును చూసేను. ఆవిడ యేమంత రూపసిగాదు. నేనే గాదు, ఎవరైనాసరే ఆ విషయం చెప్పవచ్చును. అదిగో! అక్కడేవుందిగదా! చూడండయ్యా!...నాలోనే అనుకున్నా: 'ఆశాభంగమైందే! కానీ, ఫర్వాలేదులే. ఏదో బొత్తిగా పనికిరాకపోదుగదా!' అందంగా వున్నా, అందవికారంగా వున్నా, అంతా చివరి కొకటే గదాండి? ఏమంటారు, జడ్జిగారు! మీరే సెలవియ్యండయ్యా! అదేగాక, ఆమె బొత్తిగా గెడకర్రలా వుండటంవల్ల నాలుగు వందల లీటర్లకు మించివుండదు. ద్రవపదార్థాల అంచనా, కొలతలు నాకు కొట్టిన పిండిలెండి!"

"తరువాత మే మనుసరించిన విధానాన్ని గూర్చి ఆమెగారు చెప్పనే చెప్పింది. నాకెంతో నష్టకరమైనా ఆమెను కమీజు, స్టాకింగులు వుంచుకోనిచ్చేను. ఇక నా లోటేమిటో మీరే చెప్పండి!"

"తొట్టిలోంచి తీసీ తియ్యడంతోటే ఆవిడ పరుగెత్తి పోయింది. నేనప్పుడెల్లా వూరుకోగలను? 'ఒరేయ్! చూడు! ఆమె తప్పించుకు పారిపోతూంది!' అన్నాను బ్రూమెంట్‌తో."

"'భయం లేదులేరా! దాన్ని నేను పట్టుకుంటానుగా. పడుకోడానికి యింటి కెళ్లాగా రావాలిగదరా, అది! తొట్టు భర్తీ చేద్దాం వుండరా, ముందు!' అన్నాడు బ్రూమెంట్."

బాల్చీతో నీళ్ళు తెచ్చి, తొట్టిని పూర్తిచేసేం, యిద్దరం, నిండా నాలుగుబాల్చీలేనా పట్టందే! హ్హా! హ్హా! హ్హా! ! !''

కోర్న్యూ అదేపనిగా నవ్వుతూన్నాడు. వాణ్ణి నవ్వు మాన్పించటానికి పోలీసువాడు ప్రక్కలో రెండుపోట్లు పొడవా ల్సివచ్చింది. స్థిమితపడ్డాక కోర్న్యూ తన వాఙ్మూలాన్ని ముగిం చేడు:

"న్యాయంలో తేల్చెయ్యాలంటే బ్రూమెంట్ అరచేడు: 'అదిచాలదు! నే నెంతమాత్రం ఒప్పుకోను!' నేను గొంతుచించు కుంటున్నా. ఎంత అరిచినా, పోట్లాడినా వాడు అంగీకరించక పోతే నేనేం చేసేది? వాడే ముందు నన్నొక్కపోటు పొడిచేడు. నేనేనా తక్కువ తిన్నది; నేనూ కొట్టేను. ఇద్దరం కలబడ్డాము. మా పోట్లాట కల్పాంతంవరకు జరిగేదే! ఇద్దరమూ త్రాగే వున్నాంగదండీ!''

"అంతలో పోలీసులు వచ్చేరు. మమ్మల్ని బలాత్కా రంగా జైలుకు లాక్కుపోయేరు...నాకు నష్టపరిహారం రావా లని కోర్టువారికి మనవి చేస్తున్నానండి......"

కోర్న్యూ వాఙ్మూలం ముగించి కూర్చున్నాక, బ్రూమెంట్ లేచి, తు చ తప్పకుండా అతడి వాఙ్మూలాన్నే బలపరుస్తూ, వాఙ్మూల మిచ్చేడు. ఈ కథంతా విని జూరీ లంతా నిశ్చేష్టులై పోయేరు. నిర్ణయాన్ని తేల్చుకోడానికని వాళ్ళు లోనికి పోయేరు.

తీవ్రంగా చాలాసేపు చర్చించి, జూరీలు యేకగ్రీవంగా ముద్దాయీలను వదిలిపెట్టాల్సిందేనని తీర్పు యిచ్చేరు. సుదీర్ఘమైన ఆ తీర్పులో వివాహపవిత్రతనుగూర్చి యెన్నో గంభీరనీతి బోధలూ, వ్యాపారసరళియొక్క హద్దులు నిర్ణయిస్తూ కొన్ని కఠిననియమాలూ పొందుపరచకండా వూరుకోలేదు వాళ్ళు.

బ్రూమెంటు భార్యతోకూడా యింటికి వెళ్ళేడు.

కోర్న్యూ తనహోటలుకి బోయేడు.

కథ కంచికీ......మనం యింటికీ.

## కోర్టుహాలులో

జాగ్రివిల్లీ కోర్టు హాలు రైతులతో నిండిపోయి వుంది. గోడలవెంబడే వున్న బెంచీలమీద క్రిక్కిరిసి కూర్చుని, కోర్టులో విచారణ యెప్పుడు ప్రారంభమవుతుందా యని వాళ్ళంతా వేచియున్నారు.

ఆ రైతుల్లో పొడుగూ-పొట్టీ, లావు-సన్నం, అన్ని రూపురేఖా విలాసాలవాళ్లూ వున్నారు. కాని పండ్లతోటలోని చెట్లమాదిరిగా అంతా సుసజ్జితులై వరుసలుగా మాత్రం కూర్చుని వున్నారు. బుట్టలు యెదురుగా నేలమీద పెట్టుకుని, నిశ్శబ్దంగా, ప్రశాంతంగా, తమతమ వ్యాపారాలను గూర్చే ఆలోచించుకుంటూ కూర్చున్న ఆ గ్రామీణులు తమతో కూడ

కోర్టుహాలులోకి చెమట, పశులశాల, పులిసిన పాలు, పెంట కుప్ప, వీటి వాసనల్ని మోసుకొచ్చి వ్యాపింపజేస్తున్నారు. తెల్లటి యింటికప్పు క్రిందుగా యీగలు జుమ్మంటూన్నాయి. తెరచివుంచిన ద్వారంలోనుంచి కుక్కుటరాజముల కొక్కొరో కోలు వినవస్తున్నాయి.

హాలులో ఒకవైపున ఎత్తైన ప్లాట్‌ఫారం, దానిమీద పొడుగాటి టేబిలు, టేబిలుమీద ఆకుపచ్చని టేబిలుగుడ్డ వున్నాయి. టేబిలుకి యెడమప్రక్క ముడుతలుపడిన ముఖంతో ఒక వృద్ధుడు కూర్చుని, యేదో వ్రాస్తున్నాడు. కుడివైపుగా రెండో కొసను పోలీసువాడొకడు కుర్చీమీద కూర్చుని, వెనక్కి జేరగిలబడి అటకవైపు చూస్తూన్నాడు. పశువులవాసన కొడుతూన్న యీ మానవ మృగాలకొరకై శాశ్వతంగా ఆత్మార్పణ గావిస్తూన్నట్లున్న క్రీస్తువిగ్రహం, కొయ్యతో చెక్కబడింది గోడ నలంకరిస్తూంది. జాలిగొల్పుతూన్న వైఖరిలో చెక్కబడియున్న క్రీస్తు విగ్రహం శాశ్వతబాధ నొందుచున్న దీ జంతువుల కొరకేనా?

ఆఖరికి న్యాయాధిపతి కోర్టుహాలులోకి ప్రవేశిస్తారు. బాగా బలిసి, మంచి రంగులోవున్న ఆయన గబగబ గంభీరంగా నడిచి వస్తూంటే నల్లటి పొడుగాటి అంగీ పెళపెళ లాడుతూంది. వచ్చి ఆసీనుడై, టోపీ తీసి టేబిలుమీద వుంచి, హాలులోని సభికులవైపు బహు తిరస్కారపూర్వకమైన చూపులు బరపుతారు, న్యాయమూర్తి.

ఆ ప్రాంతాల్లోకంతా ఆయనే మహామేధావి, పండితుడు; హోరేస్ రచనలను అనువాదం గావించేవాళ్లలో నొకడు; వాల్టేర్ గీతాలంటే చెవి కోసుకుంటాడు; వెర్ట్‌నెర్ట్ రచనల్ని కంఠతా వప్పజెప్పగలవాడు; అంతేగాకండా పార్నీ ఘూటైన కవితను బట్టీ వేసినవాడు! పల్లెటిప్రాంతాల్లోని. వుద్యోగుల్లో యిటువంటి పండితుడు అరుదు.

ఆయన సాధికారంగా వుచ్చరించేడు:

"మిస్టర్ పోలెట్! కేసులు పిలవండి."

ఆ వెంటనే చిరునవ్వుతూ లాటిన్ భాషలో ప్రాసంగిక వాక్యాన్ని గొణుగుతూ తన పాండిత్యాన్ని వెల్లడిచేసేడు.

అప్పుడు కోర్టు గుమాస్తా నీళ్ళు నములుతూన్నట్లుగా తెలియకండా బడబడలాడేడు.

"మదాం విక్టోరియా బసూలీ, ఫిర్యాదీ - ఇసీడోర్ పటూరోన్, ముద్దాయీ."

మహాకాయంగల ఒక స్త్రీ ముందుకు వచ్చింది. తాలూకా పట్టణంలోని ఒక ధనిక రైతు కుటుంబానికి చెందిన దామె. టోపీనిండా రిబ్బన్లూ, విశాలమైన వక్షోభాగంమీద అల్పాల్పంగా కనిపించే గడియారపు గొలుసూ, వ్రేళ్ళనిండా వుంగరాలూ, దీపాల్లాంటి లోలాకులతోటీ యీామె దర్పంగా నిలబడింది.

న్యాయమూర్తి ఆమెను గుర్తు పట్టినట్లు చూస్తుంటే, ఆయన కళ్ళల్లో కొంటెతనం పొడసూపింది. ఆమె నాహ్వానిస్తూ న్యాయమూర్తి అన్నారు,-

"మదాం బసూలీ! నీ యిబ్బందులు చెప్పుకో!"

ముద్దాయిలు ముగురూ యెదురుగా మరోవైపు నిలు చున్నారు. వాళ్ళలో పాతికేళ్ళ పడుచు రైతుకుర్రా డొకడు; అతగాడి బుగ్గలు గుండ్రంగా బలిసి, ఆపిలు పళ్ళల్లా, గులాబుల్లా యెర్రగా వున్నాయి. అతని కుడివైపున అతని భార్య వుంది; ఆమె చాలా పిన్నవయస్క. సన్నగా చిన్నమనిషైనా కజ్జా కోరులా వుందామె. క్రీటుద్వీపవాసులవలె గులాబిరంగు శిరో వేష్టనం ధరించింది, చదునైన సన్నని తలమీద. కోపాశ్చర్యా లతో చూస్తున్నట్లుండే ఆమె గుండ్రనికళ్ళు, కోడికళ్ళలా ప్రక్కలకి చూస్తాయి. ఆ పడుచువాని కుడివైపున అతని ముసలితండ్రి వంగిన నడుంతో, మెలికలు తిరిగిపోయినట్లున్న శరీరంతో, గంజిపెట్టిన చొక్కా తొడుక్కొని, గంపక్రింద పెట్టినట్లు కూర్చుని వున్నాడు.

మదాం బసూలీ వాఙ్మూలం యిచ్చింది:

"జడ్జిగారూ! ఈ పిల్లవాణ్ణి పదిహేనేళ్ళుగా యెంతో దయతో సాకేను. ఇతణ్ణి తల్లిలా ప్రేమించి, పెంచుతూ, అన్ని సదుపాయాలూ చేసేను. ఇంతెందుకు, యితణ్ణి మనిషిగా తయారుచేసింది నేనే నంటే చాలు. నన్నెప్పుడూ వదలిపోనని యితడు వాగ్దానం గావించేడు, ఒట్టుపెట్టుకున్నాడు; అంతే గాదు ప్రమాణం కూడా చేసేడు. అంచేతనే నే నీతనికి కొంత ఆస్తికూడా యిచ్చేను. బెక్-డి-మోర్టిన్ గ్రామంలోని నా

పొలం, ఆరువేలు ఖరీదు చేసేది వీడికి రాసిచ్చేను. ఆ తర్వాత యీ అనామకుడు, వూరూపేరూ లేనివాడు, కుర్రకుంక..."

జడ్జి: మదాం బసూలీ! నీమాటలు సభ్యతను మీరకూ రాదు.

మదాం బసూలీ: ఈ చిన్న-కుర్ర-నే చెప్పేది తమకు బోధపడిన దనుకుంటా- తల తిప్పేసుకుని,- తప్పకండా వీడు చేసినదంతే! వీడికేం వచ్చిందో మరి, యెందుకు వీడికాబుద్ధి పుట్టిందో నే నెరుగను, వెళ్ళిపోయి యీమెని, యీ మూర్ఖురాల్ని, జంతువుని పెళ్ళిచేసుకున్నాడు. పైగా నా ఆస్తిపాస్తుల్ని యీమెకి యిచ్చేసేడు కూడాను. అఁ హాఁ! కాదు! అఁ హాఁ!! లేదు! ఇదిగో! దస్తావేజు నాదగ్గరే వుంది. ఇప్పుడు నాపొలాన్ని మళ్ళీ నాకు రాసి యిచ్చేసేడు. సబు-రిజస్ట్రారు ఆఫీసులో నా పొలానికి దానపట్టా వ్రాసి రిజస్టరు చేయించేను. స్నేహంగా వుండడానికంటూ మరోకాగితంమీద ఒప్పందంకూడా రాసుకున్నాము. అదెంత విలువగలదో యిదీ అంతే విలువగలది కదాండి, జడ్జీగారూ! ఎవరి హక్కు-భుక్తాలు వాళ్ళవి; అంతేనాండి, బాబుగారూ!"

అంటూ మొహరులు వేసివున్న దస్తావేజు కాగితాన్ని తెరచి, జడ్జిగారివైపు జాపింది.

ఇసీడోర్ పటూకోన్: అదంతా అబద్ధమండి.

జడ్జి: నిశ్శబ్దంగా వుండు, నీవంతు వచ్చినప్పుడు మాట్లాడుదువుగాని; (అంటూ దస్తావేజు తీసుకుని చదువుతాడు.)

"నేను, యీ క్రింద చేవ్రాలు చేసిన ఇసీడోర్ పటూరోవ్ అనే నేను యిందుమూలంగా నా శ్రేయోభిలాషిణి యైన మదాం బసూలీకి ప్రమాణపూర్వకంగా నేను జీవించియున్నంతవరకు ఆమెను పీడననీ, తత్పరతతో ఆమెను సేవిస్తూ వుంటాననీ వాగ్దానం గావిస్తున్నాను."

† "బాగ్జవిల్లి, ఆగస్టు 5, 1883"

జడ్జి: సంతకం చేయాల్సిన చోట శిలువ గుర్తు వుంది. నీకు రాయడం తెలియదా?

ఇసీడోర్: తెలియదండి. నాకు చదువురాదు.

జడ్జి: ఈ శిలువగుర్తు వేసినది నీవేనా?

ఇసీడోర్: కాదండి. నేను వెయ్యలేదు.

జడ్జి: ఐతే, మరెవరు వేసేరంటావు?

ఇసీడోర్: ఆమే వేసింది.

జడ్జి: ఈ శిలువగుర్తు నువ్వు వేయలేదని ప్రమాణంచేసి చెప్పడానికి సిద్ధంగా వున్నావా?

ఇసీడోర్: (గంభీరంగా) నా తల్లిదండ్రుల శిరస్సుల మీద, నా తాత అవ్వల శిరస్సులమీద, నామాటలు వింటూన్న ఈశ్వరుని శిరస్సుమీద ఆనబెట్టి, నేను యీ శిలువగుర్తు వేయలేదని ప్రమాణం చేస్తున్నాను. (అంటూ తన ప్రతిజ్ఞకు బలంగా చేతినెత్తి ప్రక్కటెముకలమీద చరుచుకుంటాడు.)

జడ్జి: (నవ్వుతూ) ఇక్కడ హాజరుగావున్న యీ స్త్రీతో, మదాం బసూలీతో నీ సంబంధా లెటువంటివి?

ఇసీడోర్: (సభికులవైపు పళ్ళికిలిస్తూ) ఆమెకు కులాసా కలిగించడానికి తోడ్పడ్డాను.

జడ్జి: నువ్వు వుపయోగించే మాటలవిషయమై జాగ్రతగా వుండు. ఆమె చెప్తూన్నట్టుగాక, మీ యిద్దరి సంబంధాలూ కేవలం అంత పవిత్రంగా లేవనేనా నీఅభిప్రాయం?

ముద్దాయి తండ్రి: (వాఙ్మూలాన్ని తను అందుకుంటూ) జడ్జిగారూ! వాడికింకా పదిహేనేళ్ళైనా నిండకపూర్వమే, చిన్నతనంలోనే ఆమెగారు వాణ్ణి పాడుచేసింది...

జడ్జి: వ్యభిచారంలోకి దింపిందనేనా నీ అభిప్రాయం?

ముద్దాయి తండ్రి: తమరు నన్ను సరిగ్గా అర్థంచేసుకున్నారు. నే చెప్పేది, వాడప్పటికి పదిహేనేళ్ళవాడు. అప్పటికి నాలుగేళ్ళనుంచీ వాణ్ణి యెంతో శ్రద్ధగా పోషించిం దామె. కోడిపిల్లని మేపినట్టే అనుకోండి. ఈడుబాగా బలిసి, పోతరించిపోయి విచ్చిపోతాడేమో! అనే టట్లుండేవాడు. ఇల్లా మాట్లాడుతూన్నందుకు తమరు నన్ను మన్నించాలి. తగిన అదును వచ్చింది అని అనుకొన్నప్పుడు, ఆమె వాణ్ణి పాపపంకిలంలోకి యీడ్చేసింది...

జడ్జి: పాపంలోకి యీడుస్తూంటే ... నువ్వు చూస్తూ వూరుకున్నావా?

ముద్దాయి తండ్రి: ఆమెనీ, అట్టే యింకొకరినీకూడాను. అదింకా ముందువస్తుంది...

జడ్జి: అయితే, యిప్పుడు నువ్వు అనే దేమిటి?

ముద్దాయి తండ్రి: ఏమీలేదు. అబ్బే! ఇప్పుడింక అనడానికేముంది? ఏమీ లేదు. కాని, వాడు తనకిష్టం వచ్చిన

ట్టుండడానికి వీల్లేకుండా చేస్తూంది యీ ఆమె. కోర్టువారు మాకు తగిన రక్షణ నియ్యాల్సిందిగా కోరుతున్నా. అంతే.

మదాం బసూలీ: అయ్యా, జడ్జిగారూ! వీళ్ళందరూ వచ్చి అబద్ధాలు చెప్పి, నాప్రాణం విసిగించేస్తున్నారు. నేను చేసిందల్లా వాణ్ణి మసిమిగా చేసేనంతే...

జడి: అట్లాగటమ్మా!

మదాం బసూలీ: ఇప్పుడు వాడు నన్ను తిరస్కరించు తూన్నాడు. నా ఆస్థిని అపహరించి, నన్ను వదలిపెట్టేస్తున్నాడు.

ఇసీదోర్: జడ్జిగారూ! అదంతా అబద్ధమండి. ఐదేళ్ళ క్రితమే నే నివిడను వదలెయ్యాలనుకున్నా. కొవ్వు బలిసిపోయి, పీపాలా తయారైంది. అది నాకు సరిపడదు. నాకు చాలా యిబ్బందిగా వుంటూ వచ్చింది. ఎందువల్లనో నేను చెప్పలేను. నేను వెళ్ళిపోతున్నానని ఆవిడతో చెప్పేసేను. కడవలతో కన్నీరు గారుస్తూ వలవలా యేడ్చేసింది. మరోకొంత కాలంపాటు, నాల్గైదేళ్ళైనా వుండమని వేడించి, తన ఆస్తి యిస్తానని వాగ్దానంకూడా చేసింది. నామటుకు నేనూ 'సరే' అన్నా ననుకోండి. మీరు మాత్రం ఆ పరిస్థితుల్లో మరోలాగ చెయ్య గలరా? అంటూ. అప్పటినుంచీ ఐదేళ్ళు పూర్తిగా, దినదినమూ గంటగంటా వున్నాను. ఇక నాకు స్వేచ్ఛ లభించింది. ఎవరి పూచీ వాళ్ళదే; ఎవరి విధి వాళ్ళు నెరవేర్చాలి. నేను పూరాగా ప్రతిఫలం ముట్టచెప్పేసేను.

ఇప్పటివరకూ పూరుకునివున్న ఇసీడోర్ భార్య, కెవ్వు మని కేకేసి, యీలవేసినట్లుగా కైం మని యేడుపు ప్రారం భించింది.

"ఆమెని చూడండి, జడ్జీగారూ! ఆమెని చూడండి! రుబ్బురోలు! ప్రతిఫలం పూరాగా ముట్టిందో లేదో మీరే చూడండి, బాబూ!"

ముద్దాయి తండ్రి: (నమ్మకం కలిగినట్లుగా తలత్రిప్పి)ఔను తప్పకుండా; పూర్తిగా ముట్టింది.

మదాం బసూలీ తన స్థానంలో కూలబడి, యేడుపు ప్రారంభించింది.

జడ్జి: (సానునయంగా) ఇంకేం కావాలంటావమ్మా! నేనేం చేయలేను. జెక్-డీ-మోర్టిన్‌లో వున్న నీ పొలాన్ని, నీయిష్టంమీద సరిగానే రాసి యిచ్చేసేవు. ఆ భూమి అతనికే చెందుతుంది. తను ఆ భూమిని యిష్టంవచ్చినట్లు చేసుకోడానికి హక్కుంది. భార్యకి పెళ్ళిబహుమతీగా యీ భూమి రాసి యిచ్చేడు. దాని కెవరూ అభ్యంతర పెట్టలేరు. ఇబ్బందిగా వుంటుందని నేను యీ విషయంలో లోతుకి వెళ్ళడంలేదు. చట్టదృష్ట్యానే జరిగిన సంఘటనల్ని విమర్శించి చూడగలను. అంతే. నేనంతకంటె మరేమీ చేయజాలను.

తండ్రి: (కఠినస్వరంతో బిభీషికగా) ఐతే మరి నేనింక యింటికి పోవచ్చా?

జడ్జి: తప్పకుండా.

కోర్టులోని జనం సానుభూతిగా చూస్తూంటే వాళ్ళు బైటికి పోయేరు. వ్యాజ్యాలు నెగ్గినవాళ్ళమీద జనం యెప్పుడూ సానుభూతినే కురిపిస్తుంది లెండి. మదాం బసూలీ తన చోటనే కూలబడి వెక్కి వెక్కి యేడుస్తూంది.

జడ్జి: (చిరునవ్వుతో) లే! అమ్మా! లే! ఇంక యింటికెళ్ళు! నేను నీకేదేనా సలహా యివ్వాల్సివస్తే, ఒకటే చెప్పాలి. వెళ్ళి యింకోణ్ణి, యింకో శిష్యుణ్ణి చూసుకో...

మదాం బసూలీ: (కన్నీటిలోంచే) దొరకడు...యింకోడు దొరకడు, జడ్జిగారూ!...

జడ్జి: నీకు యింకో శిష్యుణ్ణి చూపించలేకపోయినందుకు చాలా విచారిస్తూన్నాను, అమ్మా!

శిలువమీద బాధించబడుతూన్న క్రీస్తువైపు ఆమె నిరాశాదృక్కులు బరపుతూ లేచి, చిన్న అడుగులు వేసుకుంటూ, దుఃఖావేశంతో దగ్గుతూ, ముఖాన్ని జేబురుమాలులో దాచుకుని బైటకు నడుస్తుంది.

జడ్జి: (కొంటెతనంగా) "ఉసిలిన్ వెళ్ళిపోయినప్పుడు కాలిప్సో యెల్లా వూరట చెందుతుంది."

అంటూనే గుమాస్తావైపు తిరిగి గంభీరస్వరంతో "తరువాతి కేసు పిలు!" అంటాడు.

గుమాస్తా: (నీళ్ళు నములుతూ) 'సెలిస్టిన్ పొ హైటీ లెకాషూర్, వాది—ప్రాస్పర్ మగ్లియోరీ డ్యులా ఫైట్ ప్రతివాది...'

# హిపోలైట్ వాదం

లావాటి జడ్జి ఓకన్ను మూసి, రెండోది సగం తెరచి వాదులు చెప్పేది వుదాసీనుడై వింటూన్నాడు; మధ్య మధ్య తన భావాన్ని వ్యక్తీకరించే ఓరకం మూలుగుతో, చిన్నపిల్లల స్వరాన్ని పోలిన సన్నని స్వరంతో వాళ్ళని ప్రశ్న లడుగుతున్నాడు. అప్పుడే ఓ కేసులో తీర్పు పూర్తైంది: మాన్స్యూర్ జోలీ, వాది - ప్రతివాది మాన్స్యూర్ పెటిపాన్‌ల తగాదాలో యిద్దరూ కోర్టులో హాజరై తమ వాదనలు చెప్తూన్నారు; యిద్దరూ యిరుగుపొరుగు రైతులు; మాన్స్యూర్ పెటిపాన్ పాలేరు పొలం దున్నుతూ పొరబాటున మాన్స్యూర్ జోలీ చేను గట్టు దాటేడుట; అదీ వివాద కారణం.

ఈ దావాలో తీర్పు చెప్పేసి తరువాతి కేసు పిలిచేడు. దానిలో వాది మాన్స్యూర్ హిప్పోలైట్ లాకూర్; యినుప సామాను లమ్ముతూంటాడు. చెర్చి ధర్మకర్తల్లో ఒకడు. ప్రతివాది మదాం సెలెస్టీ సీజరైన్ లునియో; ఆమె కీర్తిశేషుడైన ఆనథైమ్ ఇసీడోర్ లునియో భార్య.

హిప్పోలైట్‌కు నలభైఐదేళ్ళుంటాయి. పొడుగ్గా, సన్నగా వుంటాడు. పొడుగాటి జుట్టు; మెల్లిగా పాటపాడుతూన్నట్లు మాట్లాడుతాడు. ముఖం నున్నగా క్షౌరం చేసుకుంటాడు.

మదాం లునియాను సమారు నలభై యేళ్ళుంటాయి. పందెపు కుస్తీలు పోట్లాడే ఫహీల్యాన్ మాదిరి శరీర పుష్టిగలది. బలిష్టమైన ఆమె శరీరంమీద నిరాడంబరమైన దుస్తులు బిగుతుగా వున్నాయి. సువిశాలమైన ఆమె నితంబము మీద నిలచి వున్నాయి, బరువైన పాలిండ్లూ, వీపుమీది మాంసపు కండలూ. తీర్చి దిద్దినట్లున్న ఆమె ముఖం, పొట్టిగా బలిసిన మెడమీద సరాసరి ఆనుకుని వుంది. కంచుగంటలా ఆమె మాట్లాడుతూంటే కిటికీల అద్దాలూ, వినేవాళ్ళ చెవిగూబలూ కూడ కదిలిపోతుంటాయి. త్వరలోనే ఆమె బిడ్డతల్లి కాబోతుందేమో, పెద్దకడుపు పర్వతంలా ముందుకు వ్యాపించివుంది.

ప్రతివాది తరపు సాక్షులుకూడా కోర్టులో హాజరుగా వున్నారు.

జడ్జి: హిపొలైట్ లాకూర్! నీ ఫిర్యాదు చెప్పుకో.

ఫిర్యాది: చిత్తం, సెయింట్ మైకేల్ పండుగకి తొమ్మిది నెలలవుతుందండి, ఒకనాటి సాయంకాలం ప్రార్థన చేసుకుని చర్చినుంచి రాగానే ముద్దాయీ నాదగ్గిరికి వచ్చింది. తనకి బిడ్డలు కలుగకపోవడాన్ని గురించి సొద చెప్పనారంభించింది.

జడ్జి: దయచేసి. విషయం విస్పష్టంగా చెప్పు.

హిపొలైట్: అలాగేనండి, జడ్జిగారూ! ఆవిడకి బిడ్డలు కావాలని వుంది. నా సహకారాన్ని అపేక్షించిందండి; నేనేమీ అభ్యంతరం చెప్పలేదు. ఆవిడే నాకో నూరు ఫ్రాంకులు యిస్తానని వాగ్దానం చేసింది. అంతా విస్పష్టంగానే వుందిగదాండి. కాని

ఆమె యిప్పుడు నాకాసొమ్ము యివ్వ నిరాకరిస్తూంది. నాకు నూరు ఫ్రాంకులు రావాలని కోర్టువారియెదుట మళ్ళా మనవి చేసుకుంటున్నా.

జడ్జి: నాకు కొంచెంకూడా అర్థం గావడంలేదు. ఆవిడ కావాలన్నది బిడ్డగదా! ఐతే ఎలాంటి బిడ్డ? ఎవరైనా పెంచు కోవాలని కోరిందా?

హిప్పొలైట్: లేదండి, అయ్యా! ఆవిడ తనకి సరికొత్త బిడ్డడు కావాలన్నదండి.

జడ్జి: కొత్తబిడ్డడంటే యెల్లాంటివాడని నీ అభిప్రాయం?

హిప్పొలైట్: కొత్తగా పుట్టిన బిడ్డడేనండి. మేము మొగుడూ పెళ్ళాములమైతే కనే బిడ్డలాంటిదండి.

జడ్జి: నాకాశ్చర్యంగా వుందే! ఇల్లాంటి అసందర్భపుకోరిక ఆవిడ యెల్లా కోరిందంటా?

హిప్పొలైట్: జడ్జిగారూ! వినండి. మొదట నేనూ కారణాలు గ్రహ్యించాక మీలాగే ఆశ్చర్యపడ్డాను. కాని నేను యెప్పుడూ కార్యకారణాలు విచారించకండా దుడుంగుమని యే పనీ చేయనివాణ్ణి గనుక ఆమె కోరికకుగల కారణాలు వివరించమని అడిగేశాను. ఆవిడకూడా వెంటనే చెప్పింది. తమకు యెదురుగాదూ, ఆవిడభర్త ఆన్‌థెమ్ యిసీడోర్ను. నాకువలెనే అతణ్ణీ మొగనివాళ్ళుంటకు లెండి. అతగాడు అంత్రకితం వారమే చనిపోయేడు. తదనంతరం ఆస్తి అతని కుటుంబానికి చెందిపోతుంది. అంతఃష్టం కలుతూండంటే ఆవిడకి మనస్సు తాళక,

స్త్రీడాక్టరుదగ్గిరకి పోయి సలహా అడిగింది. పదిమాసాల్లో బిడ్డగనక పుడితే కలుగగల సాధక బాధకాలన్నీ ఆయన ఆవిడికి విప్పి చెప్పేడు. అంటే, పదిమాసాల్లోగా సంతానం కలిగితే, శాస్త్రీయ సంతానంక్రిందే పరిగణించబడి, ఆస్తి అంతా ఆమెకీ సంతానానికీ సంక్రమిస్తుందన్నమాట. ఆపళంగా మంత్రప్రమాదమైనాసరే యీ కార్యాన్ని సాధించడానికే ఆవిడ నిశ్చయానికి వచ్చింది. నే సదివరలో తమకి మనవి చేసుకున్నట్టుగానే, సాయంత్రం చెర్చినుంచి నేనింటికి రాగానే ఆవిడ నాదగ్గరికి వచ్చింది. నేను, చూసేరుగదూ, సజీవులైవున్న యేడుమందుగురు బిడ్డలకి తండ్రినండి. నాజ్యేష్ఠకుమారుడు కేన్‌పట్టణంలో దుకాణం నడుపుతున్నాడండి; కాల్వాడోన్ పరగణాలోది ఆ పట్టణం; విక్టోరియా ఎలిజబెత్ రాబో అను కన్యను సశాస్త్రీయంగా వివాహమాడేను......

జడ్జి: ఈవివరాలన్నీ అనవసరం. అసలు విషయానికిరా.

హిపోప్లైట్: నేనూ అక్కడికే వస్తున్నానండయ్యా, జడ్జిగారూ! అంచుచేత నామె నాతో, అందిగదా; "నువ్వు కృతకృత్యుడవైతే, వెంటనే నీకు నూరు ఫ్రాంకులిస్తా. డాక్టరు సర్టిఫికెట్టు వచ్చిరావడంతోటే యిచ్చేస్తా." సరేగదా అని, జడ్జిగారూ! నే నామెకు పూర్తిసంతృప్తినియ్యడానికి వుపక్రమించేను. ఎనిమిదివారాల పిమ్మటలావుంది, నా కృషి ఫలించిందని తెలుసుకుని చాలా సంతోషించేను. ఆవిడ నడిగేను నూరు ఫ్రాంకులూ యిమ్మని. కాని,ఆవిడ యివ్వను పొమ్మందండి. ఎన్నోసార్లు

అడిగేను. కాని చివరికి ఒక్క చిల్లిగవ్వ కూడా ఆవిడవల్లనాకు లభించలేదు. ఆఖరికి ఆవిడ యెంతదాకా వెళ్ళిందంటే, నన్ను అబద్ధాలకోరనీ, వ్యూనాపివాడనీ, పిలిచేదాకాను! ఆవిడన్ను చూస్తే, కోర్టువారికే విశదమవుతుంది ఆమె మాటల్లోవుండే నిజానిజాలు.

జడ్జి: ప్రతివాది! నువ్వు దీనికేమి చెపుతావు?

మదాం లుసియా: జడ్జిగారూ! ఇతడు చెప్పేదంతా శుద్ధ అబద్ధమని మనవిచేసుకుంటూన్నా.

జడ్జి: నీవు ఋజువు, సాక్ష్యాలున్నాయా?

లుసియా: (ముఖం జేవురించి, ఉక్కిరిబిక్కిరై, నత్తుతూ) నేను దాన్ని యెల్లా ఋజువుచేయగలను? ఏమి సాక్ష్యాలున్నాయి? ఈ బిడ్డ అతడిదిగాదని ఋజువుచేయడానికి నిజంగా యే ఆధారం లేదండయ్యా! కాని,జడ్జిగారూ! ఈ బిడ్డ అతడిదిగాదు. ఒట్టు. చనిపోయిన నాభర్త నెత్తిమీద చెయ్యిపెట్టి చెప్పగలనండి...

జడ్జి: ఐతే సరే. కాని, యెవరి బిడ్డంటావు?

లుసియా: (కోపావేశంతో నత్తుతూ) నాకెల్లా తెలుస్తుంది? నాకు...యెల్లాగ తెలుస్తుందంటా? అందరిదీని! ఇరుగో! జడ్జిగారూ! నా సాక్షులు. వాళ్ళందరూ యిక్కడే వున్నారు. ఆరుగురు! వాళ్ళచేత ప్రమాణం చేయించండి, అయ్యా! ప్రమాణం చేయించండి. వాళ్ళే అంతా చెపుతారు ......

జడ్జి: సంబాళించుకో, అమ్మా! సంబాళించుకుని, మెల్లిగా నా ప్రశ్నలకి జవాబియ్యి. నీవు మోస్తున్న యీ బిడ్డకి

యితడు తండ్రి గాదనడానికి నీకు కారణాలేమున్నాయి?

మదాం లుసియా: కారణాలా? ఒకటిగాదు నూరున్నాయి! వెయ్యి, లక్ష, కోటి కారణాలున్నాయి. అతనితో నేను ప్రస్తావన తెచ్చేక, ఏదీ, నూరు ఫ్రాంకులు బహుమతి యిస్తానని వాగ్దానం చేస్తూ, -ఆ పిమ్మట నాకు తెలియలేదూ, అతని పిల్లల్లో ఒక్కడూ యితగాడిక పుట్టలేదని! జడ్జిగారూ! ఒక్కళ్లూ యితడికి కలిగినవాళ్లు కానేకారండి......

హిప్పొలైట్: (ప్రశాంతంగా) అది అబద్ధం.

లుసియా: (ఉద్రిక్తయై) అబద్ధమా? నిజంగానే? అబద్ధంట! అయ్యా! ఇతగాడి భార్యని యిక్కడున్న మగాళ్ళలో చూడని వాడొక్కడూ లేడంటే నమ్మండి! నా సాక్షుల్ని పిలవండి, జడ్జిగారూ! వాళ్ళచేత ప్రమాణం చేయించండి...

హిప్పొలైట్: అదంతా అబద్ధమే.

లుసియా: అబద్ధమా? ఉఁహూఁ! ఎర్రిజుట్టు వాళ్ళమాటేమిటి? వాళ్ళా నీకు పుట్టినవాళ్ళేనా?

జడ్జి: దయచేసి, వ్యక్తిగత దూషణకి దిగవద్దు. లేకపోతే కోర్టువారు మిమ్మల్ని హాల్లులో...

లుసియా: చిత్తం, జడ్జిగారూ! నా కాతన్నిగూర్చి సందేహం వుండి. నాలోనే అనుకున్నా గదాండి: 'జాగ్రత్తలు యెంత హెచ్చుగా తీసుకుంటే అంతమంచిదిగదా.' అని. నా పరిస్థితిని సీజర్ లేపిక్‌తో చెప్పేను. అతడు సాక్షిగా యిక్కడే వున్నాడు. 'నీ యిష్టప్రకారం చేస్తా'నని ఆతడూ వాగ్దానం చేసేడు. హిప్పొ

లైన్ యీ కార్యభారానికి తగడేమోనని అతడూ తక్షణమే నాకు తన సహాయాన్ని యిస్తూ వచ్చేడు. కాని, నా ఆశలు నిరాశకాగూడదని నేను ఆతురతగావున్న సంగతి వినడంతోనే యీ మిగతా సాక్షులు కూడ నా సాయానికై నడుంకట్టేరు. జడ్జిగారూ! వీళ్ళే అన్నమాటేమిటి? నేను కోరినట్లైతే వందల మంది సంసిద్ధులుగా ఉన్నారనుకోండి. ఆ పొడుగాటివాడు లేడూ, లూకాన్ ఛాండిలీన్, అతగాడు ఘంటకొట్టి మరీ చెప్పే డు. హిప్పొలైట్‌కి దమ్మిడీమైనా యివ్వడానికి వీల్లేదని. ఉత్త పుణ్యానికి నాకు సాయపడిన యీ పెద్దమనుష్యు లందరికంటె హిప్పొలైట్ మహా పొడిచేసిం దేమిటో చెప్పండి, వందఫ్రాంకులు కావాలనటానికి?...

హిప్పొలైట్: ఐతే నువ్వేందు కిస్తానన్నావు? జడ్జీగారూ! నేను ఆ డబ్బు వస్తుందని ఆశించేనండయ్యా! నా తప్పేమీ లేదిం దులో... వాగ్దానం చేసేవా, అది నిలబెట్టుకోవాల్సిందే...

లునియూ: (క్రోధావేశంతో) నూరు ఫ్రాంకులు! అమ్మ య్యో! నూరు ఫ్రాంకులే! ఓరి అబద్ధాలమారీ! నీ ప్రయోజ కత్వానికి నూరు ఫ్రాంకులుకూడానా? పాపం, వాళ్ళేవరూ, ఒక్క ఎర్రని ఏగాణీకూడ అడగనే లేదే! చూడు! ఆగుగుడు! జడ్జిగారూ! వాళ్ళని బోనెక్కించడయ్యా! వాళ్లు తప్పకుండా నిజం చెప్పేస్తారు. (హిప్పొలైట్‌తో) అబద్ధాలకోరు! వాళ్ళని చూడు. వాళ్ళూ నీపాటి చేవ లేనివాళ్ళుగారు! ఇక్కడ వీళ్ళా

మగురే వున్నారు కాని, దమ్మిడీ అక్కర్లేకండా ఆరునందల మందిని తీసుకురాగలనురా? బందిపోటుదొంగా!

హిపొలైట్: సరే, నీకు లక్షమంది దొరుకుతారే అను-

లుసియా: తప్పకండా దొరుకుతారు! నేను కోరినట్టైతే-

హిపొలైట్: నా డ్యూటీ నేను చేసేను. అంచేత వాగ్దానం చెల్లించి తీరాల్సిందే.

లుసియా: (ముందుకొచ్చిన పొట్టమీద రెండుచేతులా బాదుకుంటూ) ఐతే, యిది నీపని అని ఋజువుచెయ్! ఋజువు చెయ్యవేం బందిపోటుగాడా! సవాలు చేస్తానురా, ఋజువు చెయ్యమని!...

హిపొలైట్: (ప్రశాంతంగా) నేను యితరులకంటె మిన్నగా చేసిందేమీ లేకపోవచ్చు. కాని, దానికి నాకు నూరు ఫ్రాంకులిస్తానని నువ్వు వాగ్దానం చేసేవు. ఆ తర్వాత మిగతా వాళ్ళని యెందుకు అడిగేవు? అల్లా అడగడానికి నీకు హక్కు-లేదంటూ. నే నొక్కణ్ణే చేసేసి వుండేవాణ్ణి!

లుసియా: అంతా అబద్ధం, దొంగ! నా సాక్షుల్ని పిలవండి జడ్జిగారూ! వాళ్ళే జవాబు చెప్తారు రకీమని!

ప్రతివాది తరపు సాక్షుల్ని కోర్టువారు పిలిచేరు. యెర్రగా, అనాకారులుగావున్న ఆరుగురు వ్యక్తులు హాజరైనారు.

జడ్జి: లూకాస్ ఛాండిలీర్! మదాం లుసియా గర్భం

లోని బిడ్డకు నువ్వే తండ్రివని చెప్పడానికి నీకేమైనా ఆధారాలున్నాయా?

లూకాన్: చిత్తం, వున్నాయండి.

జడ్జి: సెలిస్టిన్ పీర్రీ సిడోయిన్నా! ఈమె గర్భానికి నువ్వే కారకుడవని చెప్పగలవా?

సెలిస్టిన్: తప్పకుండానండి, అయ్యా!

మిగతా నలుగురు సాక్షులూకూడా యిదే చెప్పేరు, ప్రమాణం చేసి.

జడ్జి ఒక్కమాటు నిశ్శబ్దంగా వూహుకుని, తీర్పును చదివి వినిపించేరు:

"వాదియొక్క వాదనప్రకారం మదాం లునియా గర్భంలోని శిసువుకు అతడే తండ్రి, అనడానికి అవకాశాలున్నాయి; అల్లాగే లూకాన్ ఛాండిలేర్, సెలిస్టిన్ పీర్రీ సిడోయిన్నా, యింకా యితరులూకూడా ఆమె గర్భస్థశిసువుకు తామే తండ్రులమని చెప్పడానికీ వీలువుంది. ఐదే ఏ ఒక్కరూ నిర్ధారణగా తమ హక్కును ఋజువుచేసుకోలేకున్నారు.

"కాని, మదాం లునియా తను కొన్ని కారణాలచేత ముందుగానే హిప్పొలైట్‌యొక్క సహాయం అడిగినందుననూ;

"మరియూ (ప్రతివాది వివాహితయున్నా, శాస్త్రప్రకారంగా భర్తయైనవానికి విశ్వాసపాత్రురాలుగా వుండాలని చట్టం వుండుటవల్లనూ) యిటువంటి ఒడంబడికకు హిప్పొలైట్ దిగవచ్చునా యనేది చర్చనీయమైనా, అతనిని సంశయించుట

కపకాశాలు ఋజువు కానందుననూ;

ఈకారణాలవల్ల కోర్టువారు మదాం లునియా నష్టపరిహారంక్రింద యిరువదియైదుఫ్రాంకులు యిచ్చుకోవాలనీ, ఆ మొత్తం హిపోప్లైట్‌కు వృధాకాలహరణం, అసమర్థనీయమైన అన్యాక్రాంతం జరిగినందుకుగాను చెల్లింపబడాలనీ నిర్ణయిస్తున్నారు.''

## జోడు పిన్నలు

'ఆహాహా! మిత్రమా! ఆడాళ్ళు యెల్లాంటి కిల్లాడీలురా!'

'నువ్వల్లా చెప్పేందుకు కారణమేమిటో?'

'నామీద వాళ్ళు యెల్లాంటి అసహ్యకరమైన తమాషా చేసేరనుకున్నావ్!'

'నీమీదే?'

'ఔనురా! నామీదే!'

'ఒకర్తా! చాలామందిరా?'

'ఇద్దరాడాళ్ళురా.'

'ఒకేమాటు యిద్దరా?'

'ఔను.'

'ఏం చేసేరా?'

'ఇల్లా మాట్లాడుకుంటూన్న పడుచువాళ్ళిద్దరూ కెఫీకి బైట వీథిప్రక్క చప్టామీద కూర్చుని గ్లాసులతో సారాయం, నీళ్లూ కలిపి తాగుతున్నారు. ఈ రేచకద్రవం వాటరు కలరు బాక్సులోని రంగులన్నీ కలిపేసినట్లుగా అయోమయం రంగులో వుంది. వాళ్ళిద్దరూ సుమారు ఒకే వయసువాళ్లే; పాతిక ముప్ఫై యేళ్ళ లోపులోనే వుంటారు. ఒకడు చామన చాయగానూ, రెండోవాడు పచ్చగానూ వుండి, కొంచెం షోకిల్లాలుగా కనబడుతున్నారు. స్టాక్ ఎక్స్ఛేంజిలాంటి భారీవ్యాపార స్థలాలకీ, డ్రాయింగు రూమ్సుకీ తరచు పోతూ, ప్రతిచోటా కానవస్తూ, సర్వత్రా నివసిస్తూ, అడ్డమైనచోటా ప్రేమించే బాపతు పెద్ద మనుష్యుల్లా వున్నారు వీళ్ళిద్దరూ. చామనచాయ వాడు అన్నాడు:

'ఆ పొట్టిది, వ్యాపారస్తుని భార్య, ఆమెతో నా సంబంధాన్నిగూర్చి చెప్పేనుగాదురా! డియెప్పీలో బీచిమీద మా యిద్దరకీ మొదట పరిచయం అయింది!'

'ఆఁ! ఔను! చెప్పేవు.'

'ఓరి! బాబిగా! అది యెల్లా తటస్థించుతూంటూందో తెలుసుగాదట్రా?! నాకు పారిస్‌లో ఓ పాతస్నేహితురాలు వుందిరా. అదంటే నాకెంతో ప్రేమ. మా మంచిస్నేహితంలే! ఆవిడకి నేను అలువడిపోయేననుకో - నిజానికి ఆమెకి నేనెంతో విలువనిస్తానురా!'

'నీకు అలవాటైందన్న మాట!'

'నాకేగాదు. ఆవిడా నేనంటే అలువడిందనుకోరా. ఆవిడ మొగుడుకూడా మాంఛి అద్భుతమైన వ్యక్తిఅనుకో. అతనంటే కూడా నాకెంతో గౌరవం. స్నేహపాత్రుడూ, మంచివాడూను! నా జీవితం ఆ కుటుంబంతో బంధించబడి పోయిందనే చెప్పాలనుకోరా.'

'బాగుంది. కానీ!'

'సరే! వాళ్ళు పారిస్‌ను వదలడానికి లేకపోయింది. ఇక నేనో, డియెప్పీలో విధురుడనై వుంటూండేవాణ్ణి.'

'నువ్వసలు డియెప్పీ కెందుకు బోయేవు?'

'గాలి మార్పుకోసం. పారిస్ చప్టాలమీదే యెల్లకాలం వుండాలంటే యెల్లాగోయ్?

'ఆ తరువాత?

'అక్కడ బీచిమీద నే నిందాకా చెప్పేనే, ఆ పొట్టిపిల్లని కలిసేను.'

'అక్కడ ప్రభుత్వ కార్యాలయాధికారి భార్య గదూ?'

'ఔను! ఆమె చాల నిరుత్సాహంగా వుందనుకో. ఆవిడ భర్త ప్రతీ ఆదివారం వస్తుంటాడు. పోనీ అన్నా, వాడు చాల అసహ్యంగా కూడా వుంటాడు. ఆమే గొడవంతా బాగా గ్రహించేను, నేనూ. సరే, నవ్వులూ పువ్వులూ, తర్వాత యిద్దరం నాట్యంకూడా చేసేం.'

'ఆ తరవాతో?'

'ఔను అదీను. కాని అదంతా ఆ తర్వాత జరిగింది. ఏదే మైతేనేం. యిద్దరం కలిసేం, పరస్పరం యిష్టపడ్డాం. నేను ఆమె అంటే చాలా యిష్టపడుతున్నానని చెప్పేను. ఆ మాటలే నాచేత పదే పదే చెప్పించింది, తను బాగా లోతుగా అర్థంచేసుకోడానికి కాబోలు. మరి, నా దారిలో ఆటంకాలు ఆవిడా యేమీా కల్పించలేదు.'

'నీ కామెయందు ప్రేమ కలిగిందా?'

'ఆ! యేదో కొంచెం అనుకో. ఆమె చాల బాగుంటుంది'

'ఆ మొదటిదో?'

'ఆమె పారిస్‌లో వుందిగాదురా! సరే! ఆరువారాల వరకూ ఆనందంగా గడచిపోయింది. ఎల్లాంటి పొరపొచ్చెములూ లేకుండానే మేము యిక్కడికి తిరిగి వచ్చేసేము. ఆడదానిని వదలిపెట్టడం, అందులోనూ ఆమె నీకేమీా ద్రోహం చేయనిదే విడిపోవడం యెల్లాగో నీకు తెలుసునుట్రా?'

'ఓ! బాగా తెలుసురా!'

'ఎల్లాగరా! అబ్బా!'

'వదలిపెట్టేస్తా. అంతే.'

'అదెలా చేస్తావురా?'

'ఆమెనింక చూడనే చూడను.'

'కాని ఆవిడే నీదగ్గరికి వస్తూంటుందనుకో!'

'నే నింటిదగ్గరుండను.'

'ఆవిడ మళ్ళీ మళ్ళీ వస్తుంది?'

'నాకు వంట్లో బాగులేదని చెప్తా.'

'ఉపచారాలు చేయడానికి ఆమే వస్తానంటుందే?'

'ఎల్లాగో మోసం చేస్తాను.'

'దానికీ ఆమె సహించివుండి, నిన్ను వదలదనుకో!

'మొగుడికి ఆకాశరామన్న వుత్తరాలు రాస్తా. నాదగ్గరికి వచ్చే దినాల్లో ఆమెని వాడు కనిపెట్టి చూచేలా చేస్తా.'

'అది చాలా ప్రమాదంరా! నాకు మొహమాటం జాస్తీరా. తగువు తెచ్చుకోవడం యెల్లాగో నాచేతగాదు. అంచేత నాకు వీళ్లు చాలామంది తగులుకున్నారు. కొందర్ని రోజాది కొక్కసారే చూస్తూంటా, మరి కొందర్ని యే పదినెలలకో. మరి కొందరు అప్పుడప్పుడు యే హోటల్లోనో రాత్రి భోజనం యేర్పాటు చేసుకున్నప్పుడు. ఈవిధంగా సిక్కచ్చిగా కాలనియమం చేసుకున్నవాళ్ళతో నాకే యిబ్బందీ లేదుగాని, కొత్తవాళ్ళతో మాత్రం మా చెడ్డచిక్కుగా వుంటుందనుకో. వాళ్ళని కొన్ని నియమాల్లో వుంచడం చాల బాధగా వుంటూందిరా.'

'ఆఁ హాఁ! ఆ మట్టున?'

'ఆ మట్టున-అప్పుడు, యీ పొట్టిపిల్ల వుందే, అదంతా నిప్పులూ మంటలూను. నా తప్పేముంది, చెప్పు? ఆవిడ మొగుడు దినమంతా ఆఫీసులోనే వుంటాడని చెప్పేనుగదూ! అంచేతనే ననుకోని సమయాల్లో ఆవిడ హఠాత్తుగా వచ్చేసేది. రెండు దఫాలు నా వాళీ పిల్లని మెట్లమీద తారస పడింది కూడాను.'

'రాకాసిలంజ!'

'ఔనురా! అంచేత వాళ్ళిద్దరికీ దినసరిగా వాళీలు పంచి పెట్టేను. గందరగోళం లేకుండా వనుకో. శని, సోమవారాలు పాతదానికీ; మంగళ, శుక్ర, ఆదివారాలు కొత్తదానికీ.'

'దానికి పక్షపాతం యెందుకు చూపేవురా?'

'అయ్యో! పిచ్చివాడా! కొత్తది చిన్నదిగాదురా, మరి.

'అంచేత వీళ్ళిద్దరూ కలసి, వారంలో రెండే దినాలు నీ స్వంతానికి వదలిపెట్టేరన్నమాట.'

'నాకది చాల్లేరా.'

'అందుకనే నేను నిన్ను మెచ్చుకుంటానురా!'

'సరే, యీవిధంగా నాలుగు నెలలు అంతా సవ్యంగా జరిగిపోయింది. అంతా బాగానే వుందనుకుంటూ, యెంతో సుఖంగా కాలక్షేపం చేస్తున్నా. చివరికి హఠాత్తుగా గత సోమ వారం అంతా వున్నట్లుండి విరిగి నా నెత్తిన బడింది. ప్రపం చంలో కనివిని యెరగనంత అసహ్యకరంగా, ఆందోళనకరంగా అంతా జరిగిపోయింది.'

'నా మామూలు దానికోసం ఆదినం కనిపెట్టుకునివున్నా. ఒంటిగంటంబావుఅయింది. మాంఛిచుట్టకాలుస్తూ,కలలుగంటూ ఆత్మసంతృప్తిలో, కూర్చుని వుండగానే మామూలుటైము దాటిందని కనిపెట్టేను. అది వేళతప్పదు. అంచేత నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఏదో యాదృచ్ఛికంగా అటంకంవచ్చి, ఆమె రాక ఆలస్యమై వుంటుందనుకున్నాను. తర్వాత గంటా, గంట న్నరా,కాలం గడిచిపోయింది.ఏదోకారణాన ఆమె ఆగిపోవాల్సి

వచ్చివుంటుందని భావించేను. ఏ తలనొప్పో, యిబ్బంది కలగించే అతిథుల రాకో, కారణమై వుండవచ్చు. ఈమాదిరిగా వేచి యుండడం చాలా బాధాకరమనుకో. చిరాకుగా, ఆందోళనగా, బాధగావుండి, చివరకి బైటికి పోవాలని మనసులో నిశ్చయించుకున్నా. ఎటుపోవాలా అనేది తెగక, ఆమె యింటివైపే పోయి చూద్దునుగదా యేదో నవల చదువుతూ కూర్చుం దావిడ.'

'బాగుందా వంట్లో?' అని నేనడిగిన దానికామె ప్రశాంతంగా జవాబిచ్చింది.'

'ప్రియతమా! నేను రాజాలకపోయేను. ఏదో ఆటంకం కలిగిందిలే.'

'ఏమిటా ఆటంకం?'

'మరో కారణంవల్లలే.'

'అదేమిటి?'

'చాలా ఆందోళన కలిగించే చుట్టాలొచ్చేరు.'

'అసలుకారణం నాతో ఆమె చెప్పడంలేదని తెలుసుకున్నా. ఆవిడ చాల ప్రశాంతంగా వుండడంవల్ల దాన్నిగురించి నేనంతగా చాలన చేయనేలేదు. ఈ నష్టాన్ని మరునాడు ఆరెండోదానితో భర్తీచేసుకో వచ్చునని కూడా అనుకున్నాను. మంగళవారంనాడు ప్రభుత్వాధికారి పొట్టిపెళ్ళాంకోసం ఎంతో ప్రేమోద్రేకాలతో కనిపెట్టుకుని కూర్చున్నా. కాని, ఆవిడా వేళకి రాకపోయేసరికి నాకు చాలా ఆశ్చర్యంకలిగింది. ప్రతిక్షణానికీ గడియారంవైపు చూస్తుండడం, ఆతురతతో గడియారపు

ముళ్ళను పరికించడం, యిల్లాగే పావుగంట, అర్ధగంట, చివరికి రెండైపోయింది. ఇంక ఒక్క క్షణమేనా కూర్చోలేక పోయేను. పెద్ద పెద్ద అంగలతో హాలులో పచార్లుచేస్తూ, అంతసేపూ దృష్టంతా కిటికీలోంచి బైటకీ, చెవులు తలుపుతట్టిన చప్పుడవు తుందాయనీ, మెట్లెక్కి మేడమీరికి కెవరైనా వస్తూన్న అలికిడి అవుతుందాయనీ లగ్నంచేసుకొనే వున్నా.'

'రెండున్నర, మూడు గంటలు! హేట్ విసిరివుచ్చుకుని, ఆమె యింటికి పరుగెట్టేను. అయ్యో! దేవుడా! ఆమె నవల చదువుతూ కూర్చుందిరా! 'ఏమిటి?' అని ఆదుర్దాగా అడిగిన నాప్రశ్నకి ఆమె ప్రశాంతంగానే జవాబిచ్చింది.'

'నాకు ఆటంకం కలిగి, రాజాలకపోయేను.'

'ఏమిటది?'

'ఆందోళన కలిగించే చుట్టాలొచ్చేరు.'

'వాళ్ళిద్దరూ అంతా గ్రహించే వున్నారని తక్షణం నేను అనుకున్నాననుకో. కాని ఆమె యెంతో ప్రశాంతంగానూ, వుదాసీనంగానూ వుండడంచూచి, నా అనుమానాన్ని తోసి పుచ్చి,యిదేదో విచిత్రసంఘటనమాత్రమే నని సరిపుచ్చుకున్నా ఆవిడంత దొంగాటకమాడుతుందని నే ననుకోలేదురా. ఓ అర గంటసేపు అక్కడే కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ న్నాము. ఈ అరగంటలోనూ ఆవిడకూతురు,చిన్నపిల్ల వుందిలే, ఓ డజనుసార్లు లోపలికి వచ్చి వెళ్ళింది. నాకు మాచెడ్డ ఆశా భంగం కలిగిందనుకో. సరే, ఆ మర్నాడు వూహించుకో.'

'మళ్ళీ యిల్లాగే జరిగిందీ?'

'ఔను. మర్నాడూ అంతే. ఈవిధంగా మూడువారాలు నడిచింది. నా కెవరూ యే ఆచూకీ యివ్వడంలేదు యేమీ లేదు. కానైతే, నేనంతా అనుమానిస్తూనే వున్నాననుకో.'

'వాళ్ళకంతా తెలుసును?'

'అల్లాగే అనుకోవాలిరా మరి. కాని, యెల్లాగ? అయ్యో! నేనిది తెలుసుకోడానికి ముందు యెంత మథనపడిపోయేనో, ఆ భగవంతుడికే తెలియాలి.'

'చివరికి నువ్వెల్లా తెలుసుకున్నావురా?'

'వాళ్ళ వుత్తరాలవల్లనే. ఒకే రోజున వాళ్ళిద్దరూ, ఒకే మాటలతో నాకు వుద్వాసన చెప్పేసేరు!'

'ఎల్లాగా?'

'ఇల్లా జరిగిందిరా! ఆడాళ్ళకి ఆపాదమస్తకం వళ్ళంతా రకరకాల పిన్నులు వుంటాయని తెలుసును గాదుటా? జుట్టు పిన్నులు నేనెరుగుదును. అవంటే నాకు మా చెడ్డ అనుమానమనుకో. వాటిని పరీక్షగా అందుకనే చూస్తూంటా. కాని, యితరపిన్నులు మరీ కొంపలుతీసే వనుకో. ఆ దిక్కుమాలిన పిన్నులు అన్నీ మనకళ్ళకి ఒక్కలాగే వుంటాయి. మగాళ్లు వట్టి మడ్డిమూకరా. కాని, ఆడాళ్లు ఆ పిన్నుల్లో తేడా యిట్టే పట్టు కుంటారు; కుక్కనీ, గుర్రాన్నీ మనం పోల్చుకున్నట్లేననుకో.'

'సరే, ఓ రోజున పొట్టిపిల్ల ఓ తలపిన్ను తీసి, నా అద్దం దగ్గరే కాగితానికి గుచ్చి, వదలివుంటుంది. మర్నాడు

నా వాళీది వచ్చి, నల్లపూసలాంటి యీ పిన్ను నెల్లా పసికట్టిందో యేమిటో, అది తీసి, తను ధరించే మరో పిన్ను అక్కడుంచింది. అదీ యిల్లాగే వుంటుంది కాని, మాదిరిలో భేదం వుందట.'

'ఆ మర్నాడు వుద్యోగిభార్య తన ఆస్తిని తీసుకోందా మని వెళ్లి, మాయకుడైన పిన్నును కనిపెట్టింది. దాని అనుమానం కొద్దీ, అక్కడే యీసారి రెండుపిన్నులుంచి, శిలువగుర్తు వేసింది. మర్నాడు మామూలుది వచ్చి చూచి, యీ టెలిగ్రాఫ్ సిగ్న లుకు జవాబిచ్చింది: పిన్నుమీద పిన్ను మూడూ కాగితానికి గుచ్చి వెళ్లింది. ఈమాదిరిగా ఒక్కమాటా పలుకూ లేకండా వాళ్లిద్దరూ ఒకరొకరికి వార్తలు అందించుకుంటున్నారు. గూఢ వార్తాహరణం! మామూలుది వుండే, అది కొంచెం ధైర్యశాలి. చిన్న కాగితాన్ని పిన్నుకు గుచ్చి అక్కడుంచి, దానిమీద రాసింది.'

'సి.డి., పోస్టే రెస్టాంటే, బౌలివార్డ్ మల్ హెర్బిస్"

'అక్కడినుంచి వాళ్లిద్దరూ జాబులు రాసుకుంటూ వచ్చేరు. వాళ్లిద్దరిమధ్యా జరిగిన దొంగాటకం యింతతో ఆగందే! చాల జాగ్రత్తగా వాళ్ళు పని నారంభించి, వెయ్యి న్నొక్క యెత్తులతో, యిటువంటి సందర్భాల్లో అవసరమైన తెలివితేటలతో, కూపీ లాగ నారంభించేరు. మామూలుది మంచిధైర్యం చేసి, పొట్టిదానితో కలవడానికి యేర్పాటు సూచించింది. వాళ్లిద్దరూ యేమేమి మాట్లాడుకొన్నారో నాకు

తెలియదు. కాని వాళ్ళ కలయికకి ఫలితంగా నాకు ఉద్యోగం పూడింది. నష్టపడ్డది నేను! ఇదీ కథ.'

'ఇంతేనుటారా?'

'ఇంతే!'

## అయ్యో! చెడ్డాను!

ప్రేమ మృత్యువుకంటె బలవత్తరమైనది; అందుచేత యే యితర ఆపదకంటెనూకూడా ప్రేమ గొప్ప ఆపత్తు అని చెప్పి తీరాలి !

వెనకటికొక యూదు యువకుడుండేవాడు. ఏ రకంగా చూచినా ఆతడేమంత అనాకారిమాత్రంగాడు. యూదు వాడల్ని వెలిగావుంచే రోజులవి. ఘెట్టోలనబడే యూదువాడలతాలూకు పంచాంగాల్లో పేర్కొనబడే ప్రభువర్గాల్లో యీ యువకుని పేరు ప్రముఖంగా వుంటూండేది. ఈ యోధుడు స్టాకు ఎక్స్ఛేంజిలో జరిగిన గత మహాసంగ్రామంలో తీవ్రంగా దెబ్బ తిని క్షతగాత్రుడై యుద్ధరంగాన్ని వీడినవాళ్ళలో ఒకడుకూడా నని మనం గుర్తుంచుకోవాలి! 1873 లో వియన్నానగరంలో యూనివర్సల్ యెగ్జిబిషన్ దిగ్విజయంగా సాగుతూన్న రోజులవి. ఇతగాడు తన ఆలోచనల్ని కాస్త కుదుట బెట్టుకునేందుకూ, అక్కడి వింతలైగా విశేషాలూ చూసి, ఆ ఆకర్షణల్లో బడి యితరవిషయాలు మరిచేందుకూ ఆ యెగ్జిబిషన్‌కి తరుచు వెళు

తూండేవాడు. ఒక రోజున అక్కడి రష్యన్ సెక్షన్లో నూతన వివాహిత దంపతుల్ని యీ యూదుయువకుడు చూడ్డం తటస్థించింది. వారు సామాన్యదుస్తులు ధరించి, తక్కువ రాబడి గలవాళ్లుగా కనబడుతున్నారు.

వాళ్ళు తక్కువరాబడి గలవాళ్లనే కారణాన్ని పురస్కరించుకొని, మన స్టాకుబ్రోకరు వీరుడు ఆ ప్రమదామణికి రహస్య సంజ్ఞలు చేయడానికి ప్రారంభించేడు. ఇతగాని వెకిలి చేష్టలు వియన్నానగరపు నట్టువరాండ్రకైతే ఆహ్లాదజనకంగా వుండేవేగాని మర్యాదస్తులైన గృహిణులకు మాత్రం అవమానకరములే. గోథానగర పంచాంగంలో యీ రాణిగారి పేరు కూడా మనం చూడవచ్చు. రాజ్యాలు లేకున్నా రాజకుటుంబీకులందరి వంశవృక్షాలూ యీ పంచాంగాల్లో ప్రముఖంగా ప్రకటించబడే రోజులవి. ఈ యిల్లాలిపేరుకూడా అల్లాటివాటిల్లో ఒకటి. ఫెట్టో మనిషికీ, వాని వెర్రిచేష్టల్ని చూసేసరికి యీమె మనస్సులో ద్వేషంలాంటిదేదో భావం పుట్టి, ఆమె మెదడంతా వివిధ ప్రతీకారాలోచనలతో నిండివుంటూ వచ్చింది.

ఈ స్టాకుబ్రోకరికి ఆమెపై నిజంగానే తలమునకగా ప్రేమపుట్టుకొచ్చింది. ఒకరోజున యెగ్జిబిషన్‌లో యితగాడు ఓ సందర్భాన్ని చూసుకుని ఆమెకి దగ్గరగా వెళ్లడానికి కూడా సాహసించేడు. ఆ సందర్భం యెల్లావచ్చిందంటే ఒక రష్యన్ వున్ని అంగడిలోని షో-కేసు ముందు ఆమె తన్మయురాలై చూస్తూ నిల్చునిపోయింది; ఆమెభర్త యిదంతా గమనించి

తన నెత్తిన యేదో పెద్దఖర్చే పడుతుందనే బెంగతో ప్రాణప్పడి పోయినిల్చున్నాడు; ఆ అదను కనిపెట్టి యీ ప్రేమాంధుడు ఆమె కతిసమీపంలోకి జొరబారేడు.

'ఆ దుస్తు చూడండి!' అన్నదా రాణి, తన నల్లని నేత్రాల్లో ఆనందోత్సాహాలు తొలుకాడుతుంటే. 'నాకది కావాలి!'

అంటూ దుస్తుమీది తెల్లని టికెట్టును చూసింది, ధర తెలుసుకోడానికి.

'నాలుగువేల రూబుళ్ళు అంటే సుమారు ఆరువేల ఫ్లోరిన్లు!' అందామె నిరాశా సూచకస్వరంతో.

ఈ సందర్భంలో దగ్గరగానేవున్న స్టాకుబ్రోకరు కలుగ జేసుకుని తన ఔదార్యాన్ని వెల్లడించేడు.

"అంతే అనుకోండి. కాని దాని లెక్కేమిటి? తమబోటి సుందరాంగులముందర యిల్లాటివెన్ని మొత్తాలైనాదిగదుడుపే!"

'కాని నాభర్త ఆ స్థితిలో లేనిదే...'

'మీ నిష్ఠురతనూ, కాఠిన్యాన్నీ ఒక్కసారికైనా కొంచెం తగ్గించుకుంటే...నన్నీ అమూల్యవసనాన్ని మీ పాదాల ముందు నివేదించుకోనీండి.' అన్నాడు ఘెట్టోవాసి ఆ యువతితో, మెల్లగా.

'మీరు పరిహాసమాడుతున్నారనుకుంటున్నా.'

'నేనా? అబ్బే! కాదు!'

'మీరు పరిహాసమాడుతున్నారనే భావిస్తున్నాను.

ఎందుకంటే మరి మీరు నన్ను అవమానించ తలపెట్టేరని అనుకోను.

'కాని, రాణిగారూ! మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నా!'

'నాకు కోపం తెప్పించకుండా వుండేందుకు అది మరో కారణం గావాలిగదా!'

'కాని...'

అతిచురుకైన ఆ యువతి కేకేసింది:

'అది చాల అసభ్యతగావుంది! చర్మవసనధారిణియైన రతీదేవి (సుప్రసిద్ధకవి సాబేర్ మసోఖ్ నవలలో పాత్ర) తన బానిసను కొట్టినట్లు కొరడాతో నీ వీపు చిట్లగొట్టగలనుసుమా!'

స్టాకు ఎక్స్ఛేంజిరాజు అమితాసక్తితో జవాబిచ్చేడు:

'నన్ను మీ బానిసగా వుండనీండి. దయచేసి! అప్పుడు మీరేమి చేసినా సంతోషంగా స్వీకరిస్తా. ఈ శాబుల్ చర్మం ధరించి, చేతులో కొరడా పుచ్చుకొంటే మీరా కథలోని నాయికవలెనే అతిమనోహరంగా వుంటారని నానమ్మకం!'

రాణి ఆ మానవుణ్ణి ఒకక్షణమాత్రం విలక్షణమైన చిరునవ్వుతో పరికించి, అంది:

'ఐతే, నేను మీమాటలను అనుకూలభావంతో వినాలంటే, నేను కొరడాతో కొట్టినా సహిస్తారన్నమాటేనా?'

"సంతోషంగా!"

'సరే, ఐతే కానీండి! కొరడాతో యిరవైఐదు దెబ్బలు కొట్టనీండి. ఇరవైఐదో దెబ్బ కొట్టేక నేను మీదాననే అవుతా' అన్నదామె త్వరగా.

'మీరు నిజంగానే అంటున్నారా?'

ఫోటోమనిషి ఆమె చేతిని పట్టుకుని, అతిలాలసగా పెదవుల కద్దుకున్నాడు.

'నే నెప్పుడు రావచ్చును?'

"రేపురాత్రి ఎనిమిది గంటలకి."

'నాతో కూడా యీ దుస్తునూ, కొరడానూ తెచ్చేదా?'

'అఖ్ఖ్లేదు. ఆ విషయమంతా నేనే చూచుకుంటా.'

మర్నాటి సాయంత్రం మోహాంధుడైన స్టాకుబ్రోకరు సరిగ్గా వేళకి ఆ మోహనాంగి యింటికి వచ్చేసేడు. ఆమె వంటరిగానే వుంది. సోఫామీద పవ్వళించి, నల్లటి చర్మపు సగాన్ని చుట్టబెట్టుకుని, చేతకొరడా పట్టుకొనివున్న రాణీ చిన్న చేతి నా స్టాకుబ్రోకరు ముద్దెట్టుకున్నాడు.

'మన ఒప్పందం గుర్తుందిగదూ?' అని ప్రారంభించిం దామె.

'తప్పకండాను. అది మరుస్తానా? కొరడాతో పాతిక దెబ్బలు మీచేతిలో తినడం, పాతికో దెబ్బ పడ్డాక నామాట మీరు వినడం, యింతేగదూ;' అన్నాడు స్టాకుబ్రోకరు.

'ఔను, కాని ముందుగా నేను మీచేతులు బంధించాలి.'

ఆ కామాంధుడు అందుకు నిస్సంకోచంగా అంగీక రించేడు. ఆ యభినవ డెలీలా తన చేతుల్ని వెనక్కి విరిచి కడుతూంటే అతగాడు సవినయంగా ఆమెముందు మోక రించేడు. కొరడానెత్తి ఛెళుక్కుమని కొట్టిం దామె.

'అయ్యోయ్! చచ్చేలా తగిలింది దెబ్బ. బాబోయ్!' అని అరిచేడు స్టాకు-మార్కెట్ రాజు.

'నిన్ను బాధించాలనే కొడుతూంట!' అందామె పరిహాస సూచకమైన నవ్వుతో. నిర్దయగా దెబ్బమీద దెబ్బ ఆమె కొడుతూనేవుంది. దురదృష్టవంతుడైన ఆ మూర్ఖుడు బాధతో మూలుగుతూన్నా ప్రతీ దెబ్బా తనను స్వర్గసుఖానికి దగ్గరగా కొనిపోతూందని పూరటజెందుతూ వచ్చేడు.

ఇరవైనాలుగో దెబ్బ కొట్టి ఆమె కొరడాను క్రింద పడేసింది.

'ఇరవైనాలుగే అయినాయి!" అన్నాడు దెబ్బతిన్న సరసాగ్రేసరుడు, డాన్ జువాన్ లాగ.

'ఇరవైఐదో దెబ్బను నీకు బహుమతిగా యిచ్చేస్తున్నాను!' అందామె నవ్వుతో.

'ఇప్పుడింక నా దానివే. పూర్తిగా నా దానివే!' నన్నాడు వుద్రేకంగా నా ధనాంధుడు.

'నువ్వేమనుకుంటున్నావేమిటి?'

'నన్ను కొట్టనీయలేదూ?'

'ఔను! కాని, యిరవైఐదో దెబ్బ తర్వాతనే నీకోర్కె తీరుస్తానని చెప్పలేదూ? మీకు ముట్టినవి యిరవైనాలుగే. ఇందుకు నాకు సాక్షులుకూడా వున్నారు!' అన్నదా నీతిమంతురాలు.

ఈ మాటలంటూ ద్వారానికడ్డంగా వున్న తెరను తొలగించేసరికి ఆమె భర్తా, మరోయిద్దరు పెద్దమనుష్యులూ నవ్వుతూ లోనికివచ్చేరు. ఒక్కరెప్పపాటు కాలం ఆ ప్రాకుబోరికి నోట్లో మాట రాకండా ఆమెముందు మోకరించినవాడల్లే శిలా ప్రతిమలా వుండిపోయేడు! అప్పుడింక గాఢంగా నిట్టూర్చుస్తూ; 'అయ్యో! చెడ్డాను!' అనేమాటమాత్రం అనగలిగేడు.

# రోజు బాగున్న దొంగ

వాళ్ళు బాబ్బిజోలలో ఓ హోటల్లో భోజనం చేస్తూ బాతాఖానీ కొడుతున్నారు.

'చెపుతున్నానుగా, ఎవరూ నమ్మరుఒ!'

'ఫర్వాలేదులే, చెపుదూ. తప్పదింక!'

'ఐతే సరే. జరిగినకథ యిదీ. కాని ఒకటిమాత్రం గుర్తుంచుకోండి. నే చెప్పబోయేదాంట్లో ఒక్కముక్కకూడా అబద్ధం లేదు. అసంభవంగా వున్నట్లగుపించినా ప్రతిఅక్షరం నిజంగా జరిగిందేననుకోండి!' అని ప్రారంభించేడా ముసలిచిత్రకారుడు.

'మేమూ రాత్రి పోరియల్ యింట భోజనాలు చేసేం... భోజనాలు చేసేమని అన్నానంటే, చిత్తుగా త్రాగేసి వున్నామని వేరే చెప్పనక్కర్లేదు. మేమంటే తెలిసిందా, ముగ్గురం, ఆకతాయి కుర్రకుంకలం! పోరియల్ యిప్పుడింక లేనేలేడు.

రెండో వాడు లీ పోటేవిన్. పడవలకి రంగులేస్తాడు వాడు. పాపం వాడూ చచ్చిపోయాడు. మూడో వాణ్ణి నేను.’

‘మా స్టుడియోని చేర్చివున్న చిన్నగదిలో నేలమీదే మేం ముగ్గురం చాపచుట్టుగాపడి దొర్లుతున్నాం. మాలోకకా స్తమతి సరిగ్గా వున్నవాడు పోటేవిన్ ఒక్కడే! సోరియల్ యెప్పుడు తాగినా మతి బాగా చంచలంగా వుంటుంది. వాడు వెల్లకిలా పడుకున్ని, కాళ్లు కుర్చీపైకి పెట్టి, యుద్ధం, సిపాయీల దుస్తుల్ని గూర్చి మాట్లాడుతున్నాడు. ఉన్నట్లుండి వాడు హఠాత్తుగా లేచివెళ్ళి బీరువా తెరచి అశ్వసైనికుని యూనిఫారం తీసి తొడుకున్నాడు. ఆ తర్వాత పదాతిసైనికుని యూనిఫారం తెచ్చి పోటేవిన్‌ని తొడుక్కోమన్నాడు. వాడు ఒప్పుకోక పోయేసరికి మేమే బలాత్కారంగా వాణ్ణా యూనిఫారంలో దిగేసేం. ఆ యూనిఫారం యెవడో మహాకాయుడిదేమో పోటేవిన్ దాంట్లో దూరి—అజాపజా లేకుండా పోయేడు. నావంతుకి మరోరకం యూనిఫారం కైరాసీర్‌ది వచ్చింది. గుండెలకీ, వీపుకీ చర్మపు ఆచ్ఛాదనలుంటాయి, నా యూనిఫారానికి. ఈ మాదిరిగా తయారైన మాచేత సోరియల్ డ్రిల్లుకూడా చేయించేడు, చచ్చేలాగ. మళ్ళా వున్నట్లుండి అన్నాడుగదా; ‘సిపాయీలం గనక సిపాయీల్లాగే తాగాలిరా!’

‘ఓ పెద్దగిన్నెలో పంచామృతం తయారుచేసేం. పాతపటాలపుపాటలు గొంతెత్తి అరుస్తూ, పంచ్ గ్లాసులకొద్దీ తాగేస్తుంటే మాకీలోకంలో వున్నట్లేలేదు. ఎంత తాగినా మాలో

కల్లా పోలేవిన్‌కి మతి పూర్తిగా పోదని చెప్పేనుగదూ. వాడు వున్నట్టుండి, 'ష్! స్టూడియోలో యేదో అలికిడి అవుతూంది రా!' అన్నాడు.

'దొంగ! కన్నగాడు!' అంటూ సోరియల్ తూలుతూనే లేచేడు. 'ఇంకానయమే! అదృష్టవంతులం!' వాడు మార్సెలైజ్ యుద్ధగీతం అందుకున్నా డాపళంగా:

'పౌరులార! సాయుధులు కండోయ్!'

'వాడు గోడమీదనే తగిలించివున్న రకరకాల ఆయుధాలుతీసి, మా మా యూనిఫారాలకు తగినట్లుగా మాకందించుతూంటే మేము యుద్ధసన్నద్ధులమయేం. నాకు చేతుపాకీ, పట్టా కత్తీ; పోలేవిన్‌కి బాయ్‌నెట్‌తో వున్న పెద్దతుపాకీ; సోరియల్‌కి కావాల్సింది లభించనందున పిస్తోలూ, గండ్రగొడ్డలీ-యివీ మా సాధనాలు. స్టుడియోతలుపులు భద్రంగా తెరచి, పటాలం పురోగమించింది. గదిమధ్యకి వెళ్ళేక సోరియల్ మళ్ళా అన్నాడు:

'నేను జనరల్‌ని! (నన్నుద్దేశించి) ఆశ్వికులు! శత్రువు పారిపోకుండా చూడాలి! అంటే తలుపు గడియపెట్టెయ్! (పోలేవిన్‌నుద్దేశించి) పదాతులు! నాకు అంగరక్షకులుగా వుండాలి!'

'నాకిచ్చిన ఆజ్ఞల్ని పాలించి, మళ్ళా పటాలాన్ని చేరుకున్నా. మావాళ్ళు పెద్ద తెరవెనక పొంచివుండి శత్రువు ఆచూకీ కనిపెడుతున్నారు. నేనక్కడికి వెళ్ళేసరికి యేదో పెద్దచప్పుడైంది. కొవ్వొత్తిదీపం తీసుకెళ్ళి చూద్దునుగదా స్టుడియో డమ్మీ (కొయ్యబొమ్మ)మీద పోలేవిన్ బాయ్‌నెట్ ఛార్జి చేస్తున్నాడు!

సోరియల్ గండ్రగొడ్డలితో దాన్ని నరకుతున్నాడు! జరిగిన పొరబాటును నివేదించేను, జనరల్‌కి. వాడన్నాడుగదా: "జాగ్రత్త! ఇక భద్రంగా వుండండి!"

'అందరం కలిసి యిరవై నిముషాలసేపు స్టూడియో మూలమూలలన్నీ గాలించేసేం. ఏమీ కనపడలేదు. పోటేపిన్‌కి యేం తోచిందోగాని కబ్బోర్డులో చూద్దామన్నాడు. కబ్బోర్డు చాల పెద్దదీ, లోతైనదీకూడాను. లోపల చిమ్మచీకటి. కొవ్వొత్తి పట్టుకుని దాంట్లోకి పురోగమించిన నేను గాభరాతో తిరోగమించేను. దానిలోపల యెవడో నిజంమనిషి వుండి, నావైపే గుడ్లురిమి చూస్తున్నాడు. ఎల్లాగో సంబాళించుకుని, కబ్బోర్డు తలుపు మూసేసి, అందరం కలిసి సంప్రదింపులుసాగించేం.

'అందరిదీ తలో అభిప్రాయం అయింది. పొగ పెట్టాలంటాడు, సోరియల్; పస్తుపెట్టి లొంగదీయాలంటాడు, పోటేపిన్; మందుతో పేల్చెయ్యా లన్నాను, నేను. తర్జనభర్జన జరిగింది. ఆఖరికి పోటేపిన్ సూచన కంగీకరించి, పంచామృతాన్ని తెచ్చి కబ్బోర్డుముందరే కూర్చుని, దొంగపేరుమీద మళ్ళా సేవించేం. ఎన్నిగ్లాసులు తాగేమో లెక్కలేదు. కాని కొంతసేపయ్యాక జనరల్ యింకో సూచన గావించేడు, 'ఖైదీని బైటికి తెచ్చి ఒక్కసారి చూద్దాంరా!'

'హుర్రా!' అని హుంకరించేను నేను. ఆయుధాల్ని ఒక్కుమ్మడిగా యెత్తి ఝళిపిస్తూ కబ్బోర్డుమీదికి వెళ్ళిపడ్డాం. ఎల్లాగైతేనేం తలుపు తీసి సోరియల్ పిస్తోలుమీట టకటక

లాడిస్తూ ముందు జొరబడ్డాడు. పిస్తోలు ధట్టించివుతే దనుకోంది. వాడివెనకే నేనూ, పోటేవిన్నూ గావుకేకలేస్తూ లోపలికి జొరబడ్డాం. చీకట్లో చిందులాటఅయేక యెల్లాగైతేనేం దొంగని పట్టుకుని బైటికిలాక్కొచ్చేము. వాడిగుడ్డలు మాసి, పీలికలై వున్నాయి; తల నెరసిపోయి, చింపిరిగావుంది. వాడూగుమెక్కించి వున్నాడు. పాతదొంగలా కనపడ్డాడు. కాళ్ళూ చేతులూ కట్టేసి, వాణ్ణి కుర్చీలో కూలవేసేం. ఇంతచేసినా వాడు నోరు మెదపనే లేదు.

'ఈ నిర్భాగ్యుణ్ణి విచారణకి పెడదాం!' అన్నాడు, సోరియల్. తాగినమీదట వాడిలో మాంఛి గంభీరత కలిగింది. నాకూ అది సబబుగా కనిపించే స్థితిలోనే వున్నా. నేను ప్రాసిక్యూషను తరఫు, పోటేవిన్ డిఫెన్సు తరఫూ వాదించేందుకు నిర్ణయమైంది. ఆఖరికి డిఫెన్సు వకీలుతప్ప మిగతా అందరం, ఖైదీకి మరణశిక్ష విధించాలనే తీర్పును అంగీకరించేము.'

'ఇప్పుడు శిక్ష అమలుజరుపుదాం!' అన్నాడు సోరియల్. 'కాని, పురోహితుని ముందర తన పాపాల్ని అంగీకరించి, పశ్చాత్తాపపడనిదే వాడు చావడానికి వీల్లేదే!' అంతరాత్మ పీకించినట్లు వాడిట్లా అన్నాడుగాని నేను అభ్యంతరం చెప్పేను.'

'చాలరాత్రి ఐంది! ఇప్పుడు పురోహితు డేమిటి?' ఐతే నన్నే పురోహితునిస్థానం తీసుకోమన్నారు. పాపాలన్నీ అంగీకరించి, పశ్చాత్తాపపడమని దొంగతో చెప్పేసరికి వాడు బెంబేలు పడిపోయేడు. వీళ్ళెక్కడి పిశాచపు పాడెగట్టలో అనుకొని

వుంటాడు. నూతులో పడ్డట్టు హీనస్వరంతో, వణకుతూ,–

'ఏమిటిది? చెప్పండి? మీరిది చేస్తారేమిటి?' అన్నాడు. వాడు మాట్లాడ్డాని కదే మొదలు.

'సోరియల్ వాణ్ణి మోశరించమని ధాష్టీకంచేస్తూ, వాడికి బాప్టిజం కాలేదేమోననే శంకతో దొంగనెత్తిమీద ఓ గ్లాసెడు సారా గుమ్మరించేడు. 'నీ పాపాలు అంగీకరించు! నీకు ఆఖరి ఘడియలు వచ్చేయి!'

'బాబోయ్! సాయం! చంపేస్తున్నారు! బాబోయ్!' అని గావుకేకలేస్తూ, దొంగ క్రిందపడి దొర్లుతూ, అందినవన్నీ తన్నేస్తున్నాడు. వీడి కేకలకి యిరుగుపొరుగువాళ్ళు లేస్తారేమోనని వాడినోట్లో గుడ్డలు కుక్కేసేం.'

'రాండి! పని పూర్తిచేసేదాం!' అన్నాడు తాలిమి గోల్పోయిన సోరియల్. పిస్తోలు దొంగమీద బారుచేసి, మీటనొక్కేడు. నేనూ తుపాకిని పేల్చేను. కాని రెండూకూడా మందులేనివే కావడంవల్ల పేలనేలేదు. పోటేపిన్ యిదంతా చూస్తూ హఠాత్తుగా;–

'మనకి యీ మనిషిని చంపేందుకు నిజంగాహక్కుందా? అంటా' నన్నాడు.

'వీడికి మరణ శిక్ష విధించేం గాదటూ?' అన్నాడు, సోరియల్.

'ఔననుకో! కానిమనకి పౌరుణ్ణి చంపే అధికారంయెక్కడుందిరా? పోలీసు స్టేషన్‌కు అప్పగించుదాం!'

'వాడన్నమాటా సబబే. కాని ముసలిదొంగ నడవలేడు గదా. అంచేత వాణ్ణోబల్లమీద పడుకోబెట్టి కట్టేసి, నేనూ పోలీవినూ చెరోప్రక్కా సాయంపట్టేస్తుంటే, వెనక సోరియల్ గార్డు-డ్యూటీ వహించి నడిచేడు. స్టేషన్లో అధికారి మమ్మల్ని బాగా యెరుగును. మా పరిహాసాలు, ఆఘాయిత్యాలు తెలిసిన వాడవడంవల్ల యిదికూడా ఆకతాయితన మనుకుని, నవ్వుతూనే ఖైదీని తీసుకోడానికి నిరాకరించేడు. సోరియల్ గట్టిగా చెప్ప బోయేసరి అతడు మమ్మల్ని కఠినంగా మందలించి, పిచ్చివేషాలు కట్టిపెట్టి యింటికిబోయి గమ్మునవుండమన్నాడు. ఇంక చేసేదేమీ లేక ఆ దొంగవెధవని మళ్ళా మోసుకుంటూ సోరియల్ యింటికి వెళ్ళిపోయేం.'

'ఇప్పుడు వీ ణ్ణేంచేద్దాంరా?' అన్నాను.

పోలీవిక్ కి సానుభూతి కలిగింది.

'పాపం! ముసలాడుచాలా అలిసిపోయాడురా?' అన్నాడు.

'దొంగ అప్పటికే సగం చచ్చినట్లున్నాడేమో నాకు కూడా వాణ్ణి చూస్తే జాలేసింది. (నాజాలికి కారణం షాంపేన్ ప్రభావమేనని నిస్సందేహంగా చెప్పగలను.) నేను వెంటనే దొంగ నోట్లోంచి గుడ్డలు తీసేస్తూఅడిగేను:

'ఎల్లా వుందిరా, ముసలాడా?'

"అయ్యో! దేవుడా! నాప్రాణం కడముడుతూంది!" అని మూలిగేడు దొంగ.

'సోరియల్ కూడా మెత్తబడిపోయి దొంగ కట్లు విప్పేసి, చిరకాలమై చూసిన మిత్రుని మాదిరిగా ఆదరణ నారంభించేడు. తక్షణం ఓ పెద్దగిన్నెలో పంచామృతం తయారుచేసేం. మొదటిగ్లాసు అందియ్యగానే ఆముసలాడు దాన్నొక్కచిటికెలో ఖాళీ చేసేడు. గ్లాసుమీదగ్లాసు ఖాళీఅవుతూంది. మేం ముగ్గురం కలిసి పట్టించిన కంటె ఆ ముసలాడొక్కడే యెక్కువ తాగుతున్నాడు. తెల్లవారవస్తూంటే, వాడు మెల్లిగా లేచి, తాపీగా అన్నాడు'—

"నేనింక వెళ్ళిపోవాల్సివస్తుంది. ఇప్పుడే యింటికి వెళ్ళిపోతాను."

"దొంగాణ్ణి వెళ్ళిపోవద్దని బ్రతిమాలుకొన్నాం. కాని వాడు మామాట వినందే! ఒక్కక్షణంకూడా వుండనన్నాడు. మాకెంతో విచారం కలిగిందనుకోండి. వాడితోకూడా ముందరి ద్వారం వరకూ పోయి దిగబెట్టేం. సోరియల్ దీపాన్ని పైకెత్తి పట్టుకుని చూపిస్తూ అన్నాడు:

'ఆఖరిమెట్టు చూసుకుని మరీ దిగు, బాబాయ్!'



# రతీదేవి

పూర్వకాలం గ్రానిడానగరంలో గొప్ప యూదుపండితు డొకడుండేవాడు. ఆయన యూదు ధర్మశాస్త్రాల్లో సిద్ధి; శ్రోత్రియత్వం, పాండిత్యం, మేధావిత్వం, దైవచింతన మొదలైనవాటిచేతనే గాక రతీదేవివంటి భార్యను కలిగివుండడంవల్ల కూడ ఆయన ప్రసిద్ధికెక్కేడు. ఆ చుట్టుప్రక్కలంతా ఆమెను 'వీనస్' అని పిలుస్తారు. రోమనుల సౌందర్యాధిష్ఠాన దేవతయైన 'వీనస్' కు యీడైన సౌందర్యంచేతనే గాక బృహస్పతివంటి పండితుని భార్యయగుటచేకూడ ఆ సుందరి కీర్తి నలుదిశలా వ్యాపించింది. సర్వసాధారణంగా యూదు తత్వవేత్తలు పాండిత్యానికే గాక కురూపిణులు, అంగవికలురూ ఐన భార్యలకు గూడ ప్రసిద్ధి; అందుచేత, సాంప్రదాయ విరుద్ధంగా దివ్యసుందరిని భార్యగా బడసిన యీ పండితు డందరి యెరుకకు రాగలిగేడంటే వింత యేముంది?

యూదీయుల ధర్మశాస్త్ర గ్రంథాన్ని 'తాల్ముద్' అంటారు. దానిప్రకారం, వివాహసంబంధాలన్నీ స్వర్గంలోనే నిర్ణయించబడతాయనీ, యెక్కడ మగశిశువు జన్మించినా దైవవాణి వాని భార్యపేరును వుచ్చరిస్తుందనీ, అట్లే ఆడబిడ్డ పుట్టగానే ఆమె భర్తనామం వుచ్చరించబడుతుందనీ తెలుస్తోంది. ఏ గృహస్తుగానీ తన తోటలోని మంచి పండ్లను యితరులకు విక్రయించి, యింట్లోపిల్లలకు కుంటి గ్రుడ్డి పండ్లను, దెబ్బతిన్నవాటినీ వుపయోగించినట్లే దేవుడుకూడా తన కాత్మీ

యుతైన 'తాల్‌ముద్' ధర్మశాస్త్రజ్ఞులకు యీ పురుషు లెవరూ స్వీకరించనొల్లని స్త్రీలనే యిస్తాడని ఆ మతస్థుల నమ్మకం.

కాని దేవుడు, యీ పండితునికి రతీదేవివంటి భార్య నొసగి, సాంప్రదాయానికి వ్యతిరేకం చేయడంలో ఆయన వుద్దేశం యీ మినహాయింపుమూలంగా అసలు సూత్రానికే బల మొసగడం, ఆ సూత్రంయొక్క కఠోరతను గానరాకుండా జేయడం అయివుంటుందేమో! ఆ పండితునిభార్య యే రాజ సింహాసనానికైనా వన్నె తేగలదనడం మాత్రం నిస్సంశయం. లేదా సాలభంజికగా యే శిల్పానికైనా సౌందర్యాన్ని ఒనగూర్చ గలదు! పొడవైన ఆమె దేహయష్టి అత్యద్భుతసౌందర్యంతో భోగోచితమై వుంటుంది. ఆమె తలకట్టు సొంపుతో మనోహరంగా నల్లని దట్టమైన కురులతో ఒప్పారుతూంటుంది. సుదీర్ఘమైన ఆమె కనుబొమలక్రింద నల్లని విశాలనేత్రాలు చంచలదృష్టుల్ని బరపుతూ ప్రకాశిస్తూంటాయి. పొడవైన ఆమె చేతులు దంతంతో చెక్కబడినట్లు తెల్లగా నాజూకుగా వుంటాయి.

ఈ ఉజ్జ్వలసుందరి స్వతస్సిద్ధంగా శాసించుటకే జన్మించిందని తోస్తుంది. యెదుట బడినవారెవరికైనా ఆమె పాదాల దగ్గర సేవజేస్తూ వుండిపోవా లనిపిస్తుందనుకోండి. చిత్రకారుని కుంచె, శిల్పి వులి, కవి కలం, వీట్లకి పని కల్పించడానికే అవత రించినట్లున్న ఆ అపురూపసుందరి అకవినగాచిన వెన్నెలవలె నిష్ప్రయోజన జీవితాన్ని గడుపుతూంది. అమూల్యమైన

వున్ని దుస్తులు ధరించుకుని కుర్చీలో సుఖాసీనయై పరధ్యానంగా స్వాప్నికదృష్టులతో వీధిలోకి చూస్తూ ఆమె దినమంతా గడుపుతూంటుంది.

ఆమె సంతానవతిగాదు. అందుచేత మరే వ్యాపృతీ లేదు. తత్వవేత్తయైన ఆమె భర్త రేయింబగళ్ళు ప్రార్థనలతోను, గ్రంథావలోకనంతోనూ కాలం బుచ్చుతూంటాడు. తాల్ముద్ వేదాంతుల కత్యంతప్రియమైనది 'పరావిద్య' ఒక్కటే. 'కబ్బాలా' అనే ముక్తిసుందరియే ఆ పండితునకు భార్యకంటె ప్రియతమురాలు. ముక్తిమార్గాన్వేషణలో నిమగ్నుడైన భర్తకు రతీదేవివంటి భార్య వున్నా ప్రయోజనం లేదుగదా! పోనీయంటే గృహకృత్యాలలో కాలం బుచ్చుదామనికైనా వారు ధనవంతులగుటచేత యింటిపనంతా దాసదాసీలే చేస్తారు. వారానికోసారి 'కీ' యిస్తే తిరిగే గడియారంవలె వాళ్ళ యింటిపనులన్నీ వాటంతటవే జరిగిపోతూంటాయి. వారింటికెవరూ బంధుమిత్రాదులు వచ్చేవారుగాదు; ఆమే యెక్కడికీ వెళ్ళేదిగాదు. ఎప్పుడూ యింటనే కూర్చుని కలలు గంటూ ఆలోచిస్తూ, ఆవులిస్తూండేది. ఈ విధంగా కొంతకాలం గడిచింది.

♦ ♦ ♦

ఒకరోజున భయంకరమైన తుపాను విజృంభించి పట్టణాన్నంతనూ అల్లకల్లోలం గావించింది. ఉరుములు, మెరుపులు కొంచెం తగ్గినాయి. యూదుసనాతనసాంప్రదాయం

ప్రకారం నగరందోని యిండ్లు కిటికీలన్నీ బారుగా తెరచి ఉంచ బడినాయి, దేవదూతల నాహ్వానిస్తూ. ఆ సమయంలో నా యూదుసుందరి పడకకుర్చీలో సుఖాసీనురాలై సాలోచనయై వుంది. వెచ్చని వున్ని దుస్తులు ధరించినా, చలికామె సుకుమార శరీరం వణకుతూనేవుంది. ఆమె భర్త వెనుక ముందుల కూగుతూ గ్రంథపఠనం గావిస్తూ, ధర్మశాస్త్రగ్రంథాలు ముందేసుకుని కూర్చున్నాడు. ఉన్నట్లుండి ఆమె దృష్టి భర్తపై నిలిపి, యిల్లా ప్రశ్నించింది:

"ఏమండీ! దావీదు కుమారుడు మెస్సయా యెప్పుడు వస్తాడు? మన రక్షకుడు యెప్పు డవతరిస్తాడో చెప్పండి!"

తత్వవేత్త జవాబిచ్చేడు:

"ఈశ్వరదూత సంరక్షకుడై తప్పక వస్తాడు. 'తాల్ముడ్ గ్రంథం యేమని చెబుతూందంటే యూదు లంతా పవిత్రులుగా గాని, అందరూ పాపులుగా గాని ఐనవు డాయన అవతరిస్తాడని."

"యూదులంతా యెప్పుడైనా పవిత్రులౌతారని మీకు నమ్మకముందా?" అని ఆమె తిరిగి ప్రశ్నించింది.

"నేనల్లా యెట్లనగలను?' అన్నాడు పండితుడు.

"ఐతే మరి యూదులంతా పాపులైనప్పుడే 'మెస్సయా' అవతరిస్తాడన్న మాటా?"

ఆ పండితుడు యెబ్బెట్టుగా భుజాలు కుంచించుకుని, తిరిగి 'తాల్ముడ్' గ్రంథజంబాలంలో మునిగేడు. ఈ పవిత్ర

గ్రంథాన్ని పఠించినవాళ్ళల్లో యిప్పటివరకు కేవలం ఒక్కడు మాత్రమే మతిభ్రంశం గాకుండా బైటపడగలిగేడని గ్రంథాలు సప్రమాణంగా వక్కాణిస్తున్నాయి. ఆ సుందరి తిరిగి స్వాప్నిక దృష్టితో కిటికీ వెలుపలి వర్షంలోనికి చూచింది. దంతకాంతిని ధిక్కరించే ఆమె కరాంగుళులు దుస్తులమీది నల్లని పున్నితో పరధ్యానంగా ఆడుకుంటున్నాయి.

♦ ♦ ♦

వేరొకనాడా యువవేదాంతి సమీపమందలి వేరొక పట్టణంలో జరిగే పండితసభకు వెళ్ళేడు. కర్మకాండసంబంధమైన కొన్ని సమస్యలు చర్చించి నిర్ణయించాల్సివుందక్కడ. ఆయన పాండిత్యప్రకర్షణవల్ల చర్చలన్నీ అనుకున్నకంటె అతిశీఘ్రంగానే ముగిసి, సమస్యలు పరిష్కరింపబడినాయి. అందుచేత ముందు అనుకున్నట్లు మరునాడుదయం గాక ఆనాటి సాయంత్రమే ఆయన స్వస్థలానికి బైలుదేరేడు. తనంతటి వేత్తయైన తోడి పండితుడొకనితో కలసి బండిమీద బైలుదేరివచ్చి, మిత్రు నింటిదగ్గర బండి దిగి, కాలినడకనే స్వగృహం చేరేడు. తన యింట్లోంచి ప్రశాంతవంతమైన దీపకాంతి ప్రసరించడం,ముంగిట మెట్టుపై సేవకుడు హుషారుగా పొగ త్రాగుతూండడం చూసి ఆ పండితు డాశ్చర్యపడ్డాడు.

ఆయన కుతూహలుడై స్నేహాస్వరంతో నా సేవకుని ప్రశ్నించేడు.

"ఇక్క డేం చేస్తున్నావు?"

"ఆ సుందరి భర్త ... ప్పవనితలంపుగా వస్తాడేమో నని కాపలాకాస్తున్నా" నన్నాడు, సేవకుడు.

"ఆహా! అల్లాగా! భద్రంగా చూస్తూండు!"

అంటూ ఆ వేదాంతి సిఫ్తశిరోమణి నభినయిస్తూ, కోట లోంచి దొడ్డిగుమ్మంవైపుగా పోయి, యింట ప్రవేశించేడు. భోజనాలగదిలో టేబిలు, యిద్దరు తినిబోయిన పళ్ళేములూ గాన్పించేయి. పడకగదిలోకి ప్రవేశించేడు. భార్య మామూలు గానే అమూల్యవసనాల్లో కిటికీదగ్గర కూర్చునివుంది. కాని అనుమానాస్పదంగా ఆమె చెక్కిళ్ళు యెర్రబారివున్నాయి; ఆమె నేత్రాల్లో మామూలు వుదాసీనత గాక సంతృప్తి, వుత్సాహం వెల్లివిరుస్తున్నాయి. తృప్తనేత్రాలతో భర్తను వీక్షిస్తూంటే ఆమె చూపుల్లో పరిహాసరేఖలు గానవచ్చేయి. ఆయన కాలికి తగిలిన వస్తువేదో చప్పుడు చేసింది. దానినిపైకెత్తి దీపకాంతిలో చూడగా అదొక రికాబులజత! పండితుడా సుందరితో—

"నీతో యిక్కడున్న వారెవరు?" అన్నాడు.

ఆ సుందరి సిరసనగా భుజాలు కుంచించుకుంటూ, మౌనంగా వుండిపోయింది.

"ఐతే నన్నే చెప్పమంటావా? అశ్వదళ నాయకుడు యిక్కడికి వచ్చి వెళ్ళేడు! అంతేనా?"

జాకెట్టుమీద కప్పుకొన్న శాలువాను తెల్లని చేతితో నిమురుతూ ఆమె జవాబిచ్చింది.

"అక్కడక్కడ నాలో యెందుకుండకూడదు?"

"ఏమిటీ? నీకేమైనా మతి చెడిందా?"

"నాకు మతి బాగుండే అంటున్నా"నని జవాబిస్తూన్న ఆమె అధరాధరంమీద లాలసత్వం, తెలివితోకూడిన మధుర మందహాసం చిందులాడింది.

"అయ్యో, పాపం! దురదృష్టవంతులైన మనయూదుల్ని రక్షించే మెస్సయా (దేవదూత) ను శీఘ్రంగా రావించేందుకు నాచేతనైనది వుడతాభక్తిగా నైనా చేయవద్దూ!"

---

# అ డ వి లో

మేయరు ప్రాతఃకాల భోజనానికి కూర్చోబోతున్నాడు. అంతలోనే యిద్దరు నిర్బంధితులతో సహా పోలీసుహెడ్డు ఆఫీసు దగ్గర వేచియున్నాడని కబురు వచ్చింది. ఆయన తక్షణమే బయలుదేరి ఆఫీసుకి వెళ్ళి చూసేసరికి ముసలిహెడ్డు హాంచీ దూర్ కాపలా క్రింద ఒకమధ్యతరగతి మిథునం కానవచ్చింది. వయసుమళ్ళిన ఆ జంట ముఖాలు ముడ ముడ లాడుతూ వున్నాయి.

ఆ మిథునంలోని పురుషుడు బాగా లావుగా బలిసి వున్నాడు. ముక్కు యెర్రగాను, జుట్టు తెల్లగానూ వుంది. అతని ముఖంలో విన్నదనం గానవస్తూంది. కూడావున్న వృద్ధురాలు పొట్టిగా గుండ్రంగా మట్టసంగా వుంది. ఆమె చెక్కిళ్ళు

మెరుస్తూ యెఱ్రబారి వున్నాయి. ఆమె చూపుల్లో ధిక్కారం, అతినిర్లక్ష్యత గానవస్తున్నాయి.

"ఏమిటి? హోచీదూర్! ఏమిటివంతా?" అన్నాడు మేయర్.

పోలీసు విషయాన్ని నివేదించుకున్నాడు. అతడు మామూలు ప్రకారమే ఆ వుదయం కూడా బీటు కాపలాకు వెళ్ళేడు. ఛాంపియో అడవినుంచి ఆర్జంట్యూ్యాలువరకూ అతని బీటు హద్దులు. ఎక్కడా యే విశేషమూ అతనికి గానరాలేదు. చక్కని సూర్యకాంతితో ఆరోజు యెంతో సుఖదాయకంగా వుంది. పండబారుతూన్న గోధుమచేలు అద్భుతంగా వున్నాయి. ముసలిరైతు బ్రిదెల్ ద్రాక్షతోట దరినే పోతూంటే అతని కొడుకు ద్రాక్షతోటలో యినుమారు దున్నుతూ తనను కేకేసాడు. 'ఇదిగో! హోచీదూర్ బాబాయ్! అడవివంచనే వున్న మొదటి పొదలో చూసేవంటే రెండు గువ్వపిట్టలు కనిపిస్తాయి. రెంటికీ కలిపి నూటముప్ఫైయేళ్ళకి తక్కువుండవ్!'

నిర్దేశితదిశలో వెళ్ళి పొదను సమీపించేడు. అందులోంచి గుసగుసలూ, ఒగర్పులూ వినవస్తున్నాయి. ఏదో నీతిభంగం జరిగిపోతూందనే అనుమానం అతనికి కలిగి, కాలుసేతులమీద ప్రాకుతూ ముందుకు పోయేడు. దొంగకోళ్ళని పట్టేవాణ్ణి పట్టినట్లుగాపోయి యీ జంటను పట్టుకొని అరెస్టుచేసేడు. సరిగ్గా యీ మిధునం తమ యింద్రియవాంఛను తీర్చుకోబోయే సమయానికే వారి నీతడు పట్టుకున్నాడు.

ఆ దోషులవైపు ఆశ్చర్యంతో చూసేడు, మేయర్. వారిలో పురుషునికి షష్టిపూర్తై వుంటుంది. స్త్రీకూడా ఆ వయసుదే. నిజంగా ఆశ్చర్యకరమైన సందర్భమే మరి ! అంతర్యమును తీసుకోడానికై మేయరు ఆ పురుషుని ప్రశ్నించుతూంటే ఆతడు బహు మెల్లగా క్షీణస్వరంతో జవాబీయ నారంభించేడు:

'మీ పేరేమిటి ?'

'నికోలన్ బ్యూరెయిన్.'

'మీరేం పని చేస్తారు ?'

'పారిస్‌లోని మార్టైయిర్స్ వీధిలో సారియీూదుకాణం.'

'అడవిలో యేం చేస్తూన్నారు ?'

దుకాణదారుడు తన పెద్ద పొట్టమీద దృష్టి లగ్నం గావించుకుని, తొడలమీద చేతులుంచుకొని మౌనంగా వుండిపోయాడు. మేయరు మరల ప్రశ్నించేరు:

'ఈ వుద్యోగి చెప్పేది మీరు నిరాకరిస్తూన్నారా ?'

'లేదండి, అయ్యా !'

'ఐతే, దాని కంగీకరిస్తారా ?'

'చిత్తం, మేయరుగారూ !'

'దానికి మీ సంజాయిషీ యేమిటి ?'

'యేమీ లేదండి, బాబూ !'

'ఈ అవినీతికర కార్యంలో మీజోడా యెక్కడకలిసేరు?'

'ఆమె నా భార్యేనండి, అయ్యా !'

10

'మీ భార్యా ?' మేయర్ అత్యాశ్చర్యంతో అడిగేడు.

'చిత్తమండి, అయ్యా !'

'ఐతే, ఐతే, మీ రిద్దరూ కలసి వుండడం లేదూ, పారిస్‌లో ?'

'క్షమించండి, అయ్యా ! ఇద్దరం కలిసే వుంటున్నాం.'

'ఐతే మీకు పిచ్చెత్తి వుండాలండి, అయ్యా ! తప్పకండా పిచ్చెయెత్తి వుండాలి ! ఈవిధంగా పల్లెటిపాంతంలో, ప్రొద్దుట పదిగంటలకు, యీ పరిస్థితుల్లో పట్టుపడడం !'

దుకాణదారుడు సిగ్గుపడిపోయి, యేడ్చేందుకు సిద్ధమై, గొణుగుతూ చెప్పేడు: "ఆవిడే నన్ను పేరేపించిందండి. ఇది కేవలం బుద్ధిహీనతేనని నే చెప్పినా వినందే ! ఆడదాని బుర్ర లోకి యేదేనా ఆలోచన దూరిందంటే యింక దాన్ని మార్చ లేము గదండీ, అయ్యా !"

మేయరు చిరునవ్వేరు. మర్మం విడిచి మాట్లాడడమంటే ఆయన యెంతో మెచ్చుకుంటారు.

'అదే నిజమైతే జరగాల్సింది యిందుకు విరుద్ధంగా వుండాల్సిందే ? ఆమె బుర్రలోనే యీభావం వుంటే మీరు యిక్కడ వుండేవారు గారే !'

మాన్స్యూర్ బ్యూరెయిల్‌కి ఆగ్రహంవచ్చి, భార్యవైపు తిరిగి అన్నాడు:

'చూడు ! నీ భావకవిత్వం మన కాపురాన్ని యే కాటికి తెచ్చిందో ? ఇప్పుడు, అరవయ్యో పడిలో మనం కోర్టులకు

వెళ్ళాలిలావుంది! అయ్యో! దేవుడా!...అందులోనూ అవినీతి ప్రవర్తనకై! దుకాణాన్ని మూసెయ్యాలి. దుకాణాన్ని అమ్మేసుకుని, 'మరో ప్రాంతానికి నెత్తిన గుడ్డేసుకు పోవాల్సిందే! అయ్యయ్యో ఎటువంటి దుస్థితి!...'

మదాం బ్యూరెయిక్ భర్తవైపు చూడకుండానే లేచి, ధీమాగా, నిస్సంకోచంగా, పనికిమాలిన సిగ్గు బిడియాలు లేకుండా తన అభిప్రాయాల్ని విపులీకరించ నారంభించింది:

'అయ్యా! మేయర్ గారు! మేము నవ్వులపాలైనా మని నాకూ తెలుసు. నా కేసును ప్లీడరులా వాదించుకోడానికి దయచేసి అనుమతించండి. కేవలం అదృష్టహీనురాలైన స్త్రీగా నా విషయం నివేదించుకోనా? మాపై కేసు పెట్టి, అవమానానికి పాల్జేయకుండా, కరుణించి మమ్మల్ని యింటికి పోనిస్తారనే అనుకుంటా.'

'చాలా యేళ్ళక్రిందటి మాట. నేను యువతిగా వున్నప్పుడు, యీ ప్రాంతములోనే ఒకఆదివారం నాకీయన పరిచయం కలిగింది. అప్పటి కీయన పారిస్‌లో ఒక బట్టలషాపులో గుమాస్తా. నేనూ ఒక రెడీమేడ్ బట్టలషాప్‌లో పనిచేస్తుండే దాన్ని. ఆ సంఘటన యిావత్తూ నిన్న మొన్న జరిగినదానికవలె నాకు బాగా జ్ఞాపకం. ఆదివారాల్లో యీ పల్లెసీమల్లో గడపడానికి పట్టణవాసు లందరికి వలెనే నేనూ, మరో స్నేహితురాలూ యిక్కడికి వచ్చేవాళ్ళం. ఆమె పేరు రోజ్ లెవీస్క్యూ. మే మిద్దరమూ పిగల్లీ వీధిలోనే వుంటూండే వాళ్ళం. రోజ్‌కి

స్టైర్మన్ అనే ప్రియు డుండేవాడు. నాకెవరూ లేరు. ఆమె ప్రియుడే మాయిద్దర్నీ యిక్కడికి తీసుకొచ్చేవాడు. ఒక శని వారం ఆతడు నవ్వుతూ నాతో అన్నాడు: 'నా స్నేహితు డొకణ్ణి రేపు నాతో తీసుకొస్తా!' ఆతని భావం నా కవగత మైంది. దానిపై నేను అందువల్ల లాభమేమీ వుండదని జవా బిచ్చేను. ఎందుచేతనంటే, నేను బహు నియమవంతురాల్నిగా వుండేదానను, అయ్యా!'

'మర్నాడు యీయనను రైలుస్టేషన్‌లో కలిసేము. ఆ రోజుల్లో యీయనగారు యెంతో బాగా వుండేవారు. కాని యీయనకు యెంతమాత్రం లోబడకూడదని నేను నిశ్చయించు కున్నాను. ఔను! మరి! మరి, నేను ధీమాగా నిలబడదలచేను. మేం అందరం బిజోన్సుకు చేరుకున్నాం. ఆ దినం చాల మనో హరంగా, గిలిగింతలు పెడుతూన్నట్లుంది. వెనకటికివలెనే యిప్పుడుకూడా వాతావరణం చక్కగా వుంటే నాకు బుర్రి చెడిపోతుంది. అందులోనూ పల్లెసీమల్లో వుంటే అసలు బుర్రి తిరిగే పోతుందనుకోండి! పచ్చని ప్రకృతి, కిల కిల యెగిరే పిట్టలు, గడ్డివాసనలు, రంగురంగుల పూలు, యివన్నీ నన్నెంతో వుద్రేకపరుస్తాయి. అలవాటు లేనివాళ్ళు షాంపేన్ తాగిన ట్లుంటుందనుకోండి!'

'సరే. అది మనోహర వాతావరణం; వెచ్చగా ప్రకాశ వంతమైన దినం. చూస్తూంటే కళ్ళలోంచీ, వూపిరి పీలుస్తూంటే నోట్లోంచీ దానిమత్తు శరీరాల్లోకి చొచ్చుకు పోతూంది. రోజ్

సైమర్కాలు నిముష నిముషానికీ కౌగలించుకొంటూ, ముద్దులు కురిపించు కుంటూంటే నా దృష్టంతా అటే వుండేది. వాళ్ళ జంటకి వెనకే నేనూ, పీటరూ మాటా మంతీ లేకండా నడుస్తూ న్నాం. నిజమే, మరి. ఒకరినొకరు యెరుగనప్పుడు మాట్లాడు కునేందు కేముంటాయి? మాన్సూర్ బ్యూరెయిక్ యెంతో బెదురుతూంటే, ఆయన కంగారును నేను యెంతో వినోదంగా చూస్తూ నడుస్తూన్నా. చివరికి మేమూ చిట్టడవి దరికి చేరు కున్నాం. అక్కడెంతో చల్లగా వుంది, స్నానాలగదిలోకి వలె. నలుగురం కూర్చున్నాము. మూతి ముడుచుకున్నానని నన్ను రోజ్, ఆమె ప్రియుడూ పరిహాసం చేస్తున్నారు. కాని అన్యథా యెల్లా వుండగలనో మీరే చెప్పండి? ఇంక వాళ్ళిద్దరూ మళ్ళా ప్రారంభించేరు ముద్దులూ, కౌగలింపులూ. అక్కడింకేవరూ లేనట్లుగానే వాళ్ళు ప్రవర్తించ నారంభించేరంటే నమ్మండి! ఇద్దరూ గుసగుసలాడుతూ లేచి, మాట్లాడకండా చెట్లల్లోకి వెళ్ళి పోయేరు, మా యిద్దర్నీ వదలిపెట్టి. నా కెల్లావుంటుందో మీరే వూహించుకోండి! ప్రథమ పరిచయుడైన యీ పడుచువానితో ఒంటరిగా అక్కడ వుండిపోవడమంటే నాకెంతో కంగారుగా వుంది. ఆ కంగారుతో మొండిధైర్యం కలిగి, నేనే ముందు మాట్లాడనారంభించేను. ఏం చేస్తుంటారని అడగ్గా బట్టలషాపులో గుమాస్తాగా వున్నానన్నా రీయన. ఇద్దరం పిచ్చాపాటీ మాట్లాడుకో నారంభించేం. దానితో కొద్దినిముషాల్లో ఆయనకి ధైర్యంవచ్చి కొంచెం చనువు తీసుకోనారంభించేరు. అప్పుడు

నేను మర్యాదగానే, అయినా కఠినంగా మందలించేను. ఏమండీ, నిజమేనా?'

మాన్స్యూర్ బ్యూరెయిర్ జవాబీయలేదు. అతడు నేలవైపు చూస్తూ కంగారుగా వింటూండిపోయేడు. మదాం బ్యూరెయిర్ తన కథనాన్ని సాగించింది:

'దానితో యీయనగారు నా గుణశీలాల్ని చూడగలిగేరు. అప్పటినుంచీ, మర్యాదస్తునివలె యెంతో సున్నితంగా యీయన నాతో ప్రేమకలాపాల్ని సాగించేవాడు. నాపై ప్రేమలో మునిగిపోయి, ప్రతి ఆదివారం మాతో వచ్చేవాడు, యీయన. ఆయనంటే నేనూ యెంతో యిష్టపడేదాన్ని. నాకూ ఆయనంటే మంచి మక్కువ కలిగిందిలెండి? ఆ రోజుల్లో యీయన యెంత బాగుండేవాడో మీరెరగరు! మొత్తానికి మరుసటి సెప్టెంబరులోనే మా వివాహం జరిగిపోయింది. మేము మార్టెయిర్స్ వీధిలో మా స్వంతవ్యాపారం ఆరంభించేం.'

'అయ్యా! మేయర్‌గారు! కొన్నేళ్ళవరకూ మేము చాలా కష్టాల్ని యెదుర్కోవాల్సివచ్చిం దనుకోండి. వ్యాపార మేమీ బాగా లేదు. పల్లెటి ప్రాంతాల్లోకి షికార్లు రావడం కేవలం అసంభవమైపోయిం దనుకోండి. చివరకు మాకా అలవాటే తప్పిపోయింది. వ్యాపారంలో పడ్డాక మనిషి బుర్రలో యితర విషయాలు దూరి, యెంతసేపూ గళ్ళాపెట్టివైపే దృష్టి పోతుంది గాని ప్రేమ కలాపాలు రుచించవు! ప్రేమనుగూర్చి

అంతగా ఆలోచించని ప్రశాంత జీవితం గడుపుతూంటే, మాకు యెరుకలేకండానే వృద్ధాప్యం పైపై బడిపోయింది. ఐతేనేం లెండి, పోగొట్టుకొన్న దాన్ని గమనించనంత కాలం యెవరూ దానికై బాధపడరుగదా!"

"ఆ తర్వాతే కొంచెం కొంచెంగా మా వ్యాపారం కోలుకుంది. భవిష్యత్తు విషయమై మాకూ కాస్త నిశ్చింత యేర్పడింది. అప్పుడింక నాలో యేమి వుప్పతిలిందో తెలియదు. గాని నేను మాత్రం చిన్న బడిపిల్లలాగ కలలు గనడం ఆరంభించేను. నిజంగానే నాకేమీ అర్థంగాదనుకోండి, అయ్యా! పువ్వులబండ్లు తోసుకుంటూ అమ్మేవాళ్ళు వచ్చేసరికి నా కేదువు వచ్చేసేది. గల్లాపెట్టె వెనక కూర్చునివున్న నన్ను వెతుక్కుంటూ వచ్చేవి, పూలతావులు. దానితో నా గుండెలు గుబగుబ లాడేవి. దానితో నేను లేచివచ్చి, ముంగిట నిలబడి, యిళ్ళకప్పుల మధ్యనుంచి కనిపిస్తూన్న నీలాకాశాన్ని చూస్తూ, స్రూన్నపడిపోయి వుండేదాన్ని. పారిస్ వీధుల్లోంచి ఆకాశంవైపు చూసినవాళ్ళకి అదొక నదీ ప్రవాహంలాగా, యెగిరే పక్షులు ప్రవాహంలో యీదే చేపల్లాగా అనిపిస్తాయి! ఈ వయసులో అటువంటి విషయాలు భావించడం మూర్ఖత్వమే ననకోండి! కాని బ్రతుకంతా పీడకలలాగ దుకాణంలోనే తెల్లారిపోయాక యెవరుమాత్రం యేమి చేయగలరో చెప్పండి? ఎవరి జీవితంలోనైనా రావచ్చునొక ముహూర్తం; మరొకలా చేసి వుండాల్సిందని అప్పుడనిపించి, పశ్చాత్తాపపడిపోతాం! అయ్యయ్యో!

ఎల్లా యేడుపొస్తుందని! నేనూ అందరు స్త్రీలకు వలెనే వెళ్ళి అడవుల్లో ప్రకృతిసౌందర్యంలో మునకలేస్తూ, యీ యిరవై మూడేళ్ళనుంచీ సుఖాన్ననుభవించి వుండేదాన్నని తలచుకోడానికి యెల్లా వుంటుందో మీరే ఆలోచించండి! ఆ చెట్లక్రింద పండుకుని, ప్రేమిస్తూంటే యెంత బాగుంటుందోనని ఆలోచించేదాన్ని! ఈ ఆలోచనలు నన్ను రాత్రింబగళ్లు వదలేవేగావు. నీటిమీద వెన్నెల కాంతులు గురించి కలలు గనేదాన్ని. చివరకి యెందులోనేనా దిగమారిపోదామన్నంత విరక్తి, నిస్పృహ కలిగే దనుకోండి."

"దీన్నంతనూ గూర్చి యీయనతో మాట్లాడేందుకు మొదట ధైర్యం చాలలేదు. నాకు తెలుసు, ఆయన నన్ను వేళాకోళం చేస్తాడని; సూదులూ, రిబ్బనులూ అమ్ముకునేదానికిదేమిటంటాడు కూడాను. అదీగాక ఆయన నిజానికి నాతో అంతగా మాట్లాడేవారేగాదు. మరో సంగతి. అద్దంలో నా రూపం చూసుకుంటుంటే యింక యిది ఆకర్షణీయంగా వుండబోదనే నిశ్చయానికీ వచ్చేను."

"ఒకనాడు చొరవచేసి, యీయనతో మాట్లాడేను. మనం ప్రథమపరిచయం గావించుకున్న చోటుకి బోయి, అడవి వెంబడే తిరుగుతూ ఆనందంగా గడుపుదామని సూచించేను. ఎల్లాంటి అవిశ్వాసమూ లేకండా ఆయనా అంగీకరించేరు. అంతే. ఇక్కడికి వుదయం తొమ్మిది గంటలకి చేరుకున్నాం."

"పంటచేలలోకి వచ్చేసరికి నేను మళ్ళా యౌవనం పొందినట్లనిపించింది. స్త్రీహృదయానికి వృద్ధాప్యం అనేది లేదు గదాండీ? మరేమో, నా భర్త నిజంగా యీ ప్రస్తుతరూపంలో కనబడనేలేదు, నాకప్పుడు! ఆయన పూర్వరూపమే నా మనోనేత్రం ముందు కనబడింది! ఈ యదార్థాన్ని ఒట్టుపెట్టి చెప్పగలనండి, అయ్యా! నేనిక్కడ నిలబడడం యెంత నిజమో అదీ అంతే నిజం. నా మనసు మత్తులో బడినట్లైంది. నే నాయన్ని ముద్దెట్టుకో నారంభించేసరికి, తన్ను గొంతు పిసకబోయినంత కంటె అధికతరంగా ఆయన నిర్ఘాంతబోయేడు. ఆయన అదే పనిగా అంటూనేవున్నారు, "ఏమిటిది? ఈవేళ నీకేమైనా పిచ్చెత్తిందా? ఏమిటీ? ఇదేం పని! నీకేమైనా......" కాని ఆయనమాటలు నేను వినిపించుకుంటేనా? నా మనస్సు చెప్పేది తప్ప మరేదీ నాకు వినపడ్డమేలేదు. నేనే ఆయన్ని అడవిలోకి లాక్కుపోయేను...ఇదీ జరిగింది. నేను నిజమే చెప్పేనండయ్యా! అంతా యదార్థం, మేయరుగారూ!"

మేయరు యెంతో లోకానుభవమూ, వివేకమూ గలవాడు. ఆయన కుర్చీనుంచి లేచి నిలబడి, చిరునవ్వుతూ,—

"వెళ్ళండి, అమ్మా! ఇక మీరు వెళ్ళవచ్చు. కాని యింకెన్నడూ యిల్లాంటి దోషం, చెట్లకింద చెయ్యబోకండి!" అన్నాడు.

# నాన్ కమిషన్డ్ ఆఫీసర్

క్వార్టర్-మాస్టర్ సార్జెంటు వరజోకి యెనిమిది రోజులు సెలవు దొరికింది. ఈ సెలవులు తన అక్కగారి వూళ్ళో గడపాలని నిశ్చయించుకొని, వస్తూన్నానని ఆవిడకి జాబుకూడా రాసేసేడు. వరజో పటాలంలో పనిచేస్తూ, రెన్నిన్‌లో వుంటున్నాడు. అక్కడ జలసాగా కాలక్షేపం చేస్తుండడంవల్ల యింటి దగ్గరవాళ్ళకి యితనంటే మహామంటగా వుందేమో, యింటికి వెళ్ళడానికి అతగానికి మనస్కరించలేదు. అక్కగారింటికి వెళ్ళడానికేనా కారణం ఆవిడమీద ప్రేమవల్లనేం గాదనుకోండి. ఎందుకంటే ఆవిడగారు కాస్తంత నీతినియమాలనీ, భయభక్తులనీ అనే బాపతు. ఎప్పుడూ యేదో భక్తీబండలూ అంటూ చికాకు కలిగిస్తూంటుంది కూడాను. కాని వచ్చిన చిక్కేమంటే వరజో చాల డబ్బుఅవసరంలో వున్నాడు. తనబంధువర్గం అందర్లోకీ యింతవరకూ తాను బదులుపుచ్చుకోనిదల్లా యీ అక్కగారొక్కతె దగ్గరే! అంతేగాదు. తన అక్కగారి కుటుంబం కొంచెం వున్నవాళ్ళు కూడాను!

వరజో తండ్రి ఆంగీర్స్‌లో మంచి తోటలు పెంచేవాడు. ఆయన యిప్పుడు వ్యాపారం కట్టిపెట్టి విశ్రాంతిగా వుంటున్నాడనుకోండి. కొడుకు వ్యర్థ వ్యభిచారి అని తెలిసినప్పటినుంచీ అతడు ఒక్కదమ్మిడీ ఐనా పంపకపోడమేగాక పదేళ్ళనుంచీ

యితగాడి ముఖమైనా చూడలేదు. కూతురుని "పడో యీ" కుటుంబంలో యిచ్చి పెళ్ళిచేసేడు. పడో యీ ఔర్రెజులో వుద్యోగం చేసి, తర్వాత కలక్టరు అయి, వన్నిన్‌లో వుంటున్నాడు.

వరజో రైలు దిగి బావగారింటికి వెళ్ళేడు. బావగారు ఆఫీసులో, కొందరు బ్రిటన్ రైతులతో మాట్లాడుతున్నవాడు లేచి, టేబిల్‌మీదుగా చేయిచాచి, 'కూర్చో, ఒక్కనిము షంలో వస్తున్నా' నని మళ్ళీ పనిలో మునిగిపోయేడు.

రైతులకి కలక్టరుగారి సమాధానాలు నచ్చలేదు. కలక్టరుగారికి రైతుల కారణాలు అర్థంగాలేదు. కలక్టరుగారు ఫ్రెంచిభాష మాట్లాడుతున్నారు, రైతులు బ్రిటన్ భాష మాట్లాడుతున్నారు; దుబాసిగా పనిచేస్తున్నవానికి రెండూ తెలియనట్లుంది!

వరజో బావగారివైపు చూస్తూ చాలాసేపు కూర్చుని 'బుద్ధిహీనుడిలావున్నాడే!' అని తిట్టుకుంటూనేవున్నాడు, బావ గారిని. కలక్టర్ పడో యీకి యాభైవుండవచ్చు. పొడుగ్గా, సన్నగా, రోమలంగా వుంటాడు. కనుబొమలు వంగి, వెంట్రు కలు పొడుచుకొచ్చినట్లుంటాయి. అతడేపని చేసినా బహు తాపీగా చేస్తాడు. నెత్తిమీద ముఖమల్ టోపీమీద జరీఅల్లిక చేసివుంది. ఆయన వైఖరికూడ చాల సాధువుగా వుంటుంది. ఆయన మాటలు, చేతలు, అన్నీ తాపీగానే వుంటాయి.

'బుద్ధిహీనుడిలావున్నాడే!' అని అంతసేపూ వరజో సణు క్కుంటూనే వున్నాడు, బావగారిమీద.

లోకంలో ఒక బాపతు జనం వుంటారు. వాళ్ళు యెప్పుడూ యేదో వాగుతూ, గడబిడగా వుంటారు. వాళ్ళకి జీవితంలో తాగ్రిడం, భోగంకొంపల్లో దూరడం తప్ప మరేవీ వుత్సాహాన్నియ్యవు. వరజోకూడ ఆ జాతివాడే. అతనికీ యీ రెండూ తప్ప మరేవీ అర్థంగావు. డంబాలు, వదరడం, ప్రతివాళ్ళనీ తిరస్కారంగా మాట్లాడ్డం, అజ్ఞానశిఖరాలమీద వుండి లోకాన్నంతనీ నిరసనగా చూడ్డం, యిదే అతగానికి తెలిసినది. 'దిక్కుమాలిన సెలవు!' అన్నప్పు డాతనిలోని సద్భావం వెలికివచ్చిం దంతే.

పడో యీ రైతులతో వ్యవహారం ముగించుకుని బావ మరిదివైపు తిరిగి అడిగేడు:

'బాగున్నావా?'

'బాగానేవున్నా, యిల్లాగ! మీరు కులాసా?'

'ఆఁ! కులాసాయే! థాంక్స్! మమ్మల్ని చూడాలని రావడంవల్ల నీఅభిమానం వెల్లడవుతూంది. చాలా సంతోషం.'

'అబ్బే! చాలా రోజుల్నుంచీ రావాలనుకోడమేగాని పడనేలేదు. తెలుసునుగా, పటాలంలో తగినంత స్వేచ్ఛ దొరకదు'

'ఔను! ఔను! యెరుగుదును! అందుకనే నీకు దయ వుంది అంటున్నానోయ్!'

'జోసెఫైన్ కులాసాగావుందా?'

'ఆఁ! బాగానేవుంది. థాంక్స్! ఇప్పుడే చూస్తావు, ఆమెను.'

'ఎక్కడికి వెళ్ళింది?'

'బంధుదర్శనానికి. ఇక్కడ మనకు అందరూ బంధువులే. సంఘమర్యాదలు అక్షరాలా జరిగి తీరాల్సిందే యీవూళ్ళో!'

'అందుకు సందేహమా!'

అంతలోనే తలుపు తెరచుకొని మదాం వచ్చోయీ లోనికి వచ్చింది. ఏలాంటి ఆతురతా లేకండా, తమ్ముని సమీపించి, చెక్కిలి వానివైపు వుంచి, అడిగింది:

"చాలాసేపయిందా, వచ్చి?"

'లేదు, ఓ అరగంటవుతుంది.'

'అఁహాఁ! రైలు ఆలస్యమవుతుం దనుకున్నా లే. తీరిక కావడంతోనే చావడిలోకి రా.'

బావగారిని ఆయన అకౌంట్లకూ, వసూళ్ళకూ వదలిపెట్టి, వరజో అక్కగారితో ప్రక్కహాల్లోకి వెళ్ళేడు. ఒంటరిగా వున్నపు డామె తమ్మునితో అంది:

'నీ కీర్తినిగురించి కొంత విన్నానులే!'

"అంటే?"

'అంటేనా? నువ్వు వట్టి తుంటరితనంగా ప్రవర్తిస్తున్నా వని; తాగేసి తందనాలాడుతూ, కనబడ్డచోటల్లా అప్పులు చేస్తున్నావని!'

చాల ఆశ్చర్యపడ్డవానిలా కనిపిస్తూ వరజో అన్నాడు:

'నేనా ? నా జీవితంలో లేదటువంటిది !"

'ఆఁ! నువ్వింక సమర్ధించుకోనక్కర్లేదురా. నా కంతా పూర్తిగా తెలిసింది.'

అతగా డింకా సమర్ధించుకోబోయేసరి కామె ఘాటైన వుపన్యాసం యిచ్చి, వాని నోరు మూయించి, కిక్కురుమన కండా చేసింది.

'మేము ఆరుగంటలకే భోంచేస్తాం. అప్పటివరకూ నీకు స్వేచ్ఛ; నాతో వుండమని చెప్పను. అదృష్టవశాత్తూ, నాకేవో వ్యావృత్తులున్నాయిలే.' అని చెప్పి వెళ్ళిపోయిం దామె.

ఏకాకియైన అతడు నిద్రపోడమా, షికారు వెళ్లడమా అని తటపటాయించుతూ, గదిలోకి వెడదామని తలుపు తెరిచే సరికి, అది వీధితలుపు ఐవూరుకుంది. సరే, అయితే వీధిలోకే పోదామని బైలుదే రేడు, వరజో.

ఒరలోని ఖడ్గం కాళ్ళకి కొట్టుకుంటూంటే వరజో మంద కొడిగా పట్టణవీధులమ్మట తిరుగుతున్నాడు. ఆ బిగ్రిటను పట్టణం ప్రశాంతంగా, నిద్రిస్తున్న దానికివలె వుంటుంది. అరుదుగా కని పించే జనుల్నీ, చిన్నచిన్నయిళ్ళనీ, ఖాళీ షాపుల్నీ చూస్తూ, వరజో అనుకున్నాడు:

'అబ్బే! ఏం హుషారుగా లేదు. వన్నిస్ యేమేనా బాగుంటుం దనుకున్నా. ఇంతేనా! ఇక్కడికి రావాలనుకోడ మేమిటి, దిక్కుమాలింది!'

రేవులోకి వెళ్లేడు. అక్కడా పీడకలలావుంది త్వరలోనే యింకో నిర్జనవీధిలోంచి తిరిగి యింటికి వచ్చేసేడు, ఐను కాకం డానే. అక్కడ గదిలో మంచంమీదపడి, భోజనంవేళదాకా ఒక్కకునుకు తీసేడు.

'భోజనం వడ్డించేరండి, అయ్యగారూ!' అంటూ తలుపు కొట్టింది, పరిచారిక. దానితో లేచి, దిగి, భోజనానికి వెళ్ళేడు.

భోజనాలగదిలో వుక్కగా వుంది. ఎండదెబ్బకి గోడల మీది కాగితమంతా వూడిపోయింది. టేబిలుమీద గుడ్డకూడా లేదు. దానిమీద మూడుప్లేట్లలో వడ్డించిన భోజనం యేమంత వుల్లాసకరంగా లేదు.

వరజో ప్రవేశించే సమయానికే పడోయీా దంపతులూ వచ్చేరు. టేబిలుదగ్గర కూర్చున్నాక భార్యాభర్తలిరువురూ వుదరభాగంమీద శిలువవేసుకున్నారు. పడోయీా పులుసు వడ్డిం చడంతో భోజనం ప్రారంభమైంది. పులుసు చిక్కగావుంది. ఆ రోజు బజ్జీకూడా చేసేరు, మాంసంతో. తర్వాత గొడ్డుమాం సం వడ్డించేరు. ఎక్కువగా వుడికిందేమో అది విడిపోతూంది. నాగ్ కమీషన్డు ఆఫీసరుగారు జుగుప్సతోనూ, కోపంతోనూ, అలసటతోనూ మెల్లిగా నములుతూన్నాడు.

మదాం పడోయీా భర్త నడిగింది:

'సాయంత్రం ప్రెసిడెంటుగారింటికి వెడుతున్నారా?'

'ఆఁ! వెడుతున్నా, డియర్!'

'ఆట్టే సేపువుండకండి. బైటికెళ్ళినప్పుడల్లా బాగా అలిసి పోయినట్లుంటారు. మీ ఆరోగ్యం బాగులేకపోయాక లోకంలో అనుభవించగల దేమీలేదు!'

ఆ పిమ్మట వన్నిన్ నగరంలోని పెద్దకుటుంబాల ప్రసక్తి తెచ్చి, తమ భక్తిప్రపత్తులమూలంగా పొందుతూన్న ఘనగౌర వాన్ని వృగ్గడించింది. అతిథి గౌరవార్థమై వుర్రగడ్డ తిమ్మనం, పందిమాంసం, తర్వాత జున్ను వడ్డించేరు. దానితో భోజనం ముగిసింది. ఆఖరికి కాఫీకూడా లేదు.

ఆ సాయంత్రమంతా తన అక్కగారిచేత చీవాట్లుతింటూ, ఆవిడ ధర్మోపదేశాలు విషంలా మింగుతూ, ఆవిడయెదుటే కూర్చుని గడపాలని వరజో గ్రహించేడు. కాస్త గొంతు చల్ల బరచుకోడానికిగాని, చీవాట్లు సులభంగా గొంతు దిగేందుకు గాని ఒక్క గ్లాసుడు మద్యంకూడా లభించే ఆశలేదనీ తెలిసి పోయింది. ఇక భరించలేక తనకేదో ముఖ్యతాచకార్యం వుందని చెప్పి తప్పించుకుని యేడుగంటలకే బైటపడ్డాడు.

వీధిన బడి, కుడితిగోలెం నుంచి బైటపడ్డ కుక్కలాగ వళ్ళంతా విదిలించుకున్నాడు. 'ఏమి పాడుబ్రతుకు! రోత! రోత!' అనుకుని, మంచి హోటల్కోసం అన్వేషణ నారంభిం చేడు. వెతగ్గా చివరకి ఓ చోట మేడమీద హోటలు బాగున్నట్లు తోచింది. అక్కడ అయిదారుగురు జనం,—పూర్తిగా పెద్దమనుష్యు లని చెప్పలేమనుకోండి,—కొడవగా చిన్న టేబుళ్ళదగ్గర కూర్చుని తాగుతూ, బాతాఖానీ వేస్తున్నారు. అక్కడో గదిలో

బిలియర్డ్స్ ఆడుతూన్నారో యిద్దరు. "పద్ధెనిమిది—పంథొమ్మిది! అదృష్టంలేదు— ఓ! గుడ్ షాట్! బాగా ఆడేవు!— పదకొండు— ఎరుపుమీద ఆడాలి నువ్వు!— యిరవై—థ్రోజ్! థ్రోజ! అదుగదీ! బాగు!—చెప్పలేదూ!" అంటూ వాళ్ళ లెక్కింపు వినవస్తూంది.

వరజో ఓగ్లాసు బ్రాందీకి ఆర్డరిచ్చి, కూర్చున్నాడు.

తోడివాళ్ళంతో గ్లాసులు టకటకలాడిస్తూ, పొగలు గుప్పున వదలుతూ, గడబిడగా సాయంకాలాల్లో గడపడాని కలవాటుపడిన వరజోకి యీ నిశ్శబ్దం భరించరానిదైంది. కాఫీ తాగేక, బ్రాందీ పుచ్చుకున్నాడు. మళ్ళా యింకో గ్లాసుకి ఆర్డరిచ్చేడు. ఇప్పుడాతనికి నవ్వాలనీ, అరవాలనీ, తర్వాత పాడాలనీ, ఆ పిమ్మట యెవడితోనైనా పోట్లాడాలనీ అనిపించింది. మనస్సులోనే అనుకున్నాడు:

"దేవా! ఇది నన్నెల్లా రేగొడుతూందనీ! ఈవేళ కాస్త జలసా చెయ్యాలి!" దానితో భోగంపిల్లలమీదికి పోయిందాతని మనసంతా. హోటల్ వెయిటర్‌ను కేకేసేడు:

'ఓయ్! వెయిటర్!'

'వచ్చేను, బాబూ!'

'కాస్త కులాసాగా కాలక్షేపం చెయ్యాలంటే యీ వూళ్లో యెక్కడికి వెళ్ళాలో చెప్పగలవా?'

ఈ ప్రశ్న విని వాడు వెర్రివానిలా చూడనారంభించి, చివరకి అన్నాడు: 'నాకు తెలియదండి, సార్! ఇదొక్కశే చోటండి! అయ్యా! నే వెరిగినంతవరకు.'

'ఇదుగో! కులాసా అంటే యేమిటనుకున్నావోయ్?'

'నాకేం తెలుసు, బాబూ! బీరు లేదా వైను తాగడం!'

"పోరా, గబ్బిడాయీ! బోగంపిల్లలు, వాళ్ళెక్కడ?"

'పిల్లలాండి! హ్హా! హ్హా! హ్హా!'

'ఔనోయ్! వాళ్ళే. ఎక్కడుంటారు?'

వెయిటరు దగ్గరగావచ్చి, మెల్లగా అన్నాడు: 'అంటే తమకు యిల్లు కావాలన్నమాట?'

'ఔనోయ్! అంతే!'

'ఎడమగా రెండోవీధిలోనుంచి వెళ్ళి, కుడిపక్క మొదటిసందు, పదిహేనో నంబరు.'

'మంచిదిరా తాతా! ఇదిగో, నీకు!'

'దండాలు, బాబూ!'

వరజో వీధిలోకి వచ్చేడు. 'ఎడమకి రెండోది, కుడికి మొదటిది, పదిహేను' కాని కొద్ది సెకనుల్లోనే అనుమానం వేసింది. 'హోటల్‌నుంచి బైటికొచ్చి కుడివైపు తిరిగేనా? ఎడమకా? ఆఁ! దాంట్లో యేముంది లెద్దూ. అన్నీ తెలుస్తాయిగా!' అనుకుంటూ సాగేడు.

ఎడమకి రెండోవీధిలోకీ అక్కణ్ణుంచి కుడికి మొదటి వీధిలోకీ నడిచి, పదిహేనో నంబరుకోసం అన్వేషించేడు. ఇల్లు దొరికింది. అది చూపులకి చాల డాబుగావుంది. క్రింది

అంతస్థులో దీపాలకాంతి షట్టర్లలోంచి కనిపిస్తూంది. నడవ ఓకు వాకిలిగా వుంది. లోపల లాంతరు వెలుగుతూంది.

'ఆఁ! ఇదే అయివుంటుంది!' అనుకుంటూ, నాగా కమీషన్డు ఆఫీసరు లోనికి వెళ్ళేడు. ఎవరూ కనబడలేదు. 'ఎవరోయ్, లోపల? ఏయ్!'

ఓ చిన్న పిట్టలాంటి పరిచారిక వచ్చి, మిలిటరీమనిషిని చూసి మాన్పడి నిలబడిపోయింది. అతడే పలకరించేడు:

'గుడ్ ఈవెనింగ్, పిల్లదానా! దొరసానులు మేడమీదున్నారా?'

'ఔనండి, అయ్యగారు!'

'అలంకారగృహంలో వున్నారా?'

'ఔను, బాబుగారూ!'

'నేను సరాసరి పైకి వెళ్ళవచ్చా?'

'ఔనండి, అయ్యా!'

'కనిపించే మొదటిద్వారమేగదూ!'

'ఔను! బాబుగారు!'

అతడు పైకివెళ్ళేడు. పెద్దహాల్లో రెండులాంపులూ, ఒక లస్టరూ, రెండు సెమ్మాలూ దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. సాయంకాల వసనాల్లో నలుగురుస్త్రీలు యెవరికోసమో యెదురుచూస్తున్నట్లుగా కానవచ్చేరు.

అందులో యువతులు ముగ్గురు సోఫాలో కూర్చున్నారు. నలభైఏళ్ళస్త్రీ వేజులో పూలు అమరుస్తూంది. ఆమె

మహాకాయురాలు. ఆకుపచ్చని సిల్కుగౌను ధరించివుంది. దాని లోంచి ఆమెముఖం పెద్దగులాబిపూవులా కనిపిస్తూంది.

నార్మకమీషన్ను ఆఫీసరు వందన మాచరించేడు.

'గుడ్ యీవెనింగ్ ! లేడీస్ !'

పెద్దామె తిరిగిచూచి, ఆశ్చర్యపడ్డదానిలా కనిపించినా, ప్రతివందనం గావించింది: 'గుడ్ యీవెనింగ్, సార్ !'

అతడు కూర్చున్నాడు. కాని తనను వుత్సాహంగా ఆదరించలేదేమో ? అని సందేహం కలిగి, ఓవేళ పెద్దపెద్ద ఆఫీసర్లు మాత్రమే వచ్చేచోటేమో ననుకున్నాడు. దానితో కొంత బెరుకు కలిగింది. కాని, అంతలోనే, 'ఆఁ ! దానిదేముంది ! రానిద్దూ, అప్పుడే చూద్దాం !' అని ధైర్యం వహించేడు. పలకరింపుకోసం, 'అంతా కులాసాగదా ?' అన్నాడు.

ఆ వయోధికురాలు, నిస్సందేహంగా ఆమె గృహయజమానురాలై వుంటుంది, జవాబిచ్చింది.

'అంతా కులాసాగా వున్నామండి. థాంక్సు !'

తరువాత యేం మాట్లాడాలో తోచలేదాతనికి. అంతా ఒక్క-క్షణం నిశ్శబ్దం. చివరకి, తన పిరికితనానికి సిగ్గుపడి, తెచ్చిపెట్టుకున్న నవ్వుతో, 'అబ్బే ! ఇదేం హుషారుగాలేదు...ఓ సీసాకి డబ్బిచ్చేస్తా !'...నంటూ యేదో అంటున్నాడు.

అతని వాక్యం పూర్తిగాకుండానే తలుపులు తెరచుకుని, సాయంత్రపుదుస్తుల్లో కలక్టరు పడోయీ ప్రత్యక్షమయేడు.

బావగారిని చూడ్డంతోనే వరజో ఒక్కవుదుటున లేచి, సంతోషాతిరేకంతో అరుస్తూ, ఆయనను చేతుల్లో గుచ్చి పట్టుకుని గదిలో నాట్యం చేయించేదు, అట్టహాసంగా వదరుతూ.

'భేష్! పడోయీ యిక్కడికి వచ్చేదు! ఇక్కడే పడోయీ! వహావ్వా...'

ఆశ్చర్యంతో నోటమాట రాకండావున్న కలక్టరును వదలిపెడుతూ, ఆయన ముఖంమీదే, వేళాకోళంగా,

'ఆఁ! ఆఁ! ఆహాఁ! జోకర్! జోకర్! ఐతే నువ్వొ ఒక్కొక్కప్పుడు కట్లు తెంచుకు షికార్లు కొడతావన్నమాట! ఓహోహో! ఏం తమాషా మనిషండీ!.....మరి, ఐతే అక్కయ్యో? ఆవిణ్ణే బరిమీదికి వదిలిపెడుతూంటావా? ఏమిటి, చెప్పు!'

తా నెదురుచూసి యుండని యీ పరిస్థితులవల్ల తనకు కలుగనున్న లాభాల్ని బేరీజు వేసుకుంటూ, వరజో తన్మయుడై పోయి సోఫామీద కూలబడి అదేపనిగా నవ్వుతూంటే గదంతా అదిరిపోయిందనుకోండి!

ఈసందట్లో ముగ్గురు యువతులూ లేచి చల్లగా జారుకున్నారు. యజమానురాలుకూడ యెందుకేనా మంచిదని గుమ్మందగ్గరికి పోయి, అవసరమైతే పారిపోడానికి సిద్ధమవుతూంది.

ఈ ఘట్టంలో మరో యిద్దరు పెద్దమనుషులు గదిలో ప్రత్యక్షమయేరు. సాయంకాలపు దుస్తులు ధరించి, పలికాలు

ధరించివున్న వారివైపు పరుగెత్తి, పడిపోయి క్షమాపణగా అన్నాడు:

'ప్రెశిడెంటుగారూ! క్షమించాలి,— వాడు పిచ్చివాడు— వట్టి పిచ్చివాడు! కాస్త కుదుటబడేందుకని మావాళ్ళు యిక్కడికి పంపేరులెండి— చూచేరుగా, వాడి పిచ్చివైఖరంతా!...'

వరజోయి దేమీ అర్థంగాక చతికిలబడిపోయాడు. కానైతే తానేదో మహా బుద్ధిహీనతగా ప్రవర్తించినట్లు గ్రహించకపోలేదాతడు. ఆఖరికి యెల్లాగో లేచి, బావమరదివైపు తిరిగి, అడిగేడు:

'మనం యెక్కడున్నాం?'

'ఎక్కడా? ఎక్కడున్నా మంటావా?...నిర్భాగ్యుడా! ఛండాలుడా! పరువుప్రతిష్టలులేని చవటా...ఎక్కడేమిటి?... ప్రెసిడెంటుగారింట! మోర్తిమెయిర్ మండలాధ్యక్షునియింట! అయ్యో! అయ్యో! ఎంత అపకీర్తి! పోకిరి! అప్రాచ్యుడు! శుంఠ! ఇంకెక్కడున్నాము!...'



# బ్రతికిపోయేను!

మార్క్విస్-డీ-రెన్నిడక్ రివ్వుమని చెండులా లోనికివచ్చి పడింది. ఇంకా ఏమే మాటా మంతీ లేదుగాని విరగబడి ఒకటే నవ్వు! కళ్ళనీళ్ళు గిర్రున తిరిగేలా! ఇంతకుముందు ఒకనెల క్రిందట కూడా యిల్లాగే చేసిందామె. తనభర్త, మార్క్విస్, పరమమూర్ఖంగా, అసూయగా ప్రవర్తించడంవల్ల ఆయనగారిపై కక్షకోసమే ఆయన్ని అప్పుడు మోసగించింది; కేవలం ఆ ఒక్క సారే అనుకోండి, భర్తను మోసగించి, కసితీర్చుకున్నానని చెప్పి నపుడూ యిల్లాగే విరగబడి నవ్వింది, మార్క్విస్.

ఇది చూసి బారనెస్-డీ-గ్రాంజరీ, చదువుతూన్న పుస్తకాన్ని సోఫాలో పడేసి, మిత్రురాలివైపు కుతూహలంతో చూసింది. అప్పటికే ఆమెకూ నవ్వొచికివస్తూంది. చివరకామె అన్నిట్టీని అడగకండా వుండలేకపోయింది.

'ఏం జరిగిందేమిటి?'

'అయ్యో! మాయమ్మో! ఎంత విడ్డూరమే! చాల చిత్రం జరిగిందనుకో! ఊహించనేలేవు. బ్రతికిపోయేనమ్మో! బ్రతికేను!'

'బ్రతకడమేమిటి? చెప్పుదూ, చంపక!'

'ఔను! బ్రతికిపోయే ననుకో!'

'ఎవరేం చేసేరు?'

'నా భర్త! ఆయన పీడనుంచి విముక్తిచెందే ననుకో! ప్రోయీ! స్వేచ్ఛ! స్వాతంత్ర్యం! బంధవిముక్తి!'

'స్వేచ్ఛ యేమిటే? ఎందులో!'

'ఎందులోనా? ఎరగవ్? విడాకులు! ఔను! సాధించేను''

'విడాకులు పుచ్చుకున్నావా?'

'లేదోయ్! ఇంకా లేదనుకో! నువ్వెంత మందబుద్ధివే! మూడుగంటల్లోనే యెవరికేనా విడాకులు వస్తా యేమిటి? మరీ చోద్యం నీది! కాని ఆయన నన్ను మోసగించినట్లు సాక్ష్యం వుంది. పనిలో దొరికిపోయేడు! సరీగా కన్నంలో దొంగదొరి కేడు! గుప్పిట్లో దొరికించుకున్నాననుకో!'

'అబ్బా! విసిగించకుండా ఆ గొడ వేమిటో చెపుదూ? ఐతే, అతడు నన్ను మోసగించేడంటావు?'

'ఔను! అంటే, కాదనుకో!—ఔను! కాదు!—అబ్బా! నాకు. తెలియదమ్మా! ఏదేమైతేనే కాని నాకు సాక్ష్యం వుంది. తెలిసిందా? అదీ ముఖ్యం!'

'ఎల్లా సంపాదించేవంటా?'

'ఎల్లాగా? విను, ఐతే! నేను మహా చాకచక్యంగా పని చేస్తున్నానులే! గత మూణ్ణెల్లలోను ఆయన మరీ అసహ్యంగా, కేవలం పశువుగా, మోటుగా, నిరంకుశంగా,— ఒక్కమాటలో చెప్పాలంటే అతినీచంగా ప్రవర్తించేడు, ఇదింక సాగనీయరాదనీ, విడిపోవాలనీ అనుకున్నాను. కాని, యెల్లాగ? అదేమంత సులభం కాదాయె! ఆయన నన్నెల్లాగైనా కొట్టేటట్లు చేయాలనుకున్నా,

కాని, అఁహఁ! అతడు చేయి చేసుకోలేదు! రోజంతా ఆతను నన్ను విసిగిస్తూ, వేళగాని వేళల్లో బైటకుబోయేటట్లు చేస్తూ, విందులకు బోవాలనుకున్నప్పుడు యింట బ్రుగ్గజేస్తూ, నా బ్రతుకు దుర్భరం చేసేడు. వారాలకొద్దీ యిల్లా నన్ను కాల్చుకు తింటాడే గాని నావంటిమీద ఒక్కదెబ్బా వేయడే!'

'అతగాని కెవతేనా వుందేమో నని కూపీ తీసేను. ఆఁ! వుందని తేలింది. కాని వెయ్యిజాగ్రతలు తీసుకొని మరీ వెళ్లే వా డామె దగ్గరికి. వాళ్ళిద్దర్నీ ఒక్కచోట పట్టుకోడం అసంభవం! అప్పుడు నేనేం చేసే ననుకున్నావు?'

'నేను పోల్చుకోలేనమ్మా!' అంది బారనెస్.

'అయ్యో! తెలివి! నువ్వెప్పుడూ యింతేలే! ఆ జంతువుఫొటో సంపాదించమని మా అన్నయ్యతో చెప్పేను.'

'మీ ఆయన వుంపుడుకత్తెదా?'

'ఔను! దానికోసం వాడికి తొమ్మిదివందల ఫ్రాంకులు ఖర్చైంది. ఒక విందుకైనంత ఖర్చు! రాత్రి యేడుగంటలనుంచి పన్నెండువరకూ విందూ, ఆటపాటలూ యేర్పాటుచేసి, తద్వారా దానిఫొటో సంపాదించగలిగేడు! అన్నయ్య యేదో యెత్తేసి ఆ ఫొటో సంపాదించేవాడే అనుకో!...అది అందమైనదే! కాని, వాడదేమీ ఖాతరు చేయలేదులే. దాన్ని గూర్చిన వివరాలుకూడా కావాల్సివచ్చింది; రూపురేఖలూ, రంగూ, అవయవాలూ, యింకెన్నో వివరాలు!'

'నాకు నువ్వు చెప్పేదేం అర్థం గావడమే లేదు!'

'అర్థ మవుతుందిలే! తొందరపడకు. నాకు కావాల్సిన భోగట్టా లభించేక...వాళ్ళ నేమిటమ్మా అంటారు?.. ఆ వ్యాపారం చేసేవాళ్ళని... తెలుసా?...రకరకాల వ్యవహారాలు చేస్తుంటారే!...అనుసంధానమూ – విడాకులూ, యిల్లాంటి వాట్లని యేర్పాటు చేసేవాళ్ళు...వాడిదగ్గిరికి వెళ్ళేను. అర్థ మైందా?'

'ఆఁ! చాలవరకు అవుతూందిలే. వాడి కేమని చెప్పేవు?'

'దాని పేరు క్లారెస్సీ లే. దానిఫొటో చూపించి, అల్లాంటి పరిచారిక కావాలన్నా. 'అందంగా, చురుగ్గా, శుభ్రంగా, తెలివిగా వుండాలి. ఎంత డబ్బయినా సరే. పదివేలు ఖర్చైనా పీడవదిలితే చాలు! మూడు నెలలకంటె ఆమె వుండనక్కర లేదు.' అనేసరి కాతడు అచ్చెరువడిపోయేడు. 'అమ్మా తమకు కావలసి వది సచ్ఛీలం గలదనుకుంటానేం?' అతని ప్రశ్నకిని నా ముఖం కందిపోయింది, సిగ్గుతో. ఎల్లాగో కష్టంమీద నసుగుతూ. 'ఔనండీ! అంతే! మర్యాదగలదే కావాలి.' అనగలిగేను. 'మరి నీతి విషయం?' అని మళ్ళా ప్రశ్నించేడు. జవాబీయ డానికి నాకు సాహసం కలగందే! లేదనే అర్థం యిచ్చేటట్లు తలమాత్రం పంకించేను. ఆమాట్లన హఠాత్తుగా అతగాడి కేదో అనుమానం కలిగినట్లు గ్రహించిన నా ధైర్యం చెడింది. కంగారు పడుతూ, "అబ్బే! నా భర్తకోసమేనండి! ఆయనగారికి విశ్రాంతి కలిగించే టందుకేలెండి!' అన్నాను."

'అప్పు డాతడు నవ్వ నారంభించేడు. అతని వైఖరినిబట్టి నాయం దాతడికి తిరిగి విశ్వాసం కలిగినట్లు గ్రహించేను. అంతే కాదు. నేను సాహసిననే భావంకూడా అతనికి కలిగింది. ఆ సమయంలో నాతో కరచాలనం చేసి, నన్నభినందించాలనే అభిప్రాయంకూడా అతని మనస్సులో పుట్టిందని పందెంవేసి చెప్ప గలను! ఏదేమైనా అతడు నాతో యిల్లా అన్నాడు: 'వారంలో మీరు కోరిన మనిషిని సమకూర్చగలనండి, అమ్మా! విధిగా చేసితీరుతా, పూచీ అంతా నా దనుకోండి. పని ఐనాక డబ్బి వ్వండి. ఇది మీభర్త వుంపుడుగత్తె ఫొటో అన్నారుకాదూ?'

"ఔనండీ!"

'అందమైనదే! అట్టే లావుకూడా లేదు. ఐతే ఆయనకి యే సువాసన యిష్టం?' అనడిగేడు.

'సువాసన ఏమిటి?' అన్నాను, నా కర్థంగాక. అతడు చిరునవ్వుతో, 'అమ్మా! మీకు తెలియదా? మగాళ్ళకి మరులు గొల్పడంలో సువాసన చాలముఖ్యం. తెలియకుండానే యేవేవో జ్ఞాపకాల్ని రేగొట్టి, మనసు నుల్లాసపరచడంలో యీ వాసనలు ప్రధానపాత్రగలవి. ఈ సువాసనలు పురుషుల మనసును గందరగోళపరచి, వుద్రేకపరుస్తాయి; మరచిపోయిన కులాసాన్ని గుర్తుకు దెచ్చి, కార్యాచరణకు పురిగొల్పుతాయి. అంతేకాదు. ప్రియురాలితో వున్నరోజున ఆయన ప్రీతిగా తినే వంటకాలు కూడా మనకు తెలియాలి. ఆయన్ని పట్టుకో దలచిన రోజున ఆ వంటకాలతో భోజనం పెట్టాలి, మీరు.

హ్హా! హ్హా! ఇక ఆయన మన గుప్పెట్లో చిక్కినట్లే! వంటింటి కుందేలు!'

'మనకు అఖండబుద్ధిమంతుడు సలహాదారుగా దొరికేడు గదా యని నేను సంతోషంగా వెళ్ళిపోయేను.'

'మూడురోజుల తర్వాత మా యింటికొక పిల్ల వచ్చింది. పొడుగ్గా, చామనచాయగా, యెంతో అందంగా వుందామె. ఆమె చూపుల్లో బిడియమూ, ధైర్యమూ కూడా తొణికిసలాడుతున్నాయి, పచ్చి గుడిసేటిలంజల్లోవలె! నాపట్ల మాత్రం చాల మర్యాదగనే ప్రవర్తించిందనుకో. ఆమె యెవరో తెలియక పోవడంవల్ల 'ఏమండీ!' అని సంబోధించేను. చటుక్కున ఆమె అందుకుని 'అమ్మగారూ! దయవుంచి నన్ను 'రోజ్' అని పిలవండి చాలు!' అంది.'

'సరే! రోజ్! నిన్నెందుకు పిలిపించేనో తెలుసా?'

'ఊహించేను, అమ్మగారూ!'

'ఐతే బాగుంది. పిల్లా! ఆ పని నీ కేమంత కష్టంగాదుగదా?'

'అబ్బే! కాదండి. నేను సాధించిన విడాకుల కేసులు దీనితో యెనిమిదండి! నాకు కొట్టినపిండే నండి.'

'ఏమిటీ! భేష్! బాగుంది. ఐతే నెరవేరడానికి చాల రోజులు పడుతుందా?'

'చెప్పలేమండి, అమ్మా! అదంతా అయ్యగారి గుణం మీద ఆధారపడివుంటుంది. ఆయనగారితో ఒంటిగా ఐదు నిముషాలుంటే చాలు, సరిగ్గా చెప్పగలను.'

'త్వరలోనే చూస్తావులే ఆయన్ని. కాని, పిల్లా! ఆయన యేం బావుండరు. ముందే చెపుతున్నా.'

'అది నా కెందుకండీ! అతికురూపుల్ని కొందరిని యిది వరకే విడదీయించేనులెండి. కాని, ఒక్కటిమాత్రం చెప్పండమ్మా! ఆయనకి యే అత్తరు ప్రియమైంది?'

'అదా! ఆఁ! చెపుతా! వెర్బీనా!'

'మంచిదండమ్మగారూ! వెర్బీనా అంటే నాకు యిష్టమే!'

'ఆ మనిషి శిల్కుదుస్తులు ధరిస్తుందా?'

'అదేనా! అబ్బే! కాదు! కేంబ్రిక్, లేసు.'

'ఓహో! ఐతే ఆవిడ కాస్త పైస్థాయిలోని దన్నమాట! శిల్కులు యిప్పు డందరూ కడుతున్నారులెండి.'

'నిజమే.'

'ఇప్పుడే పనిలో ప్రవేశిస్తానండి, అమ్మా!' అని చెప్పి వుండిపోయింది. ఎంతో కాలాన్నుంచి వుంటున్నట్లు యెంతో సహజంగా ఆపనీ యీపనీ చొరవగా చేస్తుంటే నాకెంతో ముచ్చటేసింది!'

'మరోగంటలో నా భర్త వచ్చేడు. రోజ్ కన్నెత్తిచూడనైనా లేదు! ఆయనమాత్రం దాన్ని పరకాయించి చూడనారంభించేడు. ఆమె వెర్బీనాతో అప్పటికే ఘుమఘుమలాడిపోతూంది. పనిమీద దామె గదిలోంచి బైటికి వెళ్ళగానే ఆయన అడిగేరు: 'ఎవరీపిల్ల?'

'కొత్తపనిమనిషి' అన్నాను.

'ఎక్కడ దొరికింది ?'

'మంచిదని చెప్పి బారనెస్ డీ గ్రాంజిరీ పంపింది.'

'ఓహో ! రూపసికూడాను !'

'మీకూ అల్లాగే తోచిందా ?'

'ఔను, మరి ! పనివాళ్ళలో యింత అందం...'

'నాకు యెంతో సంతోషమైంది. చేప అప్పుడే యెరను కొరకబోతూంది ! ఆ సాయంత్రమే రోజ్ నాతో చెప్పింది: 'అమ్మగారూ ! పదిహేనురోజులు చాలు. అయ్యగారు బహు సులువుగా దొరికిపోతారు !'

"ఏమిటీ ? చెప్పవ్ ! అప్పుడే యత్నించేవా ?"

"అబ్బే ! లేదండి. నా పేరడిగేరు. అంతే. నా కంఠం వినాలని !"

'అల్లాగా సరే. పని త్వరగా కానీసుమా, పిల్లా !'

'మరేం భయం లేదండి, అమ్మా ! అంతా త్వరలోనే ముగుస్తుంది. కేవలం చులకనైపోకండా వుండడానికే కొంచెం బెట్టు చేస్తా. అంతే.'

'ఇల్లా ఓ వారం గడిచింది. ఆయన యిల్లువదలి బైటికి వెళ్ళడమే మానేశాడు ! రోజంతా యింట్లోనే కాలుగాలిన పిల్లిలా తిరుగుతాడు. ఇంకా విచిత్రం ! నే నెక్కడికి వెడుతూన్నా వద్దనడమే లేదింక ! మరి నేనుకూడా వాళ్ళిద్దర్నీ స్వేచ్ఛగా వదలడానికి రోజంతా బైటే తిరిగేదాన్ని !'

న్నదోరోజున యెక్కడికో వెళ్ళి తిరిగివచ్చేను.
లు తీస్తూ రోజ్ బెదురుగా అంది: 'అమ్మగారూ! ఈవేళ వుదయం జరిగిం దది!'

'ఆ మాట విని ఆశ్చర్యపడ్డాను, యెందుకో! దిగ్భ్రమ జెందే నంటే నమ్ము! జరిగిందానికి కాదుగాని అది చెప్పే తీరు చూసి. ఏమనడానికీ తోచక, నత్తుతూ అడిగేను: 'మ...మ...మరి...అది...స...స...సరిగా జరిగిందా?'

'ఓ! కథ బాగానే నడిచింది, భేషుగ్గా! మూడు రోజులుగా ఆయన వత్తిడి చేస్తున్నారు. గాని నేనే ఆటంకపెడు తూన్నా. ఎప్పుడు పట్టుకోవాలో చెప్పండి, అమ్మగారూ, యేర్పాటు చేస్తాను.'

'అఁహాఁ! నిజం? ఐతే,చూడు! లక్ష్మీవారం! సరేనా!'

'సరే, అమ్మగారూ! అప్పటివరకూ యింకేమీ చనువియ్యనులెండి. చేపకి కాస్త ఆకలి పుట్టిస్తేనేగాని యెర మింగదు!'

'పని సానుకూల మవుతుందని ధైర్యంవుందా?'

'ఓ తప్పకండా! ఈలోగా ఆయన్ని వుద్రేకపరుస్తూంటా, మీరు చెప్పిన వేళకి సరిగ్గా టంగ్న అక్కడుండేట్లు చేస్తే సరా, అమ్మగారూ?'

'ఐతే, సరే? సరిగ్గా ఐదుగంటలకి!'

'సరేనండి, అమ్మగారూ! స్థలం?'

'నా పడకగదిలోనే!'

'బాగుందండి, అమ్మా! మీగదిలో, సరిగ్గా

'ఇంకప్పుడు నేనేం చేసేనో తెలుసా? ముందు

వెళ్ళి అమ్మనీ, నాన్ననీ పిలిచేను. డీ-ఆర్నోల్డ్ బాబాయ్‌నీ, ప్రెసిడెంటుగార్నీ, జడ్జి రాపెట్‌గారు లేరూ,- మావారి మిత్రుడు,-ఆయన్నీ కూడా తీసుకొచ్చేను. నేను వాళ్ళకి ముందుగా యేమీ చెప్పలేదు. సరిగ్గా ఐదుగంటలదాకా కనిపెట్టుకునివుండి అప్పుడు వచ్చేము. పిల్లిలా అడుగులు సడి కానీకండా ఒకరివెంట ఒకరు అందరం నా గది గుమ్మందగ్గిరికి వెళ్ళేము. నా గుండెలు ఆ సమయంలో యెల్లా కొట్టుకున్నా యని! మరో సాక్షిగానైనా పనికివస్తాడని ద్వారపాలకుణ్ణి కూడా మేడమీదికి రప్పించేను. ఐదూ టంగున కొట్టింది. తలుపులు బార్లా తెరిచే సరికి, హ్హా! హ్హా! హ్హా! యెదురుగా ఆయనగారు ప్రత్యక్షం! ఏం అవతారమని చెప్పనే, మాయమ్మా! ఏం మొఖమే! నువ్వొస్తూ డాయన మొహం చూడాలనుకో! బుద్ధిహీనుడు! పశువు! అలికిడి విని మావైపు తిరిగి చూసేడు. ఎంత హాస్యాస్పదంగా వున్నాడనుకున్నావ్! నే నొకటే నవ్వు! నాకు నవ్వాగదే! నాన్నగారికి చాలా కోపం వచ్చేసింది. అల్లుడికి దేహశుద్ధి చేదామనికూడా ప్రయత్నించేరు. పాపం, మా ద్వారపాలకుడే సాయం చేసి, గమ్మున బట్టలు తొడిగించేడు, ఆయనగారికి! వాడు చాలా మంచివాడులే, విశ్వాసపాత్రుడు. మా అందరి కళ్ళయెదుటా ఆయన మోడులా నిలబడి, బట్టలు కట్టుకున్నాడు. అయ్యో!

రాత! మేం చూస్తూండగానే నౌకరు ఆయనగారి పంట్లాం బొత్తాలు పెట్టి పెడుతూంటే యేం అందంగా వుందనుకున్నావు? అందరి యెదుట! ఇక, రోజ్, అది అద్భుతమైందిలే, అది ఒకటే యేడుపు. మా బాగా యేడ్చేసిందిలే. అలాంటి పిల్లని మనం యెక్కడా చూడమనుకో! రత్నం! నీ కెప్పుడైనా దాని అవసరం వచ్చిందంటే, పిలిపించవచ్చు, గుర్తుంచుకో.'

'అక్కణ్ణించి సరాసరి యిక్కడికి వచ్చేసేను. కథంతా నీతో చెపుదామని. ఇప్పుడింక నేను స్వతంత్రురాల్ని. విడాకులు వర్ధిల్లాలి! చిరస్థాయిగా వుండాలి!'

అంటూ సంతోషాతిరేకంతో ఆమె నాట్యం ఆరంభించింది. బారనెస్ విస్తుపోయి, పరధ్యానంగా, సాలోచనయై అంది:

'అది చూడ్డానికి నన్నెందుకు పిలవలేదు?'



# వాల్టర్ ష్నాఫ్స్ సాహసాలు

దాడిచేస్తున్న జర్మన్ సైన్యాలతో బాటుగా సరిహద్దులు దాటి ఫ్రాన్సులో ప్రవేశించి నప్పటినుంచీ వాల్టర్ ష్నాఫ్స్ గుండెలు పీచుపీచు మంటూనేవున్నాయి. తనంతటి దురదృష్టవంతు డెవడూ వుండడని అతడు నిర్ధారణచేసుకున్నాడు. వాల్టర్ అసలే స్థూలశరీరి; కాస్త విసురుగా నడుస్తే ఆయాసం వస్తుందాతనికి. అతని పాదాలు అప్పంముక్కల్లాగ మెత్తగా చదునుగా వుంటాయేమో, చాలాదూరం నడవాల్సి వచ్చినప్పుడు పాదాల్లో తీపులుపుట్టి అమితబాధ పడిపోతుంటాడు. అదీగాక అతను సహజంగా శాంతిప్రియుడూ, దయాంతఃకరణ గలవాడూ గాని సాహసుడూ, రక్తపిపాసీ గాదు. వాల్టర్ నలుగురుబిడ్డల తండ్రి; పిల్లలంటే అతని కెంతో మమకారంకూడాను. చిక్కని తలకట్టుగల చక్కనిచుక్క అతనిభార్య. వివాహం ఐనప్పటినుంచీ ఆమె లాలింపులూ, ముద్దులూ, చిన్నచిన్న సపర్యలకూ అలవాటుపడిపోయిన వాల్టర్‌కు రాత్రిళ్లు నిద్రపట్టడమే లేదిప్పుడు. అతని అభిప్రాయంలో సుఖమంటే రాత్రి పెందలకడనే పడుకోడం, ప్రొద్దుట ఆలస్యంగా లేవడం, స్నిగ్ధమైన పదార్థాలను ఆరగిస్తూ భోజనందగ్గర జాప్యం చేయడం, కెఫేలో బీరు త్రాగుతూ బాతాఖానీ వేస్తూ కూర్చోడం;- యిల్లాంటివే నని. సౌఖ్యమంతా జీవితంతో బాటు ఆఖరవుతుందని అతని నమ్మకం. అందువల్ల సహజంగానే, తర్కబద్ధంగానే వాల్టర్ మనస్సులో

రైఫిల్, రివాల్వరులు, ఖడ్గాలు మొదలైన మారణాయుధాలంటే తీవ్రద్వేషం యేర్పడిపోయింది. అందులోనూ సన్నీలంటే అతనికి మరీ అసహ్యం. తన బృహత్కళేబరాన్ని సంరక్షించుకునేటందుకు కావలిసిన నేర్పుతో ఆ చక్కని ఆయుధాన్ని ప్రయోగించడం తన కెప్పటికీ చేతగాదని అతనిభావనలో స్థిరంగా వుండిపోయింది. రాత్రిళ్లు తన పెద్దకోటు కప్పుకుని తోటిసిపాయీలతో బాటు నేలమీద పడుకున్నప్పుడు చుట్టూ అందరూ ప్రశాంతంగా గుర్రుపట్టి నిద్రిస్తూంటే యితని కంటిమీద కునుకే వుండేదిగాదు. పిల్లలమీదికి మనసుపోయీది. దానితో తన చుట్టూ సన్నిహితంగావున్న ప్రమాదాలు తలచుకుని నీరైపోయేవాడు. తను యుద్ధంలో చచ్చిపోతే, పాపం, తన పిల్లల గతేంకాను? ఆ పసిగందుల నెవరు కాపాడతారు? పోషిస్తారు? వాళ్ళు బ్రతకటానికై తనేమీ సంపాదించి యిచ్చింది లేదు. పటాలంలోకి పోవాల్సి వచ్చినపుడుమాత్రం దొరికినచోటు కాస్త అప్పుచేసి, కుటుంబానికి నాలుగు రూకలు యిచ్చివచ్చేడంతే. ఈ నిస్సహాయస్థితి తలుచుకుంటూంటే వాల్టరుకు యేడుపొచ్చేది. ఒక్కొక్కపుడు కళ్ళమ్మట నీళ్ళు బొటబొటా కారేవికూడాను. ప్రతీయుద్ధానికీ ముందు ఆతనికి యెక్కడలేని బలహీనతా కలిగేది; మోకాళ్ళు పట్లు తప్పిపోయినట్లయేవి; క్రింద సాష్టాంగంగా పడిపోయేవాడే కాని, తటాలున ఒక విషయం జ్ఞాపకంవచ్చి సంబాళించుకొనేవాడు. క్రిందపడిపోయిన తన శరీరం మీదుగా యావత్తు సైన్యమూ నడిచిపోతుందనే

భయమే లేకుంటే వాల్టర్ పడిపోయేవాడే. తుపాకిగుండ్లు రివ్వు మని దూసుకుపోతూన్నపుడు రోమాంచంతో అతని వళ్ళు జల్లుమనేది. ఇటువంటి భయభీతులతోనే అతడు నెలలు గడుపుతూన్నాడు.

అతడున్న పటాలం నార్మండీ ప్రాంతంమీదకు పురోగ మిస్తూంది. ఒకరోజున చిన్న దళంతో బాటుగా వెళ్ళి, కొంత ప్రాంతాన్ని పరిశీలించి తిరిగిరావలసిందని హుకుం జారీఅయింది. ఆ ప్రాంతమంతా చాలా ప్రశాంతంగానే కానవచ్చింది. రక్షణ సన్నాహాలు గావించుకున్న జాడలే అక్కడ కనబడలేదు. ప్రష్యన్ దళం ఓ మిట్టమీంచి మైదానంమీదికి బహు నిర్లక్ష్యంగా నడచిపోతూంది. ఆ ప్రాంతమంతా లోతైన పజియలతో నిండి వుంది. హఠాత్తుగా యేవైపునుంచో గుండ్లు వర్షంలా కురియ నారంభించి, యిరవైమందిని నేలగూల్చాయి. చూస్తూండగానే ఫ్రాంక్ టెరూర్‌లు (దేశభక్తులైన ఫ్రెంచి గెరిల్లాలు) బాయ్ నెట్లతో దాడిచేసేరు. వాళ్ళు ఆ సమీపంలోనే వున్న చాపంత అడవిలో దాగొనివుండే యీ ఆఘాయిత్యం చేయగలిగేరు. మొదట్లో వాల్టర్ పాతేసినట్లుగా స్థంభించి నిలబడిపోయేడు. పారిపోవాలనికూడా తోచలేదు, అతగాడికి! అంత హఠాత్తుగా ఆశ్చర్యకరంగా జరిగింది ఆ సంఘటన. ఆ పిమ్మట కాలికి బుద్ధి చెప్పి పరుగెత్తాలనే వూహ మెరుపులాతట్టింది. కాని ఆ వెంటనే యింకో ఆలోచనకలిగి నిలిచిపోయేడు. యుద్ధరంగంలో మేకల్లా చెంగుచెంగున దాటి పురకలువేస్తూ వస్తూన్న బక్క ఫ్రెంచి

వాళ్ళతో పోల్చిచూస్తే తనపరుగు తాబేటినడకగానే వుంటుంది. ఈ పరిస్థితుల్లో తనముందరే లోతైన పతియ కనబడింది. డొంకల తోటీ, తీగలతోటీ అల్లిబిల్లిగా అల్లుకొనివున్న ఆ పతియమీద పండుటాకులు తివాచీలా పరచివున్నాయ్. అది లోతుగానే వుందో, ముళ్ళే వున్నాయో అనేనా ఆలోచించకుండా వాల్టర్ రెండుకాళ్ళూ ముందుకుజాచి వంతెనమీంచి నీళ్ళలో దూకినట్లు దూకేసేడు. దట్టంగా అల్లుకున్న తీగలు, పల్లేరు డొంకల్లోంచి చాపరాయిలా పడిపోయి, పతియ అడుగున గులకర్రాళ్ళమీద గొంతుకూర్చున్నట్లు పడ్డాడు, వాల్టర్. అతనిచేతులూ మొహం కొద్దిగా గీరుకు పోయినాయి. పైకిచూస్తే తను పడడంవల్ల నైన కంతగుండా ఆకాశం కనబడింది. కొంపదీసి యీ కంతవల్ల తనుండే చోటు శత్రువులకి తెలిసిపోతుందేమో నని వాల్టర్కి భయంవేసింది. జాగత్రిగా కాలుచేతులమీద పాకుతూ ఆ ప్రవాహపు చాలుగుండా దూరంగా పోయేడు. యుద్ధరంగానికి దూరములో, పైన అల్లుకొనివున్న తీగలు, డొంకలు తన వునికిని మరుగుపరుస్తూన్న చోట ఆగి, కుందేలులా కూర్చుని, చెవులు రిక్కించి వింటున్నాడు. కొంతసేపటివరకూ కేకలూ, గాండ్రింపులూ, తుపాకీధ్వనులూ వినవచ్చి, క్రమంగా యుద్ధం చల్లారి, యీ గంద్రగోళం సద్దు మణిగింది. మళ్ళీ యెప్పటికిమల్లే అంతా పరిశాంతంగా వుంది. చుట్టూ ఉన్నట్లుండి యేదో రివ్వుమంటూ వాల్టర్ను దూసుకుపోయినట్లై, అతడి గుండెల్లో రైళ్ళు పరిగెత్తేయి. కొంచెందూరం పోయి కొమ్మలపై గూర్చున్న అది

చిన్నపిట్టయని ఆకుల సవ్వడివల్ల తెలుసుకున్నాక వాల్టర్ ప్రాణాలు గూటబడినాయి. కాని పక్కా గంటవరకూ అతని గుండెలు గబగబ కొట్టుకుంటూనే వున్నాయి.

సాయంత్రం పడింది. చీకట్లు నలుదెసలా అలుముకో నారంభించేయి. వాల్టర్ పరిస్థితులన్నీ సక్రమంగా ఆలోచించి చూచేడు. తనిప్పు డేంచేయాలి? తన గతి యేం కావాలి? తన రెజిమెంటుకు తిరిగిపోయి చేరాలని ఆలోచించాడు. కాని, అదెక్కడుందో తెలుసుకోనే దెల్లాగ? అదీగాక యుద్ధం ఆరం భించినప్పటినుంచీ గడపిన తన జీవితం జ్ఞాపకంవచ్చి, గతుక్కు మనిపోయింది మనసు. నిత్యం గాడిదకష్టాలు, బండచాకిరీ, అల సట, అనుక్షణం మృత్యువు నెదుర్కోడంలోని భీతావహం, యివన్నీ గుర్తుకొచ్చి, తిరిగి పటాలంలోకి పోవడమనే వాంఛను చంపేసేయి. అబ్బే! ఈ సుదీర్ఘ నిరంతరదండయాత్రాక్లేశాల్నీ, అనుక్షణాసన్న మరణభయాన్నీ తానింక భరించలేడు. సరేగాని, తర్వాత తాను చేయాల్సిం దేమిటి? నిర్జలమై, కంటకావృత మైన ఆ పటేయలో యుద్ధాంతంవరకూ వేచియుండగలడా? అసాధ్యం! ఆహారాన్ని వెతుక్కోవాల్సిన అవసరం గనుక లేకుంటే అక్కడే దాగివుండి, యుద్ధాంతంవరకు వేచియుండ డానికి వాల్టర్ సందేహించి యుండేవాడుగాదు. కాని, తిండి లేనిదే ప్రాణి నిలబడడం యెల్లాగ? అందులోనూ యీ ఆహా రావసరం నిత్యం మూడు పూట్లా కలిగేదాయెను! తానిక్కడ, ఒంటరిగా శత్రుభూమి, వంటిమీాద సైనికదుస్తులతో, యేకాకిగా

వున్నాడు కూడాను. ఇదంతా తలుచుకుంటూంటే గడగడ వణుకుపుట్టింది, వాల్టర్‌కు. అంతలో అతని మనసులో లక్షాలువ ఒకఆలోచన మెరపులా మెరిసింది,—

"నేనే గనక ఖైదీగా పట్టుబడితేనో!"

ఈ కోరికతో గాఢమైన, అనంతమైన యీ వాంఛతో, ఫ్రెంచివాళ్ళచేత ఖైదీగా పట్టుకోబడాలనే యీ కోరికతో, అతని మనస్సు గంతులేసింది. తను ఖైదీగావుంటే, వుండేందుకు యిల్లూ, తిండానికి తిండీ సిరాఘాటంగా లభిస్తాయి. మూంఛి బందోబస్తుగా కాపలావున్న ఖైదులో, వెచ్చనిగదిలో తానుంటాడు! కత్తులు, తుపాకీగుళ్ళు, సన్నీలు, అన్ని మారణాయుధాలనుంచీ తనకు రక్షణవుంటుంది ఆహాహా! ఖైదీగా పట్టుపడ్డం ఏమి అదృష్టం! అ దేలాంటి సుఖస్వప్నం! అంతే, ఈ ఆలోచన తట్టిన వెంటనే తాను ఖైదీగా పట్టుపడాలని నిర్ణయించుకున్నాడు, వాల్టర్. ఇక ఒక్కక్షణమైనా ఆలస్యం చేయకుండా తన ప్లాను అమలులో పెట్టాలనుకుంటూంటే ఓ చిన్నసందేహం కలిగింది. దానితో నిశ్చేష్టుడై చతికిలబడిపోయేడు. కొత్తభయాలు, సందేహాలు అతన్ని పట్టుకుపీడింప నారంభించేయి. ఎవరికి పట్టుబడాలి, తాను? అదీ ప్రశ్న! తను దొరికిపోయేందుకు తగ్గమనిషి తనకెక్కడ దొరుకుతాడు? భయంకరమైన చిత్రహింసలు, మరణబాధలు వూహించుకుని అతని భావనాశక్తి అతణ్ణి కంగారు పెట్టేస్తూంది. తను శిరస్త్రాణాన్ని ధరించి యీ గ్రామీణ ప్రాంతాల్లో ఒంటరిగా బైలుదేరితే యెంతలేసి ప్రమాదాలు

జరిగేందుకేనా వీలుంది. దారిలో కొందరు రైతులు కనబడ్డారనుకోండి. దారితప్పిన ప్రష్యన్ సైనికుడు అరక్షితుడై యేకాకిగా కనబడ్డాడంటే వాణ్ణి పిచ్చికుక్కను కొట్టినట్లుగా కొట్టి చంపేస్తారు, యీ ఫ్రెంచి రైతులు. పారలు, గునపాలు, కొడవళ్ళు, దంతెనలు,— చేతిలో యేదుంటే దానితో చితుకగొట్టి, పచ్చడి చేస్తారు. తమ దేశం ఓడిపోయినందుకు కసి తీర్చుకుంటారు! లేక, పోనీ తాను ఫ్రాంకు టైరూర్స్ కంటబడ్డాడనండి. వాళ్ళకి చట్టమూ చట్టుబండలూ లేవు; శిక్షణా సింగినాదం లేదు. మా చెడ్డ దుస్సాహసులులెండి వాళ్ళు. తమ కులాసా కోసం, కాలక్షేపానికై, ప్రష్యన్ భయభీతుడైనప్పుడు వాడి మొహం యెల్లావుంటుందో చూడ్డానికే, నిలుచోబెట్టి కాల్చిపారేస్తారు! తను గోడకి దాపెట్టి నిల్చోడం, యెదుట ఓ డజను తుపాకి గొట్టాలు తనవైపు చీకటికళ్ళతో చూస్తున్నట్లూ భావించుకొని వాల్టర్ ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది... పోనీ, తాను ఫ్రెంచి సైన్యాలనే కలుస్తే? ఔట్ — పోస్టువాళ్ళు తనను స్కౌట్‌గా భావించి, సాహసుడైన, మాయావియైన గూఢచారిగానో, మహావీరునిగానో తలచి, చూడగానే కాల్చి పారేస్తే? అమ్మో!...రుప్పల్లో దాగొన్న ఫ్రెంచిసైనికులు టపటపా కాల్చడం వినిపించి, తను యేదో పొలం మధ్యలో వళ్ళంతా తూట్లుపడి, కుప్పకూలిపోయివున్నట్లు కనిపించి, గడగడలాడేడు. గుళ్ళు తనశరీరంలో కదులుతూన్నట్లే అనిపించింది,

ఆతనికి. నిరాశుడై చతికిలపడిపోయేడు. ఈ క్లిష్టపరిస్థితుల్లోంచి బైటపడే మార్గం అతనికి తోచలేదు.

రాత్రి పడింది. అంతా చీకటీ, నిశ్శబ్దతా అతడిచుట్టూ ఆవరించేయి. కూర్చున్నచోటనే వుండి, యే చిన్న చప్పుడైనా వణుకుతున్నాడు. చీకట్లోంచి మనకు తెలియని ధ్వను లేవో నిరంతరం బైలుదేరుతూనేవుంటాయి, గుండెల్లో భీతి పుట్టిస్తూ, కలుగులోంచి వెనుకకాళ్ళమీద గెంతిన కుందేలు, వాల్టర్‌ను పరుగెత్తించినంత పనీ చేసింది. గుడ్లగూబల అరపులు అతని మనసు కోతబెట్టి, గుండెల్లో గాలాలు గుచ్చి, భీతితో గడగడ లాడేట్లు చేస్తున్నాయి. తన మిత్రగుడ్లను అప్పగించి చూస్తూ. చీకట్లో యెవరో తన దగ్గరికి వస్తున్నట్లు భావించి, ప్రాణా లర చేతబెట్టుకునేవాడు ఈ రీతిగా అసంతృప్తముగా తోచే ఆ రాత్రి ఘడియలు వేగించి, వాల్టర్ మరణశిక్షపడినవానివలె గడిపేడు. ఎట్టకేలకు నెత్తిమీది కొమ్మల రెమ్మల పందిరిలోంచి తెల్లతెల వారుతూన్నట్లు చూచి, గుండెల్లో అలట తగ్గింది. కన్నులు మూతబడి నిద్రాదేవత అతనిపై కరుణచూపింది.

వాల్టర్ నిద్ర మేల్కొనేటప్పటికి సూర్యుడు నడిమింట నున్నాడు. ఆ నీరవనిశ్శబ్దగ్రామీణప్రశాంతతను భంగపరిచేది అక్కడేదీ లేదు. అతని కడుపులో ఆకలి దహించేస్తూంది. ఆవులించేడు. సైనికుల కిచ్చే కమ్మని కైమాలడ్డూ తలపుకొచ్చి నోట నీరూరింది. కడుపులో శూన్యత తోచి చేయిపెట్టి కలచినట్లైంది.

లేచి, అడుగులు వేసేసరికి, కాళ్ళెంతో బలహీనంగా తేలిపోయి నట్టై మళ్ళీ చతికిలపడ్డాడు. పరిస్థితులన్నీ యింకోసారి సింహావలోకనం చేసి, కీడుమేళ్లు తహావేలు వేస్తూ రెండుమూడుగంటలు గడిపేడు, తనకు తెలియకుండగనే. మతిస్థిమితం లేక, అటుసిటు తేల్చుకో లేక, ఒకనిముషం ఒకలాగా, మరునిముషం యింకోలాగా చేద్దామనుకుంటూ, దిగులుగా, గందరగోళంలో పడి కొట్టుమిట్టాడుతూ వుండిపోయేడు, వాల్టర్. ఎట్టకేలకు తనకు వుచితంగానూ, క్షేమకరంగానూ తోచిన ఓ నిర్ణయానికి అతడు రాగలిగేడు. అదేమిటంటే, ఎవడేనా గ్రామీణుడు, చేతనేమీ ప్రమాదకరమైన ఆయుధాలు గాని, పనిముట్లు గాని లేకండా అటురావడంకోసం కనిపెట్టుకుని అక్కడే కూర్చోవాలని. అప్పుడు తా నాతనిదగ్గరికి పరుగెత్తిపోయి, అతని చేతుల్లో వప్పగింత పెట్టుకొని, అతని అధీనంలోని ఖైదీనని అతనికి తేట తెల్లంగా తెలియజెప్పి, తరువాత జరిగేదానికోసం వేచియుంటాడు. మొనగల శిరస్త్రాణాన్ని నెత్తిమీంచి తీసి క్రింద పెట్టేసేడు, దానిమూలంగా తను దాగినచోటు బయటపడిపోతుందేమోనని. ఇంకా యెన్నో చిన్నచిన్న జాగ్రతలు తీసికొని, పతియ గట్టుమీంచి తలపైకెత్తి గమనించేడు; కనుచూపు మేరలో యెక్కడా నరసంచారం లేదు. దూరంలో కుడిచేతి మీదుగా చిన్నగ్రామం వున్నట్లు గానవచ్చింది. ఇండ్లమీదుగా పొగలేస్తూంది. బహుశా ఆ పొగలు వంటిళ్ళలోంచి బైలుదేరి

నవే అయివుంటాయి. ఎడమచేతిమీందుగా పెద్దచెట్లవరుసలూ, వాటిమధ్య బురుజులూ, రాజభవనం గానవచ్చేయి.

సాయంత్రింపడేవరకూ వాల్టర్ వేచివుండి, బాధలన్నీ సహించుతూనేవున్నాడు. అతడు కన్నదంతా యెగిరే కాకుల మూకలు, విన్నదంతా తన కడుపులోని గురగురలు. మళ్ళీ యింకోసారి రాత్రిపడింది. పటియలో పడివుండే, గాఢనిద్రలో మునిగి, ఆకలిపీడితుడు కనే స్వప్నాలన్నిటినీ అనుభవించేడు. మరొకసారి ప్రాతఃకాలం అయింది. ఆ దినమంతాకూడా అల్లాగే నిరీక్షిస్తూ కూర్చున్నాడు. కాని, ఆ రోజునకూడా క్రితంరోజుకి వలెనే ఆ పల్లెటిప్రాంతమంతా నిర్జనంగా వుంది. ఆతని కిప్పుడింకో భయం పట్టుకుంది. ఆకలిచేత చావాల్సివస్తుం దేమిటి చెప్మా? ఆ పటియలో తాను కదలలేక పడివుండడం, కళ్ళు మూతలు పడడం, చిన్నచిన్న పురుగులు తన శరీరంమీది కెక్కి, దుస్తుల లోకి చొరబడి, చల్లని తన శరీరాన్ని కొరికి తింటూవుండడం, ఓ పెద్ద మాలకాకి తన మొహంమీద వ్రాలి కన్నులు పొడు చుకు తింటూవుండడం,— యిదంతా అతడి మనోనేత్రంముందు చిత్రించబడి కానవచ్చింది. భీతి, తెగింపు కలిగేయి. అలిసిపోయి కళ్ళుతిర్గుగమ్మ్రుతూన్న ట్లనిపించింది. త్వరలోనే తాను నడిచేం దుకు అశక్తుడైపోతాడు. తన ధైర్యాన్నంతనూ కూడదీసికొని, గ్రామంవైపు చొరబడాలని నిశ్చయం చేసుకుంటూనే తలెత్తి చూసేడుగదా, ముగ్గురు రైతులు దంతెనకర్రలు భుజాలమీద పెట్టుకుని పొలాల్లోంచి పోవడం కనబడింది. అంతే, గమ్మున

వాల్టర్ తాబేలులా తల లోనికి లాగేసుకుని, కాలవలో బొక్కబోర్లా పడుకుని పోయేడు.

బాగా చీకటిపడింది. మైదానమంతా నల్లని ముసుగు కప్పివున్నంది. వాల్టర్ పటియ్యల్లోంచి మెల్లగా గట్టుమీదికి యెగ ప్రాకేడు. నేలమీదికి బాగావంగి నడుస్తూ, గుండెలు తటతట కొట్టుకుంటూంటే, మెల్లిగా, పిరికిగా అడుగులేస్తూ, దూరాన వున్న రాజభవనంవైపు సాగిపోనారంభించేడు. పెద్దపులుల నివాసంలా తోచిన ఆ గ్రామంకంటె భవనమే వేయిరెట్లు మేలుగా అతనికి ఆ సమయంలో తోచింది.

రాజభవనపు క్రింది అంతస్థంతా దీపాలతో ప్రకాశవంతంగా, శోభాయమానంగావుంది. ఒకప్రక్క కిటికీతలుపులు తీసివున్నాయికూడాను. వేపిన మాంసం వాసనలు కమ్మగా వచ్చి, వాల్టర్ నోరూరించి, కడుపులోకి జొరబడి గిలిగింతలు పెడుతున్నాయి. కమ్మని పరిమళాలు తగలడంతోనే అతడు బరువుగా వూపిరి పీలుస్తూ, దడదడలాడిపోతున్నాడు. ఆకలిగొన్నయాతడు తెగువతో సాహసించి వాటిమీద బడిపోవాలనే నిశ్చయానికి తనకు తెలియకుండానే వచ్చేసేడు. తిరుగులేనిశక్తి అతణ్ణి భోజనపదార్థాలవైపు గొలుసులతో యీడుస్తూన్నట్లుంది. అఁ హాఁ! ఇక ఆలోచన లేదు. క్షణం ఆగేందుకూ లేదు. వెన్వెంటనే వాల్టర్ తన తలను, మొనగల శిరస్త్రాణంతోసహా కిటికీలోంచి లోనికి పెట్టేసేడు. పెద్ద టేబిలుచుట్టూ యెనమండుగురు సేవకులు భోజనానికి కూర్చొనివున్నారు. హఠాత్తుగా ఒక

పనికత్తె చేతిలోని గ్లాసును వదిలేసి, కిటికీవైపు కళ్ళప్పగించి చూస్తూ కూర్చుండిపోయింది. ఆమె చూపులు ప్రసరించే దిక్కుకే మిగిలిన సేవకులుకూడా చూచేరు. ఇంకేముంది? బాబో! శత్రువులు! అయ్యో! దేవుడా! ప్రష్యన్లు రాజ భవనాన్ని ముట్టడిస్తున్నారు! మొదట ఒక్కటే గావుకేక; ఎనిమిది కంఠాలొక్కటై, యెనిమిది శ్రుతులలో అరచిన ఒక్కటే గావుకేక! భయవిహ్వలత్వంతో చేసిన ఆర్తనాదం! అంతే. తరువాతంతా గందరగోళం, తొక్కిసలాట, గలభా. సేవకులంతా ఒక్కుమ్మడిగా లేచి, అటునిటు పరుగులిడుతూ, మరోవైపు ద్వారంగుండా పారిపోయేరు. ఈ గందరగోళంలో కుర్చీలు తిరగబడి పోయినాయి. మగాళ్ళు ఆడాళ్ళని పడకొట్టేసేరు, వాళ్ళని తొక్కుకుంటూ పారిపోయేరు. చూస్తుండగనే గదంతా ఖాళీ అయిపోయింది. వాల్టర్ ఒక్కడే కిటికీదగ్గర బైట ఆశ్చర్య నిమగ్నుడై చూస్తూ, నిలబడిపోయేడు. గదిలోపల ఎదురుగుండా భోజనపదార్థాలతో నిండిన టేబిలు!

కొంచెం తటపటాయించి, వాల్టర్ కిటికీలోనికి దూకి, ఆహారపదార్థాల్ని సమీపించేడు. ఆకలితోనూ, వాంఛతోనూ అతని శరీరం వణికిపోతూంది; జ్వరపీడితునివలె కంపిస్తూ, భయసందేహాలతో యేదైనా శబ్దం అవుతుందేమో నని వళ్ళంతా చెవులు చేసుకుని వింటూ, కొంచెంసేపు అక్కడే నిలబడిపోయేడాతెడు. భవనమంతా కూలిపోతున్నట్లు తోచింది. పై అంతస్థుల్లో తలుపుల దడబిడ చప్పుడులూ పలువుర పాదసంఘట్టనలూ

వినవస్తున్నాయి. ఈ గందరగోళ మంతా వాల్టర్ భయసంభ్రమాలతో వింటూ నిల్చునే వున్నాడు. ఆ తరువాత యేవో భారమైన వస్తువులు పడేస్తున్నట్లు దబ్బుదిబ్బున నేలమీంచి శబ్దాలు వచ్చేయి. క్రిందిఅంతస్థు కిటికీల్లోంచి చాలామంది మనుష్యులు మెత్తని నేలమీదికి దూకుతున్న అలికిడిలా వుందది. ఆ పిమ్మట ఆ చప్పుడూ నిలచిపోయి, విశాలమైన రాజభవన మంతా నిశ్శబ్దంగా సమాధిలా అయివూరుకుంది.

ఎవరూ ముట్టని కంచంముందర కూర్చుని వాల్టర్ భోజనం ప్రారంభించి పెద్దముద్దలు నోట కుక్కుకుంటూ బాబాకరంగా తింటూన్నాడు. తనభోజనం పూర్తిగాకండానే యెవరో అడ్డుపడతారేమోనని భయపడుతూన్నట్లు, అతడు రెండుచేతులా పదార్థాల్ని నోట కుక్కుకుంటూంటే, నోరు వూరికే యెలకకన్నంలా తెరిచిపెట్టుకునే వుండిపోయింది. కబళం తర్వాత కబళం నిరంతరాయంగా, నిరర్గళంగా అతని గళంలోంచి వుదరగోళంలోకి జారి మాయమై పోతూనే వున్నాయి. మధ్యమధ్య డెక్కపట్టినప్పుడు మధుకలశాన్ని చేత్తో అందుకుని గడగడ పట్టిస్తున్నాడు. తూముకాలవలో చెత్తాచెదారం నిండి అడ్డుపడ్డపుడు బాల్చీనీళ్ళుపోసి, కడిగేసినట్లే ననుకోండి. క్రిమంగా టేబిలు మీది పళ్ళేలన్నీ ఖాళీ యైపోయేయి. సీసాలన్నీ వట్టివైపోయేయి. తిండితోనూ, మద్యంతోనూ కెక్కుమంటూన్న స్థితిలో, కళ్ళు మూతలు పడిపోతూంటే, సన్నగా దగ్గుతూ, ఆయాసపడుతూన్నాడు, వాల్టర్. అతని మొహం యెర్రగా కంది

పోయింది. తల తిరిగి పోతూంది. ఊపిరి పీల్చడానికి యూనిఫారం బొత్తాములన్నీ విప్పేసి, వదులు చేసుకున్నాడు. ప్రాణంమీదికొచ్చినా అడుగుకదపలేని స్థితికి వచ్చేడంటే నమ్మండి. కళ్ళు మూతలుబడిపోతూ, మగత క్రమ్ముకొస్తుంటే కూర్చున్నచోటనే టేబిలుమీద చేతు లానించి, వాటిమీద తలపెట్టుకొని గుర్రుపెట్ట నారంభించేడు. ఆ నిద్రలో పడిన వాల్టర్‌కి బయట ప్రపంచంలో యేం జరిగినా పట్టదుగాక పట్టదు!

అస్తంగతుడవుతూన్న చంద్రుడు తోటలోని వృక్షాగ్రాలమీద అలౌకికకాంతిని బరపుతూన్నాడు. నీడలు, నిశ్శబ్దమైన నీడలు, అసంఖ్యాకంగా, పొదల్లోంచి తక్కుతూ తారుతూ రాజభవనాన్ని చుట్టుముట్టి సమీపిస్తున్నాయి. అప్పుడప్పుడు మాత్రం పదునైన ఆయుధాగ్రాలు వెన్నెల్లో మెరుస్తున్నట్లవుతూంది. రాత్రిపూట రాజభవనం నల్లగా నిలబడివుంది. భవన గవాక్షాలన్నీ కూడా నల్లగానే వున్నాయి. క్రింది అంతస్థులలోని రెండు కిటికీలుమాత్రం వెలుతురునిస్తున్నాయి.

హఠాత్తుగా గంభీరధ్వనితో ఆజ్ఞ వినవచ్చింది;

"రాండి! శూరులార! భవనాన్ని ముట్టడించి, స్వాధీనం చేసుకోండి! ముందుకు దూకండి!"

క్షణంలో ప్రతిద్వారమూ, కిటికీ, కంతాకూడా తెరవబడిపోయి, బలాత్కారంగా, గందరగోళంగా అసంఖ్యాకమైన మూకలు భవనంలోకి జొరబడిపోయినాయి. దారిలో అడ్డొచ్చినదేదీ ఆగలేదు. ఆపాదమస్తకం ఆయుధాలు ధరించిన యాభై

మంది భటులు వంటింట్లోకి జొరబడి, సుఖంగా నిద్రిస్తూన్న వాల్టర్ వైపు యాభై తుపాకుల్నీ గురిపెట్టేరు. ఆ జాగ్రత తీసుకున్న తర్వాత మెల్లగా అతన్ని సమీపించి, కిందపడగొట్టి, నేలపై దొర్లించి, కాలుచేతులూ బంధించేసేరు. వాల్టర్ మేల్కొని, అత్యాశ్చర్య నిమగ్నుడై, భీతితో వగరుస్తూ వాళ్ళని చూస్తూన్నాడు. భయంతో పిచ్చెత్తేట్లున్న అతణ్ణి వాళ్ళు కొట్టి, బాది వదలిపెట్టేరు. లావాటి ఆఫీసరొకడు, జరీ త్రాళ్ళు మెరుస్తూంటే ముందుకువచ్చి, పడివున్న శత్రువు పొట్టమీద అడుగేసి, అరచేడు;

"నువ్వు నా ఖైదీవి! లొంగిపో!"

ఆ ప్రష్యన్ తెలిసినది ఒక్కటేమాట 'ఖైదీ'

"జా! జా! జా!" అంటూ అత డేడ్చేడు.

ఫ్రెంచి సైనికులు వూరికే వుబ్బి తబ్బిబ్బవుతూన్నారు, యీ ఖైదీని పట్టగొగల్గినందుకు. వాళ్ళాతణ్ణి యెత్తి, కుర్చీమీద కూర్చోబెట్టి, త్రాళ్ళతో బంధించి, కుతూహలంతో అతణ్ణి గమనిస్తూన్నారు. కొందరు వుద్రేకంతోటీ, పరిశ్రమతోటీ అలిసిపోయి, నేలమీద చతికిలబడ్డారు. వాల్టర్ యిప్పటికి చిరునవ్వు తెచ్చుకొన్నాడు. నిస్సందేహంగా తాను యిప్పుడు ఖైదీ కాగలిగేడని తెలుసుకుంటూంటే అతనిలో కులాసా పొంగిపొర్లి వుబుకుతూవస్తూంది. జూనియర్ ఆఫీసర్ ఒకడొచ్చి కల్నల్‌కి నివేదించుకున్నాడు:

"సార్! శత్రువులు పారిపోయేరు. వాళ్ళలో చాలమంది గాయపడ్డట్టు తోస్తోంది. రాజభవనం మనకి స్వాధీనమైంది!"

"విజయం!" నుదురు తుడుచుకుంటూ అన్నాడు, మహాకాయుడైన కల్నల్.

మెల్లిగా జేబులోంచి వ్యాపారులు వాడే చిన్న నోటు బుక్కు తీసి యిల్లా రాసేసేడు, కలనల్:

"బహు తీవ్రపోరాటం జరిగినమీద ప్రష్యన్లు తిరోగమించవలసివచ్చింది. గాయపడినవాళ్ళనీ మృతుల్నీ మోసుకుంటూ వాళ్ళు వెనక్కి పారిపోయేరు. వారి నష్టాలు యాభైవరకు అంచనా వేయబడినాయి. చాలామంది ఖైదీలు మన చేతుల్లో దొరికిపోయేరు."

"నా కేమైనా ఆజ్ఞాపిస్తారా, సార్!" అన్నాడు యువక ఆఫీసర్.

"రాజభవనాన్ని మనం వెంటనే ఖాళీ చేస్తాం. ఇంకా అధిక బలాన్ని కూర్చుకుని, ఫిరంగుల సాయంతో శత్రువు తిరుగుదాడి చేయవచ్చు" నన్నాడు, కలనల్.

ఇందుకుతగ్గ ఆజ్ఞలు జారీ చేయబడినాయి. భవనపు గోడలక్రింద చీకట్లో సైనికులంతా తిరిగి దళాలుగా యేర్పడ్డారు. వాల్టర్ ష్నాఫ్స్‌ను గట్టిగా కట్టివేసి చుట్టూ గట్టి బందోబస్తు చేసి ఆరుగురు వీరులు రివాల్వర్లు దట్టించి కూడారాగా, దళం ముందుకు సాగింది. మధ్యమధ్య ఆగుతూ, జాగ్రతగా జాడలు తీస్తూ, తెల్ల

16

వారేసరికి లా-రోచీ-ఓయ్‌సెల్ నగరంలో ప్రవేశించి, మేజస్ట్రేటు యింటిముంగట విడిసేరు. అన్నట్లు మరచిపోయేను— ఈ మహా సాహసాన్ని గావించి, విజయాన్ని సాధించింది, రోచీ-ఓయ్‌సెల్ నగరపు నేషనిల్ గార్డ్సు దళాలే. ఈ వార్త తెలిసిన పట్టణప్రజలు వుద్రిక్తులై, తమ వీరసైనికుల రాకకై వేచియుండి, వారు రాగానే జర్మన్ ఖైదీ శిరస్త్రాణాన్నీ, దానిమీద మొఖన్నీ చూచి పెద్ద వూరేగింపు బైలుదేరదీసేరు. దారిపొడుగునా ప్రష్యన్ ఖైదీమీద స్త్రీలు తమ పిడికిళ్లు ఝళిపిస్తూనేవున్నారు; ముసలమ్మలు కళ్ళనీళ్ళు పెట్టుకుని యేడ్చేరు; నగరవీధుల్లో నిరంతర సంచారం చేస్తూండే మూడుకాళ్ళ ముదుసలియొకడు తనచంక కర్రను ఖైదీమీదకి విసిరేసి, గార్డ్సులో ఒకడి ముక్కు-దూలం విరగ్గొట్టేడు.

ఈ గందరగోళంలో కలనల్ గావ్రకేక పెట్టి, ఖైదీని తీసుకొస్తూన్న గార్డుతో చెప్పేడు :

'ఖైదీ క్షేమానికి మీందే పూచీ!'

ఎట్టకేలకు టౌనుహాల్ చేరేరు, ఖైదీతోసహా, యీ వీర సైనికులు. ఖైదుకొట్టు తాళాలు తీసి, తాళ్ళు విప్పి, వాల్టర్‌ను లోపలకి త్రోసి, తాళాలు వేసేరు. టౌనుహాల్ చుట్టూ రెండు వందల సాయుధుల్ని కాపలాపెట్టేరు, బందోబస్తుగా.

తాను క్షేమంగా ఖైదులో వుంచబడ్డానని ధైర్యం తోచడంతోనే వాల్టర్ సంతోషానికి హద్దులేదు. అప్పటికే చాలా

సేపటినుంచీ అజీర్ణంవల్ల బాధపడుతున్నా, యీ సురక్షితస్థితి తలచుకుని అతను సంతోషంగా గదంతా నాట్యం చేస్తున్నాడు. ఆనందోద్రేకంలో గదిలో గంతులేస్తూ, కాలుచేతు లెగరేస్తూ, పిచ్చికేక లేస్తూ, అలిసి సొలిసి పోయి మధ్యలో చతికిలబడి పోయేడు, చివరకి.

అమ్మయ్య! తానొకఖైదీ! చిట్టచివర కిప్పటికి తాను సురక్షితుడయేడు.

షాంపిగ్నా రాజభవనం శత్రువునుంచి తిరిగి వశపరచుకొన్న తీరు తెన్నులిట్లాంటివి. ఆ భవనం కేవలం ఆరుగంటల కాలంమాత్రమే శత్రువుల హస్తాల్లో వుంది. కలనల్ రాటియర్ అసలుజీవితంలో బట్టల వ్యాపారస్థుడు. ఆయనగారే లా-రోచీ ఓయ్సెల్ సేషనలు గార్డుకు నాయకత్వం వహించి, నడిపి, యీ మహావిజయాన్ని సాధించేడు. ఈ శూరసాహసకృత్యానికి కలనల్ రాటియర్కి మహాశూరపతకం బహూకరించబడింది కూడాను.



# నల్లద్రాక్ష

ఆమెనందరూ "నల్లద్రాక్ష" అని పిలుస్తారు. దానికి కారణం ఆమెజుట్టు నల్లగా వుండడమూగాదు, శరీరం చామన ఛాయగా వుండడమూగాదు. ఆమె పెదవులు నల్లగా, లావుగా వుంటాయి. అంతేగాదు. పెదవులు బిగించినప్పుడవి అచ్చంగా నల్లద్రాక్షపండులాగే వుంటాయి కూడాను.

ఆ చుట్టుపట్ల అందరి శరీరఛాయా చాలా తెల్లగా వుంటుంది. ఆమె తలిదండ్రులిరువురూ కూడా నవనీతంలాంటి శరీర ఛాయా, పీచులాంటి జుట్టూ వున్నవాళ్ళే. ఐనా ఆమె అంత వర్ణహీనంగా వుండడానికి కారణం వారసత్వవైచిత్రియే. ఆమె పూర్వీకుల్లో యెవ్వతెకోగాని ఆ ప్రాంతల్లో అనాదినుంచీ దిమ్మరుతూ, కళాయిపనులు చేసేవాళ్ళలో ఒకనితో పరిచయం వుండేదని అనుకుంటారు. ఆ తెగవాళ్ళ శరీరాలు మాడిన రాగి రంగుగానూ, జుట్టు నల్లగానూ వుంటాయని అందరూ యెరుగుదురు.

ఆ పూర్వీకురాలినుంచి ఆమెకి వారసత్వంగా వచ్చినది శరీరఛాయమాత్రమేగాదు. నల్లని ఆత్మా, కుటిల నేత్రాలూ కూడ ఆమెసొత్తులే. క్రూరజంతువు కండ్లనుబోలిన ఆమెనేత్రాల అగాధాల్లో కానరాని పాపపు టాలోచనాఛాయలు వుండనే వుండవు.

ఆమె సౌందర్యవతా? అబ్బే! కానేకాదు. చివరకు కాస్త నదరుగానైనా వుంటుందని చెప్పలేము. అంతేగాదు వికార రూపిణికూడాను. పరమాసహ్యాంగా వుంటుంది. ఆమెలో యెంతటి కాఠిన్యం గానవస్తుందని! దిమ్మిసకొట్టి చదునుచేసినట్లు ఆమెముక్కు చప్పిడిగా వుంటుంది. అసహ్యాంగా వుండే ఆమె వాపిరినోరు యెప్పుడూ చొల్లు కారుతూనో, యే బూతుకూతలో కూస్తునో వుంటుంది. పిట్టలు పీకిన కొంకలా ఆమెజుట్టు చిక్కగా, చింపిరిగా, చీడలకు పుట్టినిల్లుగా వుంటుంది; ఎప్పుడూ కుతకుత వుడికే సన్నని శరీరం; కుంటి నడక; ఒక్కమాటలో చెప్పాలంటే ఆమె ఒక పిశాచరూపిణి ఐతేనేం, ఆచుట్టుపక్కలవుండే కుర్రాళ్ళంతా ఆ రాకాసితో ప్రేమకిలాపాలు కోరినవాళ్ళే! ఆ అదృష్టం ఒకసారి పట్టినవాళ్ళు తిరిగి ఆమె పొందుకోసం తహతహ లాడేవాళ్లు కూడాను.

ఆమె పన్నెండేళ్ళ ప్రాయంనుంచీ ఆ వూళ్ళో ప్రతి మొగాడికీ లంజగావుంటూ, తన యీడు కుర్రాళ్ళందర్నీ అన్ని రకాలుగానూ, అడ్డమైనచోట్లా పాపపంకిలంలోని కీడుస్తూనే వచ్చింది.

ఆ పలుగు పోకడలచే ఆకర్షించబడి, కుర్రాళ్ళు జైలు కూడా భయపడకండా ఆమెవెంట బడేవాళ్ళు. కుర్రాళ్ళే కాదు. ఒడిదుడుకులు తీరి, కాగిచల్లారిన పాలలాంటి వయోధికులూ, గౌరవనీయులూ కూడ దాని టక్కులకి లోబడిపోయీ వాళ్ళు! ఎక్లాషీలోకల్లా పెద్దభూస్వామీ, మాజీ మేయరూ ఐన

మార్టిన్ మహాశయుడూ వగైరా మాననీయులైన పెద్దమనుష్యు లెందరో ఆమెతో సంబంధాలు పెట్టుకున్నవాళ్లే. చివరికి ఆవూరి పోలీసువాడుకూడా అంతే. మేజస్ట్రీటు యెదుటికి మనుషుల్ని యీడవడమంటే అతగాడి కెంత ఆసక్తైనా, తనమీాద కూడా ముందే సమను జారీ అవుతుందేమోననే భయమే అతగాడు మెతకదనంతో వూరుకోడానికి కారణమని అంతా అనుకునేవాళ్లు.

ఏతావతా ఆమె యెల్లాంటి అదుపాజ్ఞలూ లేకండా, పెరిగి పెద్దదైంది. ఆ వూరి బడిపంతులు చెప్పినట్లు, ఆమె ఆచుట్టు పట్ల అడ్డమైనవాణ్ణీ యెరిగేవుంది. ఆ 'అడ్డమైన' వాళ్ళల్లోనూ ఆ బడిపంతులు కూడా ఒక్కడై వుండడనే యిక్కడ విశేషం! ఈ వ్యాపారంలో యింకా విచిత్రం యేమంటే, యింతమం దున్నా వాళ్ళల్లో ఒక్కడికీ మరొకడిమీాద అసూయ లేకుండ డనే. వాళ్ళందరూ, ఆమెని ఒకడు మరొకడికి అందిచ్చేవారు; అంతే. ఓరోజున ఓఅజ్ఞాని యీావిషయంమీాద తన ఆశ్చర్యాన్ని ఆమెదగ్గర వెలిబుచ్చేసరికి, ఆ తెలివితక్కువవాడితో ఆమె అన్నదట,—

'ప్రతివాడూ తృప్తిపడుతున్నాడా? లేదా? అంతే!'

అంతేగాకున్నా, యెవడికేనా అసూయకలిగినా, ఆమెని తానొక్కడే గుత్తగొనడం యెల్లా సాధ్యమాతుంది? ఆమె యెవరి అధికారంలోనూ లేదామె. పోనీయంటే, ఆమె స్వార్థ పరురాలూగాదు; ధనవస్తురూపాల్లో ప్రియులదగ్గర అన్ని రకాల బహుమతుల్నీ అంగీకరించేది. కాని దేనినీ తనంత తానై అడిగేది

గాదు. పైపెచ్చు తన చిత్తం వచ్చినట్లు తానే యెదురు యివ్వడమంటే ఆమెకి మోజున్నట్లుకూడా కనబడేది! బహుమతుల కంటె దొంగతనమంటేనే ఆమెకి బహుప్రీతి. దొంగిలిస్తేనే ఆమెకి సంతృప్తి. బహుమతిగా వచ్చిన రూపాయికన్న దొంగచాటుగా తీసుకున్న అణాయే ఆమె కధికసంతృప్తి నొసగేది! ఎవరైనా ఆమెని శాసించడం అనే వూహకూడా కేవలం అసంగతం. ఆ గూటికి వ్రజుగా, జనానాకి యేకైక అధిపతిగా వుండాలని యెంతటి మగాడైనా, కలలోకూడ వూహించజాలనివె! మల్లులాంటి మగాళ్లు కొందరు ఆమెని శాసించడానికి యత్నించి, నల్లులైన సంగతి ఆ చుట్టుపక్కల అందరికీ తెలిసిందే.

ఉమ్మడిహక్కుగా అనుభవించాల్సిన గోభూమిని తానొక్కడే వుపయోగించుకోడం యెవడితరం? అల్లాగే ఆమెకి తానొక్కడే అధికారిగావడం యెవనిసాధ్యం?

కాని, యేటి కెదురీదేవాళ్ళు యెప్పుడూ వుంటారు. ఈ తరహాకి చెందినవాడే ఆ వూరి గొఱ్ఱెలకాపరి 'బూరి.' అతగాడు తన ప్రత్యేకత చూపదలచిన వైనం యిదీ.

బూరి యెప్పుడూ పొలాలమీదే గొఱ్ఱెల్ని కాస్తూ, గుడారంలో నిద్రిస్తూ, యెండుచితుకుల నిప్పుమీద కాల్చిన తాజారొట్టెలు తింటూ కాలక్షేపం చేస్తుంటాడు. వులియబెట్టని గోధుమపిండిని యే రాతిమీదో మర్దించి, యెక్కడుంటే అక్కడ నాలుగు యెండుమోడులు మంటబెట్టి, పల్చనిరొట్టెలు కాల్చుకుని, వుల్లగడ్డకూర, పాలు, గట్టిజున్ను, రేగుపండ్లు

వగైరా ఆధరువులతో భోంచేస్తాడు. తానే స్వయంగా బట్టీ పట్టిన నాటుసారాయం కూడా రోజూ ఒక్క చిన్నలోటాడు పుచ్చుకుంటాడు. ఇదీ అతగాడి దినచర్య. వాణ్ణిగూర్చి యెన్నో భయంకరమైన అపవాదులున్నాయి. గాని, పాపం, నిజానికి వాడికి ప్రేమంటే యేమీ తెలియదనే చెప్పాలి. బూ్రి సన్నగా శలాకల్లావున్నా మంచి కండపుష్టివున్నవాడు; అతడిచేతుల్లో యెప్పుడూ వుండే యినపకోలను ప్రయోగించడంలో అతడు సవ్యసాచి. అంచేత యెవడూ వాణ్ణి యెదటబడి యేమీ అనరు. అదీగాక వాడితోటి నీడల్లా తోడేళ్ళలాంటి కుక్కలు మూడు యెప్పుడూ వుంటూంటాయి. బూ్రి మాటతప్ప వాటికి మరో లెక్క లేనేలేదు. అతనిజోలి కెవరూ పోకుండేందుకు మూడో కారణం, దృష్టిభయం. బూ్రిదగ్గర మంత్రతంత్రాలున్నాయనీ, అతనిదృష్టి సోకితే పంటలు మాడిపోడం, గొర్రెలకు తెగుళ్ళు తగులడం, ఆవులకి దొమ్మసోకడం, యీనడంలో పశువులు చావడం, గడ్డివాములూ కుప్పలూ తగులడిపోవడం తప్పదని ప్రతీతి వుంది.

కాని, 'నల్లదాక్ష' కోసం ఆశించనివాడు ఆచుట్టుప్రక్కల కంతకీ, 'బూ్రి' ఒక్కడే. అందుచేత సహజంగానే ఆమె వాణ్ణి గూర్చి ఆలోచించేది. చివరికి ఓ రోజున తాను వాడి పాపిష్ఠి దృష్టికి భయపడనని వెల్లడించి, బూ్రిదగ్గరికి వెళ్ళిపోయింది.

బూ్రి ఆమెని చూస్తూనే అడిగేడు :

"నీకేం గావాలి ?"

ఆమె ధైర్యంగా జవాబిచ్చింది:

'ఏం కావాలా! నువ్వు కావాలి!'

'సరే, అయితే ఒక్కటే షరతు. నువ్వు నా ఒక్కడి దానవే గావాలిసుమా.' అన్నాడు బూరి.

'ఓ! తప్పకండా. నన్ను తృప్తిపరచగలిగితే సరి, నీ ఒక్కడిదాన్నే.' అని నల్లద్రాక్ష జవాబిచ్చింది.

బూరి చిరునవ్వుతూ ఆమెని కౌగిట్లోకి దీసుకున్నాడు. పూర్తిగా వారంరోజులు ఆమె వూళ్లోకి వెళ్ళనేలేదు. ఆమె నిజంగానే బూరియొక్క స్వంతంగా వుండిపోయింది.

గ్రామం అశేషం అట్టుడికినట్టు వుడికిపోయింది. ఇంత వరకూ యెవరికీ మరొకరిమీద అసూయ కలగలేదు. కాని అందరికీ బూరిమీద అసూయ కలిగింది. ఏమిటి? నల్లద్రాక్ష, వాణ్ణి లొంగదీయలేదూ? ఊహకందినంతవరకు అన్నిటిమీదా వాడికి మంత్రాలున్నాయనండి. కాని...ఐతే?...అందరికీ వాడిమీద కోపం వచ్చింది. మండిపోతున్నారంతా. ధైర్యం కూడ దీసుకొని, పదిమందీ పోగై, వెళ్ళి చెట్లచాటునుంచి బూరిను పరికించి చూసేరు. నల్లద్రాక్ష మామూలుగా హుషారుగానేవుంది. కాని, పాపం! వాడు మాత్రం హఠాత్తుగా జబ్బుపడినట్లూ, ఆమె వుపచారాలు అవసరమైనట్లూ కనిపిం

చేడు. ఏదేమైనా గ్రామస్థులకి మాత్రం, పాపమా గొర్రెల కాపరిమీద జాలి కలగ లేదు. వాళ్ళలో సాహసు డొకడు తుపాకీ పట్టుకొని బూరి గుడారంవైపు నడిచేడు.

దూరాన్నుంచే గ్రామస్థు డరిచేడు:

'బూరి! కుక్కల్ని కట్టేసుకో! లేకపోతే కాలుస్తాను సుమా!'

నల్లద్రాక్ష జవాబిచ్చింది:

'నువ్వు కుక్కలికి భయపడనక్కర్లేదు. అవి నిన్నేమీ చేయవు. నేను చెప్తున్నా!' అంటూ ఆ యువకుణ్ణి చూసి చిరునవ్వింది. తుపాకి భద్రంగా పట్టుకుని వాడు గుడారాన్ని సమీపించేడు.

'నీకేం గావాలి?' అనడిగేడు బూరి.

నల్లద్రాక్ష జవాబిచ్చింది:

'నేను చెప్తా. అతడికి కావల్సింది నేను! నాకూ సమ్మతే, అదీ సంగతి!'

బూరి కోపంతో అరుస్తుంటే, నల్లద్రాక్ష అంది:

'నీవో పనికిమాలినవాడివి!'

ఆమె లేచివెళ్ళి, ఆ యువకునితో బయలుదేరింది. బూరి తన చేతికోల నెత్తేడు. ఆ యువకుడు తుపాకీ యెత్తేడు.

'వాణ్ణి పట్టుకోండి! యిస్కో! యిస్కో!' అని అరుస్తూ, బూచి కుక్కల్ని వుసుకొల్పేడు. కుక్కలు మీదకి వస్తే కాల్చటానికి తుపాకి గురిపెట్టాడా యువకుడు. కాని, ఆమె తుపాకిని క్రిందికి విసిరేస్తూ అరిచింది.

'దూ! దూ! జాకీ! రాండి! నా అందాలరాసులు!'

అంతే! కుక్కలు మూడూ ఆమెవైపు తోకలాడిస్తూ పరుగెత్తేయి. ఆమెచేతులు నాకుతూ, చెలగాటాలాడుతూ, కుక్కలామెను వెంబడిస్తుంటే, నల్లద్రాక్ష బూచి నుద్దేశించి కేకేసింది:

'చూడు, బూచి! కుక్కలికి అసూయ యెంతమాత్రం లేదు!'

ఒక్కమాటాగి, కుచ్చితమైన నవ్వుతో,—

'అవి యిప్పుడు నావి!' అందామె.



# బదలా

"ఎవరూ? మదాం బోందిరోయే?"

"ఔనురా! మదాం బోందిరోయే!"

"అసంభవం!"

"ము మ్మాటికీ ఆవిడేనని చెపుతూన్నానుగా!"

"ఆవిడేమిటాౄ? వయసు మళ్ళిపోయి యెంతో మర్యాదగా కాలక్షేపం చేస్తూన్న మదాం బోందిరోయ్! భక్తురాలు! యెంతో నియమవంతురాలుగా వుంటున్న ఆవిడేనా?"

"ఔనోయ్! బాబూ! ఎన్నిసార్లు చెప్పను!"

"కృత్రిమమైన గిరజాలు కట్టించుకుంటుంది గదూ? వాసిన చుట్టినట్లు తలకట్టు అంటించుకున్న ఆవిడే!"

"ఆహా! ఆవిడేరా!"

"అబ్బెబ్బే! నీకు పిచ్చెత్తివుండాలిరా, బాబూ!"

"ఒట్టు! ముమ్మాటికీ మదాం బోందిరోయేనని ఒట్టు పెట్టి చెప్పగలనురా!"

"ఐతే, ఆ కథంతా వివరంగా చెప్పు, వింటా!"

"దానికేం గాని యింకెక్కడా అనబోకుసుమా! మాన్సూర్ బోందిరోయ్ లాయరు. ఆయన జీవితకాలంలో గుమాస్తాల్ని యీ మెగారు తన ప్రత్యేకసేవలో వినియోగించుకొనేదని అందరూ అనుకొనేవారు. మర్యాదస్తులైన పెద్దయిళ్ళ

స్త్రీలలో ఒక తరహా వాళ్ళుంటారు. పైకి శ్రీరంగనీతులూ, చాటున దురలవాట్లూ వుంటాయి, వీళ్ళకి. మదాం బోంది రోయ్‌కి నదరుగా కనిపించే కురాళ్ళంటే మహామోజు. అదీ గాక, యిందులో వింతేముందిరా? ఇల్లాంటివి సహజమే! అందమైన ఆడపిల్లలంటే మగాళ్ళు పడి చావడం లేదుటోయ్!"

"వృద్ధురాలైన బోందిరోయ్ చనిపోయేక యీవిడ అతి ప్రశాంతంగా, యెవరికీ వ్రేలెత్తిచూప వీలు లేకండా జీవితం గడుపుతుండేది, మంచి స్థిరవసతిగల స్త్రీలందరికిమల్లేనే. అతిభక్తితో చెర్చికి వెడుతుండేది. ఎప్పుడూ ఎవరిమీదో ఒకరిమీద నిందలు మాట్లాడుతూ, తన్నుగూర్చి యితరులు చెడుగా మాట్లాడ్డానికి అవకాశం యివ్వకండా మసలుకునేదావిడ. వయస్సు పైబడుతూన్నకొద్దీ యెండుకట్టెలాగైపోతూ, ఆవిడ మొగం తుమతుమలాడుతూ వుంటూంది. ఆ స్థితిలో ఆమెని నువ్వూ చూస్తూనే వున్నావు. సరే, యీ పరిస్థితుల్లోనే నువ్వు నమ్మడానికి నిరాకరించే యీ అద్భుతకృత్యం జరిగింది. గత శుక్రవారమే."

"మన స్నేహితుడు, జీన్-డీ-ఆంగిల్ మారే ఆశ్వికదళంలో కెప్టెన్‌గా వున్నాడని తెలుసుగదూ. అతనిదళం డీ-లా-రివెట్టీ వీధిలోని బారకీచుల్లోనే మకాం విడిసింది. ఆరోజు వుదయమే అతను బారకీచులకు వెళ్ళినపుడు యిద్దరు ఆశ్వికులు భీకరంగా పోట్లాడుకున్నారని తెలిసిందట. బాహాబాహీ ద్వంద్వయుద్ధం గావించుకున్నాక వాళ్ళిద్దరికీ రాజీ కుదిరిందిట. కెప్టెన్ పిలిపించి అడగ్గానే తమ కలహకారణాన్ని వాళ్ళు

సాకల్యంగా చెప్పేరు. మదాం బోండిరోయ్ మూలాన్నే వాళ్ళకి తగవు వచ్చిందట !"

'ఓ ! అల్లాగా !' అన్నాడు రెండోవాడు.

'ఔనురా ! అబ్బిగా ! ఆవిడే వాళ్ళ పోట్లాటకి కారణం. మధ్య నామాటలెందుకు గాని ఆశ్వికుడు శిబల్లీకథనాన్నే యథాతథంగా చెపుతా విను.'

"ఆశ్వికుడు శిబల్లీ చెప్పినది యిది. 'కెప్టెన్ ! ఒకటిన్నర యేడాదికిందటి మాట. శారంకీచులముందర సాయంత్రం ఆరు-ఏడు గంటలమధ్య వూరికేనే పచారుచేస్తున్నా. ఆ సమయంలో యెవరో స్త్రీ వచ్చి యాదాలాపంగా దారి అడుగుతూన్నట్లే అన్నది : 'సోల్జర్ ! వారానికి యింకో పది ఫ్రాంకులు మర్యాదగా సంపాదించాలని వుందా ?' 'ఆహా ! సంపాదించాలనే వుం' దని ఆమెకి జవాబిచ్చేను. తిరిగి అన్న దావిడ : 'రేపు వుదయం పన్నెండింటికి వచ్చి నన్ను కలుసుకో. నాపేరు మదాం బోందిరోయ్. నెంబరు పన్నెండు, డీ-లా-ట్రాంచీ వీధి-నా చిరునామా.'

'నేను తప్పకండా వస్తానండమ్మా ! నమ్మకంగా వుండచ్చు మీారు.' అన్నాను నేను. ఆమె వెళ్ళిపోయేటప్పుడు యెంతో సంతోషంగానూ, వుత్సాహంగానూ కనబడింది. అప్పుడన్నది గదా 'సోల్జర్ ! నేను నీకెంతో కృతజ్ఞురాల్ని.'

'నేనూ తమ కెంతో కృతజ్ఞుణ్ణి !' అని అన్నానే గాని ఆవిడ దేన్ని గురించి వచ్చిందా ? అన్న ఆలోచనే నన్ను బాధించ

నారంభించింది. మరునాటివరకూ యీ ఆలోచనలోనే నా బుర్రంతా వేడెక్కిపోయింది.'

'పన్నెండింటికి సగ్గా వెళ్ళి, బైటి గంట మ్రోగించగానే ఆవిడ స్వయంగా తలుపుతీసింది. ఆ సమయంలో అలంకరించుకొని, తలనిండా రిబ్బనులతో వుందావిడ.'

'మనం త్వరపడాలి. లేదా నా నౌకరు వచ్చేస్తా' డన్నదామెగారు. 'నే నేం చేయాలమ్మా?' అన్నా నేను.

'ఆమె నవ్వింది. 'నీకు అర్థం కాలేదూ? మూర్ఖాగ్రేసరుడిలా వున్నావే!' అంది.'

'నా కామె అభిప్రాయం అప్పటికీ బోధపడనే లేదు. కెప్టెన్! ఒట్టుపెట్టి చెపుతున్నా. ఆవిడ వచ్చి నాప్రక్కనే కూర్చుని అన్నదిగదా: 'యీ సంగతి యెవరితోనైనా చెప్పావంటే జైల్లో పారేయిస్తా. తెలిసిందా? ఎవరితోనూ చెప్పనని, పెదవి మెదల్చనని ఒట్టుపెట్టుకో!'

'ఆమె చెప్పిన ఒట్లన్నీ పెట్టుకున్నా. ఆమె భావం అప్పటికీ నాకేమీ అర్థంగాకపోతే ఇంకేం చెయ్యమంటారు? మొహంమీది చెమట తుడుచుకునేందుకు శిరస్త్రాణం క్రింది నేరుమాలు తీసేను. రుమాలు ఆవిడే అందుకుని, నా మొగం తుడిచి ముద్దుపెట్టుకుంటూ రహస్యంగా 'ఐతే నే చెప్పింది చేస్తావుగదూ?' అంది.'

'మడాం! మీరు చెప్పిందేదైనా చేస్తాను. అందుకే గాదూ నేను వస్తి!' అన్నాను.

'అప్పుడామె తన చేష్టలద్వారా తన భావాన్ని స్పష్ట పరచింది. అదేమిటో గ్రహించేక నేనూ శిరస్త్రాణం తీసి ప్రక్కన బెట్టి, ఆశ్వికదళంలో చేతగాని దద్దయ్య యెవడూ వుండడని ఋజువుచేసి చూపించేను, కెప్టెన్ !'

'నాకు దాని మీద యేమంత ఆసక్తి లేదనుకోండి. ఆవి డేమేనా పడుచుపిల్లా యేమేనానా ? కాని, అటువంటి సంద ర్భాల్లో పూరిఖే శషభిషలుపోయి ప్రయోజన మేముందండీ ? అందులోనూ డబ్బంటే కంటబడుతూందిటండీ ? అదీగాక నేను సాయం చేయాల్సిన బంధువులు బోలెడుమం దున్నారు. 'దీంట్లోంచి మా నాయనకు అయిదుఫ్రాంకులు పంపుతా' నను కున్నాను కూడాను.'

'కెప్టెన్ ! నాపని పూర్తిగావించి, వెళ్లిపోడానికి సిద్ధమైనా. ఆవిడ నన్ను వదలకండా, యింకాస్సేపు వుండ మంది. అప్పుడు నే నన్నాను :

'మదాం ! ఎవరి కెంత ముట్టాలో అంతా ముట్టవల సిందే ! గ్లాసు పానీయం రెండు సౌలు ఐతే రెండుగ్లాసుల ఖరీదు నాలుగు సౌలు అవుతుంది.'

'ఆమె నా భావాన్ని గ్రహించి, పదిఫ్రాంకుల బంగారు నాణెం తీసి, నాచేత వుంచింది. నా కల్లాంటి చిన్న నాణేలంటే యిష్టంగాదు. జేబులు సరిగా లేకున్నా, కుట్లు విడిపోయివున్నా దాన్ని మన బూట్లలోనో, లేకుంటే రోడ్డుమీదనో చూడాల్సి వస్తుంది ! నాణేన్ని చేతిలోనే పరకాయించి చూస్తూంటే ఆవిడ

నన్ను గమనిస్తూంది. నా చూపుల్ని అపార్థంచేసుకుని, ఆవిడ మొహం యెర్రబడింది. 'ఇది చాలదనా ?' అనడిగేసింది'.

'నా వుద్దేశ మదిగాదు మడాం ! ఏదైనా మీ కొకవేళ గనక రెండు ఐదుషావింకులనాణేలు యిస్తే సంతోషం' అన్నాను. సరే. ఆవిడ అవే యిచ్చింది. నేను సెలవుతీసికొని వచ్చేసేను.'

'క్రెప్టెర్! ఈ రీతిగా యేణ్ణార్థంనుంచీ జరిగిపోతూంది బార కీచులనుంచి బైటికెళ్ళడానికి మీరనుమతి నిచ్చేక ప్రతి మంగళ వారం సాయంత్రం నేనక్కడికి వెడుతూంటూ. ఆవిడకూ అదే యిష్టం. నౌకర్లంతా అప్పటికి నిద్రబోతారు. కాని, గత వారం నాకు సుస్తీచేసి, ఆస్పత్రికి పోవాల్సివచ్చింది. మంగళ వారం రానేవచ్చింది. నాకేమో వెళ్ళేందుకు అవకాశం లేదాయె పదిషావింకులు పోతున్నాయని నాకు యెంతో చిరాకుగా వుంది వారానికి పదిషావింకులంటే మాటలా? అదీగాక నా మనస్సు పరిపరివిధాలా పోయింది"

'ఎవడో మరోడు వెళ్ళేడంటే నా పని అయిందన్న మాటే. ఫిరంగిదళంలో వాణ్ణెవణ్ణైనా తీసికెళ్ళిందంటే నా గతేం కావాలి!' అని తలచుకుంటూంటే నాకెంతో కోపం వచ్చింది. వెంటనే పామెర్లీకి కబురంపేను. వాడూ మా ప్రాంతంవాడే లెండి. వాడితో పరిస్థితంతా చెప్పి, —

'నువ్వో ఐదూ, నేనో ఐదూ తీసుకుందాం. ఏంరా ?' అనడిగేను. వాడూ 'సరే' నన్నాడు. వాడికి కార్యక్రమమంతా

పూర్తిగా బోధించేను. వెళ్లేను. తలుపు తట్టగానే మామూలు గానే తెరిచి, లోపలికి రమ్మందిట. వాడి మొహం చూడక నేనే అనుకుంది! తమకూ తెలుసు గదండీ, శిరస్త్రాణం ధరించి నప్పుడు సోల్జర్లంతా ఓ మాదిరిగానే వుంటారని.'

'టోపీ తీసినపుడు పోలిక తెలియగానే ఆమె కోపంగా 'ఎవరు నువ్వు? ఎందుకు వచ్చేవు? నేను నిన్నెరగ' ననేసిందట.'

'పామెల్లీ కథంతా సవిస్తరంగా చెప్పేడట. నే నాసు పత్రిలో వున్న సంగతీ, మారుగా తన్ను పంపేననీ వగైరా అంతా. వాణ్ణి పరకాయించి చూసి, అంతా రహస్యంగా వుంచుతానని వాడిచేతి ఒట్టు పెట్టించి, అప్పుడు వాణ్ణి అంగీక రించింది వాణ్ణీ యెరుగుదురుగా! వాడుకూడ బాగానేవుంటాడు లెండి! సరే. కాని వాడు తిరిగి వచ్చేక నాఅయిదు ఫ్రాంకులూ యివ్వలేదు. అవి నాకోసమే అయితే పోనీ లేని వూరుకుందు ననుకోండి. కాని అవి మా నాయనకి గాదండీ? ఆముసలాడి విషయంలో యిల్లాంటి వెధవవేషాలు సహించనుగాక సహిం చను!' నాకు కోపంవచ్చి,—

'ఒరేయ్! ఆశ్విక పటాలంలో వాడికి తగినపని గాదురా, నువ్వు చేసింది! నీలాంటి మాట దబ్బరగాళ్ళుంటే పటాలానికి అపకీర్తి కూడాను!' అనేశాను.

'కెప్టెన్ సాబ్! అంతే. ఆమట్టున వాడు పిసికిలి యెత్తేడు, నామీదికి. చెమటలు కక్కించే యిల్లాంటి శ్రమకి రెట్టింపు యిచ్చినా చాలదన్నాడు. దానికేం! ఎవడి అభిప్రాయం వాడి

దనుకోండి! అయితే ముందుగా తానెందుకు అంగీకరించా లంటా? ఆతర్వాతిదంతా మీరెరిగిన దేనండి, అయ్యా!'

'ఈకథంతా నాతో చెప్తుహూ కేప్టెన్ ఆంగిల్‌మేరి, విరగ బడి ఒకటేనవ్వు? అతని కళ్ళమ్మట నీళ్ళుకూడా వచ్చేయి నవ్వుకి. తానిదంతా రహస్యంగా వుంచుతానని ముందు వాగ్దానం చేసేకనే వాళ్ళు కథంతా చెప్పేరంటూ, నాచేత కూడా అల్లాగే ఒట్టేయించేడోయ్. అంచేత, అన్నిటికంటె ముఖ్యం నువ్వీసంగతి యెవరితోనూ చెప్పవని ఒట్టువెయ్యాలి!'

'ఓ! తప్పకండాను. ఆ విషయంలో నువ్వు నిశ్చింతగా వుండచ్చునోయ్...కాని, వాళ్ళిద్దరి పేచీ చివరికి యెల్లా పరిష్కారమైందంటా?'

'అదే పరమాద్భుతమనుకోరా! మదాం బోందిరోయ్ యీపేచీ యిట్టే పరిష్కరించేసిందోయ్! ఇద్దర్నీ పనిలో పెట్టుకుని, చెరోరోజూ కేటాయించింది. బస్! అంతే. అందరికి సంతృప్తికరంగా ఫైసలయింది!"

"ఓహోహో! ఏమి బాగుందోయ్! అత్యద్భుతమనుకో. ఏమివుపాయంరా? వహ్వా!"

'సోల్జర్ శిబర్లీ ముసలి తలిదండ్రులకి నెలకైదు ఫ్రాంకులూ మామూలుగా పంపుతూన్నాడు. ధర్మదేవతకీ ఆనీతిగా నోరుకట్టుబడింది!'



# క్లో ఛెట్టీ

మనల్ని పట్టివిడవకుండావుండే పాతకాలపు జ్ఞాపకాలు కొన్ని యెంత వింతగా వుంటాయి!

ఇప్పుడు నే చెప్పబోయేకథ వుందిచూసేరూ, చాలా కాలం క్రిందటిది. ఆ సంఘటన నామనస్సుమీద గాఢంగా, విస్ఫుటంగా ముద్రితమై వుండిపోయిందంటే ఆశ్చర్యంలేదు. ఆ తర్వాత యెన్నో విషాదకరదృశ్యాల్ని చూసేను; అవెంత భయంకరమైనవైనా, యెంత తీవ్రప్రభావం గలవైనా నా మనో నేత్రం ముందునుంచి క్లోఛెట్టీ (మాధవి) అవ్వముఖం యెప్పుడూ మరిచిపోయి వుండలేదు! చాలకాలంక్రితం, నేను పదిపన్నెం డేళ్ళ వాడినైవున్నపుడు చూచినట్లే ఆమెముఖం నామనోఫలకం మీద స్థిరంగా వుండిపోయింది.

ఆమెవృత్తి, దర్జీపని. మాయింటికి వారానికోసారి, ప్రతి లక్ష్మీవారం వస్తూండేది, బట్టలు కుట్టేందుకు. ప్రశాంతమైన ఆపల్లెటిబంగాళాలో మాతలిదండ్రులతో నివసిస్తూండేవాళ్ళం. పురాతన భూస్వామ్యకుటుంబాల్లో మాదీ ఒకటి. కూచిగావుండే పైకప్పులుగల యీ భవంతుల్నే 'ఛాటూ' లంటాములే. ప్రతి ఛాటూయొక్క అధికారంక్రిందా ఆచుట్టుపక్కల భూములన్నీ వుంటుంటాయి.

ఆ వూరు కాస్తంత పెద్దదనే చెప్పాలి. అక్కడ సంత కూడా జరుగుతూంటుంది. ఊరే అన్నమాటేమిటి? చిన్నపట్నమని చెప్పచ్చుదాన్ని. దానికీ మా భవంతికీ కొద్దివందల గజాల దూరంమాత్రమే. ఊరిమధ్య నొక చెర్చివుండేది. అసలు ఆ చెర్చి యెర్రియిటకలతోనే కట్టేరు. గాని, కాలక్రమేణా పాకుడుపట్టి, చెర్చి నల్లగానే కనిపిస్తూండేది.

సరే. కథకి వద్దాం—క్లోఛెట్టీ ప్రతి లక్ష్మివారం వుదయం ఆరేడు గంటలమధ్య మాయింటికి వస్తుండేది. సరాసరి బట్టల గదిలోకివెళ్ళి, పనిలో కూర్చునేది. ఆవిడ సన్నగా పొడుగ్గా వుండేది. మీసాలు, గడ్డాలుకూడా వుండేవి! పెద్దగండుముఖం నిండా దుబ్బుదుబ్బులుగావుండే వెంట్రుకలు చూస్తే ఆశ్చర్యంగా వుండేది— ఇంతెందుకు? రవికతొడుక్కున్న సిపాయిలాగే వుండేదంటేచాలు! ముక్కుమీదా, ముక్కుక్రిందా, చుట్టూనూ, గడ్డంక్రిందా, చెంపలమీదా వుండేవి యీ దుబ్బులు; ఆ గండు ముఖంమీద యెవడో పిచ్చివాడు అంటించినట్లుండేవి! ఆవిడ కనుబొమలు! మరీపొడుగ్గా, దట్టంగా, తెల్లటిదుబ్బులుగా, కొట్టవచ్చేటట్లు మీసాల్లావున్న కనుబొమలు, పొరబాటున అక్కడ అతికినట్లుండేవి.

ఆమె కుంటుతూ నడిచేది. కాని, అందరికుంటివాళ్ళకి మల్లెగాక విలక్షణంగా వుండేది, ఆకుంటికూడా. సముద్రపు కెరటాలమీద తేలియాడే ఓడలా వుండేదావిడ నడుస్తూంటే! గట్టి కాలుమీద తన పెద్దకళేబరాన్ని ఆన్చినతర్వాత ఓ పెద్దకెరటం

మీాదికి లేచే ఓడలాగ ప్రయత్నపూర్వకంగా పైకిలేచి, మళ్ళీ అడుగులో అగాధంలోకి పడిపోతూన్నట్లు, నేలలోకి కుంగిపో తూన్నట్లు కనిపించేది. ఆవిడ నడకచూస్తే తుపానులో ఓడ జ్ఞాపకం వస్తుంది. పుష్కలంగా రిబ్బనులుగుచ్చిన పెద్ద తెల్లటోపీధరించిన ఆమెతల, కుంటుకుంటుకీ వుత్తరదక్షిణాలకీ, దక్షిణవుత్తరాలకీ దిక్చక్రాన్నంతనూ తిరిగివస్తూన్నట్లుండేది. తెల్లటోపీమీాదిరంగు రిబ్బనులు ఓడజెండా యెగరడాన్ని జ్ఞాపకంచేస్తాయి !

నాకు క్లోషెట్టి అవ్వంటే చాలయిష్టంగా వుండేది. ఉదయాన్ని లేచీలేవడంతోనే బట్టలగదిలోకి వెడితే, కుట్టు పనిలో నిమగ్నమై కనబడేది. ఆ పెద్దగదిలో, యింటికప్పుక్రింద సరంబీ లేకపోవడంవల్ల చాలాచలిగా వుండేదేమో, అవ్వ వెచ్చదనంకోసం కాళ్ళకింద 'వెట్టపెట్టి' పెట్టుకుని పనిచేస్తుం డేది. నేనూవెళ్ళగానే వెట్టపెట్టిమీాద నన్ను కూర్చుండబెట్టేది, నాకు శీతలం తాకకుండా.

"అదుండే, నీతలలోంచి రక్తాన్ని లాక్కుంటుంది" అని విపులీకరించే దావిడ.

పొడుగాటి వంపుల్రేళ్ళతో అతిలాఘవంగా బట్టలు మరమ్మతు చేస్తూనే, ఆమె నాకెన్నో సంగతులు చెపుతూుం డేది. చత్వారపు జోడులోంచి ఆవిడకళ్ళు పెద్దవిగా, గంభీరంగా జంటలుగా గానవచ్చేవి.

ఆవిడచెప్పిన సంగతుల్లో నాకు జ్ఞాపకం వున్నవాటిని బట్టిన్నీ, నా లేతమనస్సును బాగా కదిలించిన వాటినిబట్టిన్నీ

క్లోచెట్టీ విశాలహృదయంగల దనుకుంటాను. గ్రామంలో జరిగే సంఘటనల నెన్నింటినో ఆవిడ చెపుతూండేది; గోశాల లోంచి తప్పించుకుపోయిన ఆవు, మరునాడుదయం ప్రోస్పర్ మారెబ్ మిల్లుదగ్గర తిరుగుతూన్న గాలిమర తెరచాపల్ని నిల్చునిచూస్తూ కనబడిందనీ; యేది యెల్లావెళ్ళి అక్కడ పెట్టిందో యెవరికీ తెలియదట గాని చెర్చి గంటస్తంభంమీద ఓ కోడిగుడ్డు కనబడిందన్న గాథనీ; బికారియెవడో యెత్తుకు పోయిన యజమాని లాగును జీన్ పీలా కుక్క పదికోసులు వెళ్ళి యెల్లా తెచ్చిందో, జీన్ పీలా వర్షంలో తడిసిపోయి లాగు బైట ఆరవేసినప్పుడు జరిగిందిది,– యిల్లాంటి చిన్న చిన్న సంఘటనల్నే క్లోఛెట్టీ అవ్వ విచిత్రంగా, వుదాత్త కావ్యాల్లాగ, మరపురాని మహాద్భుత నాటకాల్లాగ, చెప్పేది. మహాకవులు రాసిన కథలు మా అమ్మ రాత్రిళ్ళు చెపుతూండేది గాని వాటిల్లో యీ కాపువనిత చెప్పే కథల్లోవుండే ఆకర్షణ, రసం, సంపూర్ణత వుండేవే గావు.

సరే. ఆ లక్ష్మీవారం వుదయమంతా క్లోఛెట్టీ అవ్వ చెప్పేకథలు కబుర్లు వింటూనేవున్నా. మళ్ళా మధ్యాహ్నం కూడా మేడమీదికి ఆమెదగ్గరికి వెళ్ళా లనుకున్నాను. ఈ లోగా మాపొలం వెనకేవున్న అడివిలోకి నౌకరుతో వెళ్ళి బాదంకాయలు యేరుకొచ్చేను. ఇదంతా నిన్ననే జరిగినంత స్పష్టంగా నాకుజ్ఞాపకం వుందనుకో.

నేనూ వెళ్ళి బట్టలగది తలుపు తెరిచేను. ఆ వృద్ధురాలు తనకుర్చీప్రక్కనే పడిపోయి, బార్లాచాచిన ఓ చేతిలో సూదీ దారం, రెండో చేత నా చొక్కా పట్టుకునివుంది! నీలిమేజోడు తొడిగిన ఆమెకాలొకటి,— బహుశా అదే ఆ విడ పొడుగు కాలుఐవుంటుంది,— కుర్చీక్రిందికి జాచివుంది, కళ్ళజోడు తూలి దూరంగాపడి, గోడదరినే మెరుస్తూంది.

నాకు భయమేసింది. వెర్రికేక వేస్తూ పరుగెత్తుకు పోయేను. అంతా పరుగెత్తుకు వచ్చేరు. కొద్దిసేపట్లో క్లోఛెట్ మామ్మ చనిపోయిందని అందరికీ తెలిసిపోయింది.

నా పసిహృదయాన్ని కలచివేసిన గాఢవిషాదకరభావో ద్రేకాన్ని చెప్పేందుకు మాటల్లేవు— మెల్లిగా క్రింద డ్రాయింగు రూములోకి పరుగెట్టుకుపోయి, ఓ చీకటిమూలలో పురాతనపు వాలుకుర్చీలో దాగి, మోకరించి యేడుస్తూ వుండిపోయేను, చాలసేపు. రాత్రిపడింది. హఠాత్తుగా యెవరో గదిలోకివచ్చేరు, దీపంపట్టుకుని, వాళ్ళు నన్ను చూడనేలేదు కాని, కంఠస్వరాల్ని బట్టి అమ్మా, నాన్నా, డాక్టరూ మాట్లాడుతున్నారని నాకు తెలిసింది.

డాక్టరుకోసం వెంటనే కబురంపించినా ఆలస్యంకావడానికి కారణం యేదో ప్రమాదంవల్లనే అని ఆయన చెపుతూన్నారు. కాని, అదేమిటో నాకు తెలియలేదు. తరువాత ఆయన కూర్చుని, ఓగ్లాసు వైనూ, బిస్కట్లూ పుచ్చుకుంటున్నారు, మాట్లాడుతూ.

అప్పుడాయన చెప్పినమాటలు నా మనస్సులో స్థిరంగా ముద్రితమైపోయేయి. ఆయనచెప్పిన ప్రతిమాటా పాఠం వల్లెవేసినట్లుగా యిప్పుడుకూడ యథాతథంగా చెప్పగలనను కుంటా.

డాక్టరు అన్నమాట లివి: 'అయ్యయ్యో! పాపం! దురదృష్టవంతురాలు. నేను యిక్కడికివచ్చినరోజునే యీమె కాలు విరగ్గొట్టుకుంది. నేను అప్పుడే బండిదిగేను, యింకా చేతులేనా కడుక్కోలేదు. తొందరగా రమ్మని కబురు. చాల ప్రమాదకరమైనస్థితిలోవుంది, రోగి.'

'రోగి మరెవరోకాదు. ఈమే! అప్పటికి పదిహేడే ళ్ళుంటాయి. మంచి స్ఫురద్రూపిగా వుండేది. ఎంత అందకత్తె అనుకున్నారు! ఇదెవరేనా నమ్ముతారా? ఈమె గాథను యింతకుముందు యెప్పుడూ నే నెవరికీ చెప్పలేదు. ఇది నాకూ, మరొక్కరికీ మాత్రమే తెలుసు. అతడిప్పుడు యీ ప్రాంతా ల్లోనే లేడు. పాపం, యీమె చనిపోయింది గనుక యిప్పుడింక దాచవలసిన అగత్యం అంతగా లేదు.'

'ఆ రోజుల్లోనే యీ వూరికి ఓ పడుచుకుర్రాడు బడి పంతులుగా వచ్చేడు. అత డందగాడు; సూపులికి సిపాయిలా వుండేవాడు. ఊళ్లో ఆడపిల్లలంతా యీ కుర్రపంతులు వెనక పడేవాళ్లు. కాని అతడేమో వుదాసీనంగా వుండేవాడు. అంతేగాక పెద్దపంతులు గారిబూ అంటే యితడికి మాచెడ్డ

భయం. ముసలి గ్రాబూ తన పురిచెయ్యి పెట్టని విషయమే యీ వూళ్లో వుండేదిగాదు.

"ముసలిపంతులు గ్రాబూ అప్పటికే చక్కనిచుక్క హోర్టెన్స్‌ని తనయింట పనికత్తెగా కుదుర్చుకున్నాడు. ఆమే యీమె! ఆ తరువాతే యీమెకు 'క్లోఛెట్టే' అని పేరెట్టేరు. పడుచుపంతులు తన్ను మెచ్చుకో నారంభించేసరికి యీమె కూడా పొంగిపోయింది. అదిసహజమే, మరి. అందర్నీ తృణీకరించిన అందగాడు వలచేడంటే యే యువతివాళ్లు ఉప్పొంగదు? ఏమైతేనేం యీమే అతన్ని ప్రేమించ నారంభించింది. ఒక రోజున తన పనులు తీర్చుకుని, రాత్రిపడ్డాక, బడివెనక గడ్డి దాచుకునే అటకమీద తన్ను కలుసుకునేందు కామెను అతడు యెట్టకేలకు ఒప్పించేడు.'

'ఈమే యింటికి వెళ్ళిపోతున్నట్టు నటించి, మేడక్రిందికి దిగడానికి మారుగా పైకి మిద్దెమీదికి వెళ్ళి, గడ్డిలో దాగొంది, తన ప్రేమికునికోసం. అతగాడూ త్వరలోనే యీమెని కలుసుకున్నాడు. ప్రియురాలితో రుచికరమైన మాటలు చెప్పేందుకాతడు ఉపక్రమిస్తుంటే, అటకతలుపు తెరుచుకుంది. ముసలిపంతులు గుమ్మంలో ప్రత్యక్షమై, 'ఏం చేస్తున్నావు యిక్కడ, సిగిస్బర్ట్? ' అండిగేడు. పట్టుబడతానే భయంతో యింగితజ్ఞానం కోల్పోయిన కుర్రపంతులు మూర్ఖునివలె 'మాస్టారూ! గడ్డిమీద కాస్సేపు విశ్రమించుదమని వచ్చేనండీ!' అన్నాడు.'

'అటక చాలపెద్దది; చీకటిగావుంది. భయకంపితురాలైన తనప్రియురాలి నాతడు ఆవలగా త్రోస్తూ 'వెళ్ళు! దాంకో! నాపని పోతుంది—వెళ్ళిపోవే. దాంకో!' అన్నాడు.'

'పెద్దపంతులు యీ గుసగుసలు పసికట్టేడు. అతడూ అనేక చాతుర్యాస్యలైనవాడేనాయె! ఊరుకోకండా 'ఇంకేం? అక్కడ నువ్వు ఒంటరిగా లేవే?' అన్నాడు.'

'అబ్బే! నేనొక్కణ్ణేనండీ!' అన్నాడు, చిన్నపంతులు.

'కాదు. నువ్వెరితోనో మాట్లాడుతున్నావే?'

'ఒట్టండీ! ఒక్కణ్ణే మాస్టారూ!'

'చూస్తాంగదూ!' అంటూ ఆముసలాడు తలుపుమూసి తాళంపెట్టి, లాంతరుకోసం క్రిందికి వెళ్ళేడు.

'దాంకో యీ పడుచువాడి బుర్ర చెడిపోయింది. అసలు వీడో పరమపిరికిచవట! హఠాత్తుగా చేతగానికోపం తెచ్చుకుని, యీ పిల్లదాన్ని తొందరపెట్టనారంభించేడు; 'దాంకోవే! వాడు చూస్తే నా బ్రతుకు పోతుందే. అయ్యో! నా జీవనాధారం పోతూందే! కనబడకే!'

'బైట తాళంలో చెవి తిరుగుతూన్న ధ్వని మళ్ళా వినిపించింది. హార్టెన్సీగమ్మున వీధివెపునున్న కిటికీదగ్గిరకి పరుగెత్తుతూ, మెల్లగానే కాని దృఢనిశ్చయాత్మక స్వరంతో, 'అతడు వెళ్ళిపోయేక వచ్చి నన్ను లేవదీస్తావుగదూ?' అంటూ, కిటికీ తెరచి, వీధిలోకి దూకేసింది.

'ముసలిగాౖబూ కంట్లో వత్తేసుకుని వెళిపోయేడు. కాని, యెవడూ కనబడలేదు. ఆశ్చర్యపడుతూ ఆశాభంగంతో క్రిందికదిగి వెళ్ళిపోయేను. మరో పావు గంటకి సిగిస్బర్ట్ నాదగ్గిరికి వచ్చి, జరిగినది తా చెప్పేసేడు. నేను వెళ్ళేవరకూ హోర్టెన్సీ పడినచోటనే లేవలేనిస్థితిలో వుంది. వర్షం కుండపోతగా కురుస్తూంది. ఈ దురదృష్టవంతురాల్ని నా యింటికి తీసుకొని వచ్చేను. కుడికాలి యెముకలు మూడుచోట్ల విరిగేయి. ఎముక మాంసాన్ని చీల్చుకుని బైటికి వచ్చేసింది కూడా. ఈమె యెవరిమీదా ఫిర్యాదు చేయనేలేదు. దృఢనిశ్చయంతో, విరక్తితో, 'నాకు తగ్గశిక్ష జరిగింది, మంచిశాస్తి జరిగింది!' అంది, కేవలం.'

'నేనే యితరుల సాయంకోసం కబురంపేను. ఆమె స్నేహితురాండ్రూ వచ్చేరు. మా వీధిలో యేదోబండి ఆమెని పడగొట్టి, మీదినుంచి పోయిందని యేదోకథ కల్పించి చెప్పేను. అంతా నమ్మేరు పోలీసువాళ్ళు ఒకనెల నెలంతా ఆ బండీవాడి కోసం గాలిస్తూనే వున్నారు, వృథాగా.'

'ఇంతే కథ. ఈమె శూరురాలు, ధీర! చరిత్రలో మహాకార్యాలు సాధించిన వాళ్ళలో వుండే గట్టితనమే యీమెలోనూ వుంది.'

'హోర్టెన్సీ ప్రేమకలాపం అంతటితో ఆఖరైపోయింది. చివరకు కన్యగానే మరణించింది. ఈమె త్యాగి, విశాల హృదయ, ఉదారురాలు, మంచి భక్తిశ్రద్ధలు కలదీను. ఈమె

యందు నాకు యెంతో గౌరవం కనకనే యీ కథంతా మీకు చెప్పేను. ఈమె జీవించి వున్నంతకాలం యిదంతా నే నెవరికీ చెప్పని కారణం మీరు గ్రహించేవుంటారు.'

డాక్టరు మాటలు నిలిచేయి. అమ్మ యేడుస్తూంది, నాన్న యేదో చెప్పేడు గాని నాకు తెలియలేదు. తర్వాత వాళ్ళు బైటికివెళ్లేరు. నేనా వాలుకుర్చీలో మోకరించే వెక్కి-వెక్కి యేడ్చేను. వింతధ్వనులు, భారమైన పదవిన్యాసాలు, మేడమెట్ల నేదో రాచుకుంటున్న చప్పుళ్లు వినవచ్చేయి.

'వాళ్ళు క్లోఛెట్టీ శరీరాన్ని మోసుకుపోతున్నారు.'



# రాజకీయం

సెడాన్ దగ్గర యుద్ధంలో తటస్థించిన మహావిపత్తును గూర్చి పారిస్‌నగరానికి అప్పుడే తెలిసింది. రిపబ్లిక్ వెంటనే ప్రకటించబడింది. దేశమంతటా యెక్కడచూచినా ఒకటే పిచ్చి ఆవేశం. ప్రతివాడూ చేతికి దొరికిన ఆయుధాన్ని పట్టుకుని, సిపాయీగా తయారై కూర్చున్నారు.

అదివరదాకా పొది పట్టుకున్నవాళ్ళు, టోపీలుచేసే వాళ్లు హఠాత్తుగా కలనల్సు ఐపోయి, జనరల్సుయొక్క హోదా

చెలాయిస్తూన్నారు. పీపాల్లా గుండ్రింగావున్న బృహత్కా యాలమీద యెర్రనిపట్టీల్లో చుట్టిన బాకులు, రివాల్వర్లు ప్రద ర్శించబడినాయి. సాధారణపౌరులు మహోత్సాహులై, రణగుణ ధ్వనిచేసే వలంటీరుదళాల్ని కమాండు చేస్తూ, తమ ప్రాముఖ్య తనూ, అధికారాన్నీ వెల్లడించుకోడానికి ఆలకాపుల్లాగ బూతులు కూస్తున్నారు.

తమ జీవితాల్లో యింతవరకూ తక్కెడ సిబ్బెలూ, కొల పాత్రలూతప్ప యితరమేమీ యెరిగియుండనివాళ్ళు యిప్పుడు హఠాత్తుగా దళాలుగా యేర్పడి, ఆయుధాలూ తుపాకులూ ధరించడంలో చాల వుద్రిక్తులైపోయేరు. వీళ్ళని తారసిల్లిన వాళ్ళకి యేదో కీడు మూడిందన్నమాటే. కారణమేమీ అక్కర్లే కండానే, చంపడమెల్లాగో తమకూ తెలుసునని ఋజువు చేయ డానికే వీళ్ళు చాలమందిని వురితీయించేరు, అప్పుడే! ఇంకా యిప్పటికీ ప్రష్యన్ల ఆక్రమణకిరిందే వున్న పొలాల్లో పరిభ్ర మిస్తూ, వీళ్ళు అక్కడక్కడ తారసిల్లిన కుక్కల్నీ, ప్రశాంతంగా నెమరువేసుకుంటూన్న ఆవుల్నీ, బీళ్ళలో మేతకువదలిన రోగిష్టి గుర్రాల్నీ కాల్చిపారేస్తున్నారు! యుద్ధకార్యాల్లో తమకూ ఓగొప్పపాత్ర, ప్రధాన బాధ్యతలూ వున్నట్లు, అంతా తమ భుజ స్కంధాలమీదేవున్నట్లు విశ్వసించి వ్యవహరిస్తూన్నారు, ప్రతీ వారూ. చిన్నచిన్నపల్లెల్లోకూడా హోటళ్ళన్నీ యూనిఫారాలు ధరించిన చిల్లరవర్తకులతో నిండివుంటూ, బ్యారకీల్లాగా, యుద్ధరంగంలోని ఆసుపత్రుల్లాగా కనబడుతున్నాయి.

కాని, కన్నెవిల్లీపట్టణంమాత్రం యింకా యీ వుద్రిక్త వార్తల్ని,— సైన్యం ఓడిపోడం, రాజధానిలో రిపబ్లిక్ ప్రకటించబడడం మొదలైన విశేషాల్ని వినలేదు. ఐనా అక్కడా ఒకమాసం పైచిలుకునుంచీ వాతావరణమంతా గ్రామపార్టీల కుస్తీలతో వుద్రిక్తమై, గందరగోళంగానేవుంది. కన్నెవిల్లీ మేయరు వెకౌంట్ డీ వర్ణిటూట్ పిట్టలాంటి సన్ననిచిన్న మనిషి; అప్పటికే వృద్ధాప్యంలో అడుగుపెట్టినవాడు; ఆయన సామ్రాజ్య భక్తుడు. అందులోను ఆ వూళ్ళోడాక్టరూ, జిల్లా రిపబ్లికనుపార్టీ నాయకుడూ, మెసానిక్ లాడ్జిలో గౌరవనీయముఖ్యుడూ, ఫైర్ డిపార్టుమెంటు, అగ్రికల్చరల్ సొసైటీలకు అధ్యక్షుడూ, దేశ రక్షణదళాలకు ఆర్గనైజరూఐన డాక్టరు మస్సారెల్ తనకు ప్రతి ద్వంద్విగా బైలుదేరడంతో పరిస్తుత మేయరు సామ్రాజ్యానికి మరింతభక్తుడుగా స్థిరపడిపోయేడు. మేయరులాగాక డాక్టరు బృహత్కాయుడూ, హడావుడి మనిషీను; స్వభావాల్లోనే యిద్దరూ యిద్దరు.

డాక్టరు రెండువారాల్లోనే అరవైముగ్గురుపౌరుల్ని దేశ రక్షణ కుద్యుక్తుల్నిగా తయారు చేసేడు. వారంతా వివాహితులు, బిడ్డల తండ్రులు, పొదుపరులైన రైతులు, తెలివైన వ్యాపారులూను. వీళ్ళందర్నీ చేర్చి, యీ డాక్టరు ప్రతీవుదయం మేయరు కిటికీకెదురుగా డ్రిల్లు చేయిస్తూన్నాడు కూడాను.

కిటికీదగ్గర మేయరు కనబడితేసరి, డాక్టరుకి శివమెక్కి-పోతుంది. అప్పట్లు డాక్టరునే కమాండరు అని చెప్పాలి, యీ

సందర్భంలో. వంటినిండా పిస్తోళ్ళు అలంకరించుకొని సగర్వంగా తన పటాలంముందు అటునిటు నడుస్తూ, మేయరు కనబడేసరికి 'రిపబ్లిక్ వర్ధిల్లాలి!' 'స్వాతంత్ర్యాన్నికీ జై!' అని గావుకేక లేస్తూ, నినాదా లిప్పించేవాడు. ఈ కేకల్లో మేయరుకి—మరి యీాయన వైకౌంట్ అంటే ప్రభువర్గంలోనివాడు గనుక.—బెదరింపూ, తిరస్కారమూ ద్యోతకమై, మహావిప్లవం నాటి వినాశకరజ్ఞాపకాలు రేగి, బలహీనమైన ఆయన మనస్సులో అశాంతి రేకెత్తేదని వాళ్ళంతా గ్రహించేరు.

సెప్టెంబరు ఆయిదో తారీకు వుదయమే, యూనిఫారంలో వుండే, పిస్తోలు యెదురుగా టేబిలుమీాద వుంచుకుని, డాక్టరు గారు ఒక వృద్ధరైతుమిథునానికి వైద్యసలహా లిస్తున్నారు. వృద్ధ రైతు అప్పటికి యేడేండ్లుగా వుబ్బిన రక్తనాళాలతో బాధపడు తూన్నాడు. కాని వెంటనే తనకూ వైద్యపుఖర్చూ, తర్వాత మళ్లా భార్యకికూడా యీా జబ్బు రావచ్చు గనక ఆమెకి మళ్లా వైద్యపుఖర్చూ, రెండుదండుగ లెందుకని వూరుకున్నాడు. ఇప్పుడు భార్యకికూడా అల్లాంటి బాధ కలిగింది. అంచేత ఆమెను తీసికొని, డాక్టరును వెతుకుతూ వచ్చేడు. అప్పుడప్పుడు తనకి వుత్తరాలూ, పత్రికలూ అందించే తపాలాబంట్రోతు సలహా సంప్రదింపుమీాదనే యీా డాక్టరుగారి పేరు విని, యీాయనగారి కోసం అన్వేషిస్తూ వచ్చేడు.

డాక్టరు మస్సారెల్ తలుపు తెరచి, విస్తుబోయినట్లు ఒక్కక్షణముండి, హఠాత్తుగా శరీరాన్ని నిగిడించి, మహా ఘనంగా ఆకాశంవైపు చేతులు యెత్తి, శక్తికొద్దీ అరచేడు :

'రిపబ్లిక్ వర్ధిల్లాలి! రిపబ్లిక్ వర్ధిల్లాలి!'

ఈ వుద్రేకంతో నీరసం వచ్చి, కుర్చీలో చతికిలబడి పోయేడు, వెంటనే.

అవకాశానికై వేచియున్న వృద్ధరైతు తన రుగ్మతను విపులీకరించనారంభించేడు. కాళ్ళమీంచి క్రిందికీ పైకీ చీమలు ప్రాకుతూన్నట్లుండడంతో తనజబ్బు ప్రారంభమైనదంటూ అతను చెప్ప నారంభించుతూంటే, డాక్టరు భరించలేక బిభీషికగా అరిచేడు: 'ఇక చాల్లే! ఈ మూర్ఖపుమూకతో చాలకాలంబట్టీ విసిగిపోతున్నా!...ఇప్పటికి రిపబ్లిక్ ప్రకటించబడింది! రిపబ్లిక్ చిరంజీవియగుగాక!' అంటూ లోపలివైపుగుమ్మంలోకి పరుగెత్తి గావుకేక పెట్టేడు; 'సెలెస్టీ! త్వరగా రా! సెలెస్టీ!'

దాది బెదిరిపోయి, గబగబా పరుగెత్తుకుంటూ వచ్చింది. తొందరగా మాట్లాడే యత్నంలో అతగాడు నత్తుతూ, 'నా బూట్లు! కత్తి! తోటాలసంచి!...మరి...మరేమో, పడుకునే గదిలో టేబిలుమీంది స్పానిష్ బాకు! త్వరగా తీసుకురా!' అన్నాడు.

ఆ మొండిశిఖండి రైతన్నా క్షణకాలం లభించిన యీ విరామాన్నవకాశంగా తీసికొని మళ్ళా తనగోద ప్రారంభించేడు: 'ఎల్లా వుంటుందంటే నడిచేటప్పుడు కంతుల్లా బాధ పెడుతున్నాయి!'

విసిగిపోయివున్న డాక్టరు అరిచేడు:

'ఊరుకోవయ్యా! నీకు పుణ్యం వుంటుంది గాని! నువ్వు అసలు యెప్పుడేనా కాళ్ళు కడుక్కుంటేగాదూ? తరచు కాళ్ళు కడుక్కుంటే యిల్లా జరుగుతుందా?' అని కసరుతూ ముసలి రైతు మెడమీద చెయ్యేసి, మొహంమీదే బుసలుకొట్టేడు. 'మనం యిప్పుడు రిపబ్లిక్‌లో నివసిస్తూన్నామని గ్రహింపు లేమటోయ్, మూర్ఖుడా?'

కాని అంతట్లోనే వృత్తిసహజమైన సంకోచంతో హఠాత్తుగా చల్లబడిపోయి, యీ విపరీతానికి విస్తుపోతూన్న వృద్ధ దంపతులు వెడుతూన్నంతసేపూ,—

"మిత్రులారా! రేపు వచ్చెయ్యండి! తప్పకుండా రేపు రాండి! ఇవాళ నాకు యేమీ అవకాశం లేదు!" అంటూనే వున్నాడు, సానునయంగా.

ఆపాదశిరః పర్యంతమూ సాయుధుడవుతూ, పని మనిషికి అతడింకో బుల్లెడు ఆజ్ఞలు జారీచేసేడు:

'లెఫ్టినెంట్ పికార్డ్, సబ్‌లెఫ్టినెంట్ పోమ్మెల్‌ల దగ్గిరికి పరుగెత్తి కెళ్ళి తక్షణం రమ్మన్నానని చెప్పు! టార్చెబ్యూఫ్‌ని వాడి డోలుతో సహా వెంటనే రమ్మను! త్వరగా! ఊఁ! వెళ్ళు!' సెలెస్టీ వెళ్ళిపోగానే అతడు ఆలోచనలన్నిటినీ కూడదీసికొని, ఆ పరిస్థితుల్లోని కష్టాల నధిగమించడానికి తయారవుతున్నాడు.

రమ్మని కబురందిన ముగ్గురూ కలిసే వచ్చేరు, కాస్సేపట్లో. కమాండరు కబురంపినా తమసాధారణ దుస్తుల్లోనే వచ్చిన వీళ్ళు ముగ్గుర్నీ చూడగానే కమాండరుకు ఆశ్చర్యం,

ఆశాభంగంకూడా కలిగేయి. మన డాక్టరు మస్సారెల్ యే కమాండరని వేరే చెప్పనక్కరలే దనుకుంటా.

'ఐతే, మీాకేం తెలియలే దన్నమాటా? చక్రవర్తిని బందీగా పట్టుకున్నారు! రిపబ్లిక్ ప్రకటించబడింది! నా స్థితి నిరాశాజనకం గాకున్నా అసిధారావ్రతంగా వుందని చెప్పాలి."

తన పరివారం ముఖాల్లో ఆశ్చర్యాన్ని గాంచి, (కమాండరు) కొంచెంసేపు ఆలోచించుతూన్నట్లుండి, మళ్ళా అందుకున్నాడు :

'వెంటనే కార్యరంగంలోకి దూకాలి. ఊగిసలాట పనికరాదు! మామూలుసమయాల్లో రోజులూ, యిప్పుడు నిముషాలూ సమానం. మనం ప్రతీవిషయంపైనా యెంత త్వరగా నిశ్చయాలు తీసికొంటామో? అనే దానిమీాదనే పరిస్థితులు ఆధారపడివుంటాయి. పికార్డ్! నువ్వెళ్ళి పూజారిని పట్టుకుని, గంట వాయించమను, జనాన్నంతనీ పోగుచేసేందుకు. నేనూ వాళ్ళకంటే ముందే అక్కడికి వచ్చేస్తాలే. టోర్చిబ్యూఫ్! నువ్వెళ్ళి డప్పుకొట్టుకుంటూ రా, వాలంటీర్లని ఆయుధాలతో సహా చౌకుకు రమ్మని! గెరిసెయిూ, సల్మారేగ్రామాల్లోకూడా కబురంపాలిసుమా. పొమ్మెల్! నీ యూనిఫారం — అంటే జాకెట్టూ, టోపీని,— వెంటనే వేసుకునిరావాలి. మనం యిద్దరం వెళ్ళి మేయరుఆఫీసు స్వాధీనం చేసుకుంటాం. మేయరు వైకౌంట్ డీ వెర్నిటాట్‌ని అధికారం నాకు వప్పగించమని ఆజ్ఞాపించుదాం— తెలిసిందా?'

'కలిసింది.'

'ఐతే తక్షణం తయారుకా. నేనూ నీతో మీాయింటి వైపువస్తున్నా, పౌమ్మెల్! మనం యిద్దరం కలిసి కార్యక్రమం ప్రారంభించాలిగదూ!'

మరో ఐదునిముషాల్లో కమాండరు మస్సారెల్, (కమాండరంటే మన డాక్టరుగారే!) అతని సుబల్టర్న్ పౌమ్మెల్, సర్వాయుధాల్నీ ధరించి చౌకులోకి వచ్చేసేరు. సరీగా ఆ సమయానికే మేయరు వేటదుస్తుల్లో రైఫిల్ బుజాన పెట్టుకుని గబగబా నడిచివస్తూన్నారు, వీళ్ళ కెదురుగా. ఆకు పచ్చరంగుదుస్తుల్లోవున్న గార్డులు ముగ్గురు ఆయన వెనకాలే వున్నారు. వాళ్ళ మొలల్లో బాకులూ, బుజాలమీాద తుపాకులూ కూడా వున్నాయి.

వీళ్ళని చూడ్డంతోనే కమాండర్ మాన్పడిపోయి, తక్కున నిలబడిపోయేడు. మేయరు సరాసరిగా తన ముగ్గురు గార్డులతోనూ తన ఆఫీసుభవనంలోకి వెళ్ళి తలుపులు వేసుకునే దాకా కమాండర్ నిశ్చేష్టుడైవుండి, అంతలో ప్రకృతానికి వచ్చి,—

'మనల్ని పసికట్టేశాడు! మనకి అదనపు బలాలు వచ్చే వరకూ యింకేం చేయలేము! మరో పావుగంట వేచియుండాలి.' అంటూ గొణిగేడు.

అంతట్లో లెఫ్టినెంట్ పికార్డు వచ్చిచేరేడు. 'పూజారి మన ఆజ్ఞలను తిరస్కరించేడు. పైపెచ్చు ఘోషకుడితోనూ,

నౌకరుశోనూ చెర్చిలోవుండి తలుపులు బిడాయించుకున్నాడు!' అని నివేదించేడు.

చౌకలో ఒకవైపున మేయరు ఆఫీసుభవనం తెల్లగా వుంది. దానికెదురుగానే చెర్చిభవనం నిశ్శబ్దంగా, నల్లగా నిలబడింది. చెర్చిగేటు తాలూకు బ్రహ్మాండమైన ఓకుతలుపులు మూసేసివున్నాయి.

సంగతి యేమిటోనని పౌరులు కిటికీల్లోంచి ముఖాలు బైటికిబెట్టి చూస్తూన్నారు, మరికొందరు గుమ్మాల్లోకి వచ్చి నిలబడుతూన్నారు. అంతలోకి డోలుదెబ్బలు వినబడ్డాయి. హఠాత్తుగా టోర్చిబ్యూఫ్ కనిపించేడు. సాయుధులు గండని హెచ్చరిస్తూ, మూడు దురితపుదెబ్బలు వినబడుతున్నాయి. అలవాటుగా అడుగేస్తూ, టోర్చిబ్యూఫ్ డోలువాయిస్తూనే చౌకులోంచి నడుచుకుంటూ, ప్రక్క పల్లెకిపోయే రోడ్డుకి పోయేడు.

కిమాండరు కాస్త వుద్రేకం తెచ్చుకుని, కత్తిదూసి, శత్రువు సురక్షితంగావున్న రెండుభవనాల మధ్యకూ వెళ్ళి, వీధిలో నిలుచుని ఆయుధాన్ని పైకెత్తి ఝుళిపిస్తూ, బిగ్గరగా అరిచేడు: 'రిపబ్లిక్ వర్ధిల్లాలి! ద్రోహులు నశించాలి!' ఇల్లా అరిచి, వెంటనే అతడు తన పరివారం మధ్యకుతిరిగి వచ్చేసేడు. కసాయి కొట్టువాడు, రొట్టెల దుకాణంవాడు, మందులంగడి వాడు,- యీ వగైరా లందరూ అనిశ్చయభావంతోనే తమ

అడ్డగళ్ళు కట్టేసి, చెక్కలు మూసేశారు. ఆ వీధిన యిక తెరచి వున్నది ఒక్క చిల్లరదుకాణం మాత్రమే.

ఇంతసేపూ వాలంటీర్లు ఒక్కొక్కరే వచ్చి చేరుతూనే వున్నారు. వాలంటీర్ల యూనిఫారం ఎల్లా ఒక్క టోపీమాత్రమే. దుస్తులు అందరివీ తలా ఒకమాదిరివీను. అందరి చేతుల్లోనూ తుప్పుపట్టిన పాతతుపాకులు వున్నాయి. గత పాతికముప్పై యేళ్ళ నుంచీ యీ తుపాకులు వాళ్ళ వంటయిళ్ళల్లో పొగగొట్టాల దగ్గర పొగచూరుతూ వ్రేలాడుతూన్నవే! వాళ్ళనిచూస్తే పల్లెటూరిరైతుల పటాలంగా వుంది గాని సోల్జర్ల పటాలంగా కనబడదు.

చుట్టూ ముప్పైమందిదాకా చేరగానే కమాండరు ప్రస్తుత పరిస్థితుల్నిగూర్చి క్లుప్తంగా బోధపరిచేడు. తరువాత మేజరు దిక్కుతిరిగి 'ఇదిగో! ఇంక మనం వుపక్రమించాలి!' అన్నాడు.

పౌరులు చుట్టూచేరి మాట్లాడుకుంటూ, పరిస్థితులు చర్చించుకుంటూంటే, కమాండరు 'దాడి'కి ప్లాను గబగబా తయారు చేసేసేడు :

'లెఫ్టినెంట్ పికార్డ్! మేయరు కిటికీదగ్గిరికి వెళ్ళి, ఆఫీసు భవనాన్ని నాకు వప్పగించమని రిపబ్లిక్ పేరిట ఆజ్ఞలందజెయ్యి!'

కానైతే లెఫ్టినెంటు కదల్లేదు. లెఫ్టినెంటు అసలు తాపీ మేస్త్రి; కమాండరు ఆజ్ఞను తిరస్కరించుతూ, అన్నాడు :

'నువ్వో పనికిమాలినవాడివి! నీ బ్రతుక్కిసాయం ఆజ్ఞాపించడంకూడానా? నన్ను వాళ్ళ తుపాకులికి గురిగా చేద్దామనుకుంటున్నావేం? ఆ లోపలివాళ్ళు మాంఛి గురిగాళ్ళుకూడాను! ఇంకానయమే! అబ్బే! వద్దులే! నీ ఆజ్ఞల్ని నువ్వేవుంచుకో?'

కమాండరు మొహం కందగడ్డలా ఐంది. సంబాళించుకుని,—

'డిసిప్లిన్ పేరిట, నిన్ను వెళ్ళమని ఆజ్ఞాపిస్తూన్నాను!' అన్నాడు.

'తగినంతకారణం లేనిదే, యెందుకో తెలియకండా నా వళ్ళు చెడగొట్టుకోను!' అంటూ లెఫ్టినెంటు జవాబు.

ఆ దగ్గిర్లోనే నిలబడి బాతాఖానీ వేస్తున్నారు, పలుకుబడిగల పెద్దమనుష్యులు కొందరు. వాళ్ళగుంపులోంచి నవ్వులు వినిపించేయి. వాళ్ళల్లోంచి ఒకరు బిగ్గరగా 'నువ్వు చెప్పిందే రైట్,—పికాడ్డు! ఇది సమయంగాదు!' అంటూ అరిచేరు. కమాండరు పళ్ళు బిగించి మెల్లిగా 'పిరికిపందలు!' అని గొణుగుతూ, తన ఖడ్గం, రివాల్వరు ఓ వాలంటీరు చేతి కందిచ్చి, అడుగుతొప్పకండా వేస్తూ, దృష్టంతా మేయరు కిటికీమీదే లక్ష్యం చేసి, ఆ కిటికీదగ్గిరికి సాగేడు. ఎవరో తనమీద తుపాకీ గురిపెట్టినట్లూ, దాన్ని పసికట్టి తాను భద్రంగా నడుస్తూన్నట్లూ వుందాతని వైఖరి!

అతడు మేయరు భవనానికి కొద్ది అడుగుల్లో వున్నాడనగా, దానికి రెండుపక్కలా వున్న రెండు పాఠశాలల ద్వారాలు తెరువబడి, ఒక దాంట్లోంచి మగపిల్లలూ, రెండో

డాంట్లోంచి ఆడపిల్లలూ బిలబిల్లాడుతూ ప్రవాహంగా బైటికి వచ్చేరు. వాళ్ళూరాగానే వీధిలో గుంపులుగుంపులుగా కమాం డరుచుట్టూ గువ్వలపిండుల్లా మూగి, రణగుణధ్వనిచేస్తూ ఆడుకో నారంభించేరు. ఆ పరిస్థితిలో యేంచెయ్యాలో తోచక, ఆతడు కాస్సేపు అల్లాగే నిలబడిపోయేడు.

పిల్లలంతా బైటికి వచ్చేసేక ఆ ద్వారాలు తిరిగి మూయ బడినాయి. కాస్సేపట్లోనే ఆ కోతిమూక చాలవరకు చెదిరి అటునిటు వెళ్ళిపోయేరు. ఈ అవకాశం చిక్కగానే కమాండరు బిగ్గరగా అరిచేడు:

'మాన్స్యూర్ డీ వెర్ణిటాట్ !' వెంటనే ఓ కిటికీ తెరుచు కొని, డీ వెర్ణిటాట్ కనబడ్డారు.

కమాండరు ఆరంభించేడు: 'మాన్స్యూర్ ! ప్రభుత్వ విధానాన్ని మార్చివైచిన అద్భుత సంఘటనలను గూర్చి మీరు వినియే వుంటారనుకుంటా. మీరు ప్రాతినిధ్యం వహి స్తూన్న పార్టీ యిప్పు డింక అధికారంలో లేదు. నా పార్టీ యిప్పు డధికారంలోకి వచ్చింది. విచారకరమైన నప్పటికీ, అని వార్య పరిస్థితులవల్ల నేను, రిపబ్లిక్ పేరట, నిరాకరిస్తూన్న ప్రభుత్వం మీ యందుంచిన అధికారాన్ని నాకు హస్తగతం చేయమని సాధికారంగా కోరుతున్నా.''

మేయరు జవాబిచ్చేరు: ''డాక్టరు మాస్సారెల్ ! నేను కన్నివిల్లీ మేయరును. సక్రమంగా యేర్పడిన ప్రభుత్వంవల్ల నే నే నీ పదవిలో వుంచబడ్డాను. పైఅధికారుల ఆజ్ఞలవల్ల నా పదవి

…చబడేవరకూ నేనే యిక్కడ మేయరుగా వుంటాను. …భవనంలో వుండేహక్కు మేయరునైన నాకు పూర్తిగా … వుండే తీరుతాను కూడాను. ఇకపోతే, నన్ను …ట్టాలనుకుంటే ప్రయత్నించి చూడండి!" అంటూ భడేలున తలుపులు మూసేసి, వెళ్ళిపోయేడు.

వలంటీర్ కమాండరు తన జనందగ్గరికి తిరిగి వచ్చేసేడు. మరోపని దేన్నీ చేయకముందే అతడు లెఫ్టినెంట్ పికార్డును ఆపాదశిరఃపర్యంతం యెగా దిగా చూసి, కసిగా అన్నాడు:

"నువ్వో దద్దమ్మవి! నువ్వో!...ద్రోహివాజమ్మవి! నీలాంటి వాళ్ళుంటే పటాలానికి తలవొంపులు కూడాను. నిన్ను పదవిలోంచి తీసేస్తా!"

"నువ్వు తీసేసేదేమిటి? నీబోడిపెత్తనం దేనికి? నేనే వదలుకుంటూన్నాలే!" అంటూ లెఫ్టినెంటు పికార్డ్ ఓ గుంపు వైపు వెళ్ళిపోయేడు. ఆ గుంపులో వాళ్ళంతా తిరస్కారపూర్వకంగా గొణుగుతూన్నవాళ్ళే.

ఇంక కమాండరుకి ఆందోళన బైలుదేరింది. ఇప్పుడు తనేంచేయాలి? దాడి చేయాలా? తన వాలంటీర్లు తన ఆజ్ఞల్ని పాటిస్తారా? పాటించరా? అదీగాక తను అవలంబించబోయే విధానం సరియైనదేనా? కాదా? ఈ రకంగా గుంజాటన పడుతూండగానే అతనికో ఆలోచన తటాలున స్ఫురించింది. వెంటనే చౌకుకావలి ప్రక్కనేవున్న టెలిగ్రాఫ్ ఆఫీసుకు

పరుగెత్తేడు, గబగబా మూడు టెలిగ్రాములు రాసేడు. ఒకటి పారిస్‌లోని రిపబ్లికన్ ప్రభుత్వానికి; రోయెన్ లోని నూతన రిపబ్లికన్ ప్రిఫెక్టుకు, దిగుప్ సీన్ వారికి; మూడోది డీ యెప్పీలోని కొత్త రిపబ్లికన్ సబ్-ప్రిఫెక్టు

స్థానిక పరిస్థితంతా వాటిల్లో వివరించేడు. పై అధికారులకి, పట్టణాధికారం సామ్రాజ్య భక్తుడైన మేయరు హస్తాల్లోనే వుండడంవల్ల రిపబ్లిక్ ప్రభుత్వానికిగల ప్రమాదాన్ని విప్పి చెప్పేడు; తనసేవలను సమర్పిస్తున్నాను, స్వీకరించమన్నాడు; ఆజ్ఞల నివ్వించండి, శిరసావహిస్తా నన్నాడు; తన పూర్తిపేరు చేవ్రాలుచేసి, తనకుగల బిరుదు నిశానీలన్నీ పేరుపేరున గుది గుచ్చి పేర్కొన్నాడు. ఆ టెలిగ్రాముల్లో అక్కణ్నుంచి తన పటాలం దగ్గిరికి తిరిగివచ్చి, ఠీవిగా పదిఫ్రాంకుల్ని జేబులోంచి తీసియిస్తూ, అన్నాడు:

"ఇదిగో! మిత్రులారా! వెళ్ళి యేదో కాస్తంత తిని, తాగిరండి. ఓ పదిమంది దళంమాత్రం యిక్కడ డ్యూటీలో వుండాలి. మేయరు భవనంలోంచి యెవరూ బైటికి వెళ్ళకండా కాపలా కాయాలి."

మాజీ లెఫ్టినెంట్ పికార్డ్, వాచీ రిపేరరుతో బాతాఖానీ వేస్తూ, యీ మాటలు వింటూనే, పరిహాసంగా—'క్షమించాలి, డాక్టర్! ఒక విషయం చెప్పాల్సి వచ్చిందుకు. అందులో వాళ్లు బైటికి వెళ్ళిపోతేనేగాని నువ్వు అందులో దూరడానికి అవ

కాశం! వాళ్ళని బైటికి వెళ్ళనీయకపోతే నువ్వు దాంట్లోకి యెల్లా వెళ్ళగలవో నాకేం దారికనబడ్డంలేదు!' అన్నాడు.

డాక్టరు జవాబేమీ యివ్వలేదు. హడావుడిగా వున్నట్టు నటిస్తూ, భోజనానికింటికి వెళ్ళిపోయేడు. మధ్యాహ్నం పట్టణమంతా తిరుగుతూ, ముందేదో ఆశ్చర్యకరసంఘటన జరుగుతుందని తనకి తెలుసుననే వైఖరితో వివిధ ప్రదేశాల్లో సాధికారంగా పోజు లిచ్చుకుంటూ వచ్చేడు. అత డెన్నిసార్లు చౌకులోంచి వెళ్ళినా, మేయరు ఆఫీసులోగాని, చెర్చిలోగాని యేమీ సందేహాస్పదమైన సంఘటనలు జరుగుతూన్నట్లే పొడగట్టలేదు. ఆ భవనాలు రెండూ నిర్జనంగా వున్నట్లే కనబడుతున్నాయి.

కసాయిదుకాణంవాడు, రొట్టెలంగడివాడు, మందుల షాపువాడూ ఆమధ్యాహ్నం తమ దుకాణాల్ని మళ్ళా తెరిచేరు, మామూలుగానే. వీళ్ళందరూ తమ గుమ్మాల్లో నిల్చుని, బాతాఖానీ వేస్తున్నారు, రాజకీయపరిస్థితులు చర్చిస్తూ. చక్రవర్తి బందీ అయేడంటే యెవరో ద్రోహంచేసి వుండాలి! కొత్త రిపబ్లిక్ కి నికరంగా రాబడి వుంటుందా? ఇల్లాంటి సంశయాలు వీళ్ళందరికీ బోలెడున్నాయి.

రాత్రి అయింది. తొమ్మిదిగంటలు కావచ్చింది. డాక్టరు ఒంటరిగా, తాపీగా నడుస్తూ చౌకులోకి వచ్చేడు. తన ప్రతిద్వంద్వి యీ పాటికి రంగంలోంచి నిష్క్రమించివుంటాడనుకుని, చేగొడ్డలితో నాలుగువేళ్ళువేసి భవనంతలుపులు తెర

వచ్చునవే విశ్వాసంతో పనికి వుపక్రమిస్తున్నాను. అంతట్లోకే గార్డు హెచ్చరికగా కేకేసేడు : 'ఎవరక్కడ ?' దానితో డాక్టరు మస్సారెల్ వాయువేగమనోవేగాలమీద అక్కణ్ణుంచి పరుగుచ్చుకున్నాడు.

పరిస్థితుల్లో యే మార్పూలేకండానే మరోసారి తెల్ల వారింది. సాయుధులై దళసభ్యులంతావచ్చి మళ్లా చేరుకున్నారు, చౌకులో. ఈ పేచీ యెల్లా పరిష్కార మవుతుందో చూద్దామని పౌరులంతా ఆతురతో గుమిగూడుతూన్నారు. చుట్టుపక్కల గ్రామలనుంచికూడా జనం తండోపతండాలుగావచ్చి మూగుతున్నారు. ఈ ప్రతిష్టంభన యిల్లాగేవుంటే తన రాజకీయ నాయకత్వం, ప్రతిష్ఠా దెబ్బతినేస్తాయని డాక్టరు గ్రహించేడు. దానితో నిశ్చయానికీవచ్చేడు, దీన్ని యెటో ఒకలాగున పరిష్కరించాల్సిందేనని. అందులోనూ ఆ పరిష్కారవిధానంకూడా శక్తివంతంగా, తీవ్రంగా వుండాలనీ భావించేడు. సరిగ్గా అదే సమయంలో టెలిగ్రాఫ్ఆఫీసు తలుపులు తెరువబడి, ఆఫీసుడైరెక్ట్రెస్ యొక్క పరిచారిక చేతుల్లో రెండు టెలిగ్రాములు పట్టుకుని వెలుపలికి వచ్చింది.

ఆమె పిట్టలాంటి చిన్న మనిషి. చిన్న చిన్న అడుగులేసుకుంటూ సరాసరిగా ఆమె కమాండరుదగ్గిరికివెళ్ళి, ఓ డిస్పాచ్ ఆయనచేతిలో వుంచింది. అక్కణ్ణుంచి చౌకుదాటి, ఆవలి ప్రక్కకి బైలుదేరింది. గుంపులో అందరికళ్లూ తనమీదే వున్నట్లు గ్రహించి, పిరికిగా తలవాల్చేసి, మందగమనంతో నడిచిపోయి,

మేయరు ఆఫీసుతలుపులు తట్టింది, టకటకమని మెల్లిగా—రెండో పక్షంతాలూకు యోధులు అందులో దాగియున్నారనేదే తనకు యెరుకలేనట్లుగా వుందామె వైఖరంతా.

మేయరీతలుపు ఓరగా తెరుచుకుని యెవరిదో చెయ్యి బైటికివచ్చి, ఆమెచేతిలోని టెలిగ్రామును అందుకుంది. ఆమె వెనుక తిరిగి వచ్చేసింది. అంతమందికళ్ళూ తననే తేరిపార జూస్తూండడం గ్రహించిన ఆమెముఖం యెఱ్ఱబారిపోయింది, ఆమె యేడ్చేయడానికి సంసిద్ధంగా వున్నట్లుంది.

గుంపులో గోలహెచ్చిపోతూంది. డాక్టరు సాధికారంగా వాళ్ళని హెచ్చరించేడు : 'నిశ్శబ్దంగా వుండండి! కాస్సేపు, దయచేసి!' జనసమూహంలో రొద కాస్త తగ్గేక, అతడు సగర్వంగా ప్రకటించేడు :

'ఇదిగో! మిత్రులారా! నాకు ప్రభుత్వాన్నుంచివచ్చిన అధికార పత్రిక!'

టెలిగ్రాము కాగితాన్ని యెత్తి పట్టుకుని, బిగ్గరగా చదివి వినిపించేడు :

"మేయరు పదవినుంచి డీ వర్ణిటాట్ తొలగించబడ్డారు. తక్షణ కర్తవ్యాన్నిగూర్చిన సలహాలు పంపండి. మిగిలిన సూచనలు తరువాత.

సబ్–ప్రిఫెక్టు స్థానంలో
(సం) సాపిన్,
కౌన్సిలర్."

డాక్టరు విజయాన్ని సాధించేడు. అతనిహృదయ మానంద తరంగిత మవుతూంది. కాని యీ సందర్భంలోనే మాజీ లెఫ్టినెంట్ పికార్డు, ఆ దగ్గరలో జనసమూహంలోనుంచే అరిచేడు: 'అంతా బాగానేవుంది, కాని మేయరీలోంచి వాళ్ళు గనుక కదిలివెళ్ళకపోతే నీ కాగితం దమ్మిడీవిలువ చెయ్యదు!' డాక్టరుమొగం వెలవెల బోయింది. నిజమే! వాళ్ళు మేయరీ ఖాళీచేసి, వెళ్ళకపోతే?... తానుముందు చర్యలకు సంసిద్ధుడు కావాల్సిందేనా? అది తనకు హక్కు మాత్రమేగాదు. విధీ, కర్తవ్యం కూడాను. ఆతడాతురతగా మేయరీవైపు చూడ్కులు నిగుడించేడు. తన ప్రతిద్వంద్వి తలుపులు తెరచుకుని బైటికి వస్తాడని ఆశించేడు, యెందుకో తెలియకండానే. కాని, తలుపులు మూసే వుండిపోయినాయి. డాక్టరు ఆశలు భగ్నమైనాయి. ఇప్పు డింక యేంచెయ్యాలి? జనసమూహాలు పెరిగి పోతున్నాయి. వాలంటీరుదళాన్ని చుట్టూమూగి కరిమ్మేస్తూ న్నారు. జనంలో కొందరు నవ్వుతూన్నారు కూడాను.

డాక్టరును వేధిస్తూన్న ఆలోచన ఒకటుంది ప్రత్యేకంగా. ఒకవేళ దాడి చేయడమే తప్పకపోతే, నాయకుడు గనుక తాను దళానికి ముందు భాగంలో వుండితీరాలి. తాను పడిపోతే యింక పోరాటమే వుండదాయె! అంచేతనే డీ వర్గిటాట్, ముగ్గురు గార్డులూ తనమీదనే తుపాకులు గురిపెట్టి తీరుతారు. వాళ్ళ గురితప్పిపోదు, మంచి సూటిగాళ్ళులే, వాళ్ళంతా! అందులో

సందేహంలేదు! మాజీ లెఫ్టినెంట్ పికార్డు ఆ విషయమ్మై తనను హెచ్చరించనే హెచ్చరించేడాయె!

కాని, డాక్టరు బుర్ర ఆలోచనలకి పుట్ట! వెంటనే మరో ఆలోచన మెరుపులా తట్టిందాయనకి. పామ్మెల్ వైపు తిరిగి, 'గమ్మునవెళ్ళి, మందుల షాపువాణ్ణడిగి తెల్లటిగుడ్డా, పొడుగాటికర్ర పట్టుకురా, తక్షణం!' అన్నాడు.

సుబల్టర్న్ (అంగరక్షకుడు) పామ్మెల్ గబగబా వెళ్ళేడు. డాక్టరు ఆలోచన యిప్పుడో జెండా తయారు చెయ్యాలని! పార్టీజెండాయే కాని తెల్లటిది చేస్తాడు. ఎందుకేనామంచిది! ముసలి మేయరు, వైకౌంట్ డీ వర్నిటాట్ వున్నాడు గదండీ, ఆతడు వొట్టిచాదస్తుడు! సక్రమపద్ధతులనుసరించాలనే పట్టుదల మహావుం దాతడికి. అంచేత, యేమో యీ తెల్లజెండా అతన్ని కొంతవరకు సంతోషపెట్టనూ వచ్చు!

సుబల్టర్న్ పామ్మెల్ త్వరలోనే తెల్లగుడ్డా, చీపురుకర్ర పట్టుకుని తిరిగివచ్చేడు. తీగముక్కలతో గుడ్డని కర్ర చివరబిగించి, వాళ్ళోక జెండా తయారుచేసేరు. డాక్టరు తన రెండుచేతులా జెండాకర్రని దృఢంగాయెత్తి పట్టుకుని, మళ్ళా మేయర్వైపు సాగేడు. ద్వారాని కెదురుగా వెళ్ళేక, 'మాన్సూర్ డీ వర్నిటాట్!' అని కేకేసేడు.

మేయరీతలుపు హఠాత్తుగా తెరువబడి, డీ వర్నిటాట్, ముగ్గురు గార్డులూ ద్వారంలో ప్రత్యక్షమయేరు. సహజంగానే

డాక్టరు గతుక్కుమని, కాస్త వెనుక తగ్గేడు. మర్యాదగా తన ప్రతిద్వంద్వికి, శత్రువుకి శాల్యూట్ కూడా చేసేడు. భావోద్రేకం వల్ల వెన గద్గదికతో మేయరును సంబోధించి, 'అయ్యా! నా క్షిప్తిక్షేత్రం అందిన ఆజ్ఞల్ని మీకు తెలపడానికి వచ్చేను.' అన్నాడు.

ఆనలి పెద్దమనిషి ప్రత్యభివాదనం చెయ్యకుండానే, విరసంగా జవాబిచ్చేడు. 'అయ్యా! నేనే ఖాళీచేసి, వెళ్ళిపోతున్నా. కాని, యెవరికీ బెదిరిపోయి మాత్రంగాదు. దురాక్రమణ గావించిన యీ జుగుప్సాకరప్రభుత్వముకు వినమ్రుడనయీ కాదు! ఈ రిపబ్లిక్ అధికారంక్రింద ఒక్కక్షణమైనా పదవిలోవుండి, సేవించేననే అపకీర్తి నాకు కలుగకుండాలనే వెళ్ళిపోతున్నాను, నేను! అంతే!' ఈ మాటల్ని ఒక్కొక్కటిగా నొక్కి చెప్పేడు, మేయరు.

డాక్టరుకి ఆశ్చర్యంవల్ల నోట మాట రాలేదు. ఇల్లా అంటూనే డీ వర్నిటాట్ గబగబా నడిచి, వీధిమలుపులో అదృశ్యుడయేడు. ఆయన్ని వెంబడించే గార్డులూ వెళ్ళిపోయేరు. అప్పటికి డాక్టరు గుర్రిక్కి తిప్పుకున్నా, యింకా విస్మితుడయ్యే, జనంవైపు నడుస్తూ అరిచేడు: 'హుర్రా! హుర్రా! రిపబ్లిక్ వర్ధిల్లాలి! అన్నిరంగాల్లోనూ మనకే జయం!'

కాని, యీ కేకలువిన్నా జనం వుత్సాహోద్రేకాల్ని ప్రదర్శించలేదు. డాక్టరు తిరిగి ప్రయత్నించేడు. 'ప్రజకి విజయం కలిగింది! మీరంతా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు పొందేరు! తెలి

సిందా? మీ రింక సగర్వంగా, రొమ్ము విరిచి తిరగొచ్చు! రిపబ్లిక్ కీ జై!'

పౌరుల్లో వుత్సాహం రేకెత్తలేదు. స్వేచ్ఛాధ్వనుల్లో వాళ్ళకళ్లు వెలగడంలేదు. ఉదాసీనంగానే డాక్టరును వాళ్ళు చూస్తున్నారు. డాక్టరుకి వాళ్ళ వుదాసీనతపట్ల అసహ్యం కలిగింది. తృణీకారభావంతో జనాన్ని చూస్తూ, వాళ్ళని రెచ్చగొట్టే మాటలకోసం వెతుకుతూన్నాడు, డాక్టరు. ఈ మద్దు జనాన్ని వుత్తేజపరచాలి; తన చారిత్రకబాధ్యతను సఫలీకృతమొనర్చుకోవాలి; అందుకుతగ్గ మాటలకోసం అన్వేషిస్తూంటే డాక్టరు మనస్సులో తటాలున ఒక ఆలోచన మెరుపులా తట్టిది. వెంటనే లెఫ్టినెంట్ పొమ్మెల్ వైపు తిరిగి 'పొమ్మెల్! నువ్వెళ్ళి మాజీచక్రవర్తి విగ్రహం, కౌన్సిలుహాల్లో వున్నది, కుర్చీతో కూడా యిల్లా తీసుకురా!' అన్నాడు—

కొంచెంసేపట్లోనే అతగాడూ కుడిభుజంమీద మూడో నెపోలియన్ సుద్దబొమ్మను, యెడమచేతి పేముకుర్చీనీ మోసుకుంటూ తయారైనాడు.

డాక్టరు మస్సారెల్ యెదురెళ్ళి, పొమ్మెల్ చేతిలోని కుర్చీనందుకుని నేలమీద పెట్టేడు. చక్రవర్తి సుద్దబొమ్మని కుర్చీమీద పెట్టించి, దానిమీదే దృష్టివుంచి, నాలుగడుగులు వెనక్కివేసి, కీచుగా అరిచేడు:

'రాక్షసుడా! నిరంకుశుడా! నువ్వు పతనమైనావు! బుగ్గదలో, బూడిదలో కూలి, కూరుకుపోయేవు! నువ్వు పాదాల క్రింద మట్టేసిన దేశమాత అవసానదశలో ఆఖరివూపిరి తీసుకుంటూంది. అదృష్టదేవత నీమీద ప్రతీకారం తీసికోనున్నది! ఓటమీ, అవమానం,— యివి నీవంతు అయినాయి. శత్రువు చేతులో ఓడిపోయి, పరిష్యన్‌లకు బందీవై నువ్వు పతనమైపోయావు! సామ్రాజ్యపు శిధిలాలనుంచి దుర్నిరీక్ష్యమైన రిపబ్లిక్, విరిగిన నీఖడ్గాన్ని చేతబట్టుకుని లేచింది!'

ప్రజాసమూహాలు తన వుపన్యాసాన్ని ఆమోదించి, జయజయధ్వానాలు గావిస్తారని అతడు కాస్సేపు ఆగేడు. కాని, యెవడూ మాటాడలేదు, రైతుజనాలు చడీచప్పుడూ లేకండా, నిశ్చేష్టులైన ట్లూరకొన్నారు. నెపోలియన్ చక్రవర్తి బొమ్మ, మీసాలు సూదిగా మెలిద్రిప్పుకుని, తీవిగా మస్సారెల్ వైపు చిరునవ్వుతూ చూస్తూంది. చక్రవర్తి క్రాపు చేయించుకుని, తల నున్నగా దువ్వుకున్నట్లున్నదా విగ్రహం. మంగలిషాపుల సైనుబోర్డులమీదికైతే యీబొమ్మ బాగా తగివుంటుందని పిస్తూంది. విగ్రహం చిరునవ్వుతో పరిహాసిస్తూన్నట్లు డాక్టరు వైపు యేకాగ్రంగా చూస్తున్నట్లుంది!

శత్రువు లిద్దరూ అల్లాగే కొంతసేపు ముఖాముఖీగా నిలబడివున్నారు. చక్రవర్తి కుర్చీమీదా, అతనికెదురుగా మూడే అడుగుల్లో డాక్టరు మస్సారెల్. డాక్టరుకి క్రోధం

పెచ్చుపెరిగిపోతూంది. ఇంకేం చెయ్యాలి? ఈ జనాన్ని కదల్చడంయెల్లాగ? తన సిద్ధాంతాలు జయిస్తేయని స్పష్టపడ్డ చేందుకు యేమిటిమార్గం? డాక్టరుచెయ్యి కటిభాగంమీద అనుకొని వుండడంలో కాకతాళీయంగా చేతికి రివాల్వరుపిడి తాకింది. డాక్టరు బుర్రలో తటాలున తట్టింది. 'ఈ జనానికి మాటలతో వుద్రేకంరాదు!' అంతే. చరాలున రివాల్వరుతీసి, రెండడుగులేసి, గురిపెట్టి కాల్చేడు, మాజీచక్రవర్తిపై. గుండు బొమ్మనుదుట దూరిపోయి, చిన్నరంధ్రం, నల్లని చిన్నరంధ్రం మాత్రం చేసింది. దానివల్ల అంతకంటె అధికప్రయోజనం కలుగలేదు. మళ్ళా రెండోసారి కాల్చేడు, మూడోసారీ కాల్చేడు! ఆగకండా రివాల్వరులోని గుండ్లన్నిటినీ కాళీ చేసేసేడు. చక్రవర్తి ఫాలభాగం తెల్లనిపొడుం అయింది. కాని, కళ్ళు, ముక్కు, కొనదేరినమీసాలూ చెక్కుచెదర కండా అల్లాగేవున్నాయి! డాక్టరు యింకెంతమాత్రం సహించ లేకపోయాడు. కుర్చీసహితంగా చక్రవర్తిని యెత్తి పారేసి, విజ యాట్టహాసంతో ఆతని గుండెలమీద కాలుబెట్టి, 'సిరంకుశు లంతా యిల్లాగే నశిస్తారు!' అని అరిచేడు.

కాని, యిప్పటికీ జనంలో వుద్రేకం, వుత్సాహం కలగలేదు. జనమంతా కళ్ళప్పగించేసి, ఆశ్చర్యంతో యేదో తమాషా చూస్తున్నట్లు నిలబడివున్నారు! అప్పుడింక కమాం డరు వాలంటీరు దళంతో 'మీరింక యిళ్ళకి పోవచ్చును!'

అని చెప్పేసి, తన యింటివైపు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ యెవరో తరుముకొస్తూన్నట్లు బైలుదేరి పోయేడు.

ఇంటిదగ్గర పరిచారిక, ఆయనకోసం యెవరో రోగులు మూడుగంటలనుండి కనిపెట్టుకుని వున్నారని చెప్పింది. డాక్టరు తొందరగా లోపలికి వెళ్ళేసరికి ఆ వృద్ధదంపతులే! తెల్లారే సరికి బహు ఓరిమితో వచ్చి, పట్టుదలగా కనిపెట్టుకు కూర్చుని వున్నారు, వాళ్ళు!

డాక్టరును చూడగానే వృద్ధరైతు తన రోగలక్షణాల్ని విపులీకరించ నారంభించేడు: "అయ్యా! డాక్టరుగారూ! యీ జబ్బుందే, యిది, చీమలు కాళ్ళమీదుగా పైకీ క్రిందికీ పాకుతూన్నట్లు వుండడంతో ఆరంభమైందండీ. తెలిసింది గదాండీ?..."



# పశ్చాత్తాపం

మాన్స్యూర్ సావెల్‌కి అరవై దాటివుంటాయి. ఆయన్ని మాంటిన్ వాస్తవ్యులంతా 'సావెల్‌బాబు' అనే పిలుస్తారు. అది శిశిరఋతువు. ఆ దినం వాతావరణం మరీ నిరుత్సాహ కరంగా వుంది. ఆకులు సర్వత్రా మెల్లగా రాలుతూన్నాయి. ఒకవైపు వర్షం; దానిలో మళ్ళా ఆకులవర్షం. ఐతే యీ ఆకుల వర్షం మందకొడిగా, మరింత భారంగా వున్నట్లుంది.

సావెల్‌బాబు అప్పుడే పడకనుంచి లేచేడు. అతనికి చాలనిరుత్సాహంగా వుంది. ఏడుపొచ్చి, ఆవురుమని యేడ్చేసేడు కూడాను. ఎల్లాగో మెల్లగా లేచి, నెగడిదగ్గిర్నుంచి కిటికీదగ్గిరికి పచారుచేయ నారంభించేడు, యేదో ఆలోచిస్తూ. మానవ జీవితంలో వెన్నెల దినాలూ వుంటాయి, చీకటి రోజులూ వుంటాయి. కాని, అరవైరెండేళ్ళు వచ్చినాక యింక అన్నీ చీకటిదినాలే వుంటాయని చెప్పవలసీ వుంటుంది. సావెల్ బాబు యేకాకి; వృద్ధబ్రహ్మచారి. అంటే అవివాహితుడు. 'నా' అన్న వాళ్ళెవరూ లేరతనికి. చావు యెవరికైనా తప్పదు. కాని, ఒంటరిగా, తనకోసం యేడ్చేవాళ్ళైనా లేకండా చని పోవడం యెంత దుఃఖకరము! నిస్స్వార్థంగా, నిష్కల్మషంగా అభిమానించేవాళ్ళూ ప్రేమించేవాళ్ళూ లేకండా చచ్చేచావు యెంత భయంకరము!

సావెల్ తన గతజీవితాన్ని గూర్చి తలపోసేడు. అదంతా యెంత శూన్యంగావుంది! తనగతం వత్తివిస్సారమైనది, సుఖరహిత మైంది! గడిచిపోయిన దినాల్ని తిరగేసుకున్నాడు. తన శైశవ దినాలు, తలిదండ్రులు, యిల్లు; తన స్కూలు, కాలేజీ జీవితం, తన పొరబాట్లు; అనాలోచితకృత్యాలు; వుద్యోగంలో చేరిన దినాలు, పారిస్‌లో మకాం, తండ్రి అస్వస్థత, మరణం; తరువాత తల్లిదగ్గరకి తనరాక, తామిద్దరూ కలిసివుండడం; యువకుడైన తానూ, వృద్ధురాలైన తనతల్లీ బహు ప్రశాం తంగా సంసారయాత్ర సాగించేరు కొంతకాలంపాటు. జీవితంలో కావాల్సింది యింకేమీ కనబడలేదు, వాళ్ళకి. ఆఖరికి ఆమె రోజువచ్చినప్పుడు ఆ తల్లీ మరణించింది. అసలు జీవితమంటే యింతే. జీవిత మెప్పుడూ విచారభాజనమే! తానెప్పుడూ యేకాకిగానే జీవిస్తూవచ్చేడు. ఇంకిప్పుడు తనవంతు వచ్చి నప్పుడు తానూ చనిపోతాడు, త్వరలోనే. తానూ అదృశ్యమై పోతాడు, యీ లోకంలోంచి. అంతే. దానితో అంతా ముగుస్తుంది. ఈ భూమిమీద సావెల్‌ను గూర్చిన ఆనవాలు కూడ మిగలదు. ఎంత భయావహమైన విషయం! ఇతరు లేమో జీవించివుంటారు; వాళ్ళు సజీవులై, ఆనందంగా, నవ్వుతూ తుళ్ళుతూ ఆనందిస్తూనే వుంటే, తానొక్కడు మాత్రమే యేకాకిగా చచ్చిపోతాడు! శాశ్వతసత్యమై మృత్యువేమో యెట్టయెదుట తిరుగాడుతూంటే యీ మనుష్యులు మూర్ఖులై, నవ్వుతూ, తుళ్ళుతూ, కేరింతాలు కొడుతూండడం

విచిత్రంగాలేదూ? ఈ వ్యవస్థ్యవనే దేమో బహుశః తప్పని సరైనదీ, విధివిహితమైనదీ గాకపోతే, యేమో యెవరికేనా కాస్తంత ఆశఅనేది వుండవచ్చును. కాని, అబ్బే! అది తప్పని సరి, విధి! రాత్రివచ్చి పగటిని ఆక్రమించి, గ్రసించినట్లే!

ఇల్లా వ్యర్థంగాకండా తనజీవితమే గనుక పరిపూర్ణమైనదై యుంటేనో? తానేదో ఒకటి సాధించగలిగివుంటే; తన జీవితంలో సాహసాలు, మహదానందాలు, విజయాలు, యేవేవో రకరకాల సంతోషసంతృప్తు లుంటేనో? ఆఁ...! పోనీ, యిప్పుడు తనబ్రతుక్కి అవీలేవాయెను! తన అరవైరెండేళ్ళ జీవితంలోనూ చెప్పుకోదగిన పనేదీ తాను చేయనేలేదు. రోజూ నిద్రలేవడం, వేళతప్పకండా తినడం, మళ్ళీ పెందరాళే పడుకోడం,—యివిగాక తాను చేసినది, చెప్పుకోవగిం దేమీ లేదాయె! ఈ రీతిగానే అరవైరెండేళ్ళూ గడిపేసేడు. వృథాగాక మరేమిటి? చివరికి తాను పెళ్ళికూడా చేసుకోనేలేదు, అందరు మగాళ్ళమల్లే! ఎంచేత? ఔను, తానెందువల్ల పెళ్ళి చేసుకోలేదు? తాను పెళ్ళిచేసుకుని వుండాల్సిందేనే! తనకి యేవో వుపాధికి లోటు లేదుగనక. అరరే! చేతికి దొరికిన అవకాశాన్ని జారవిడుచుకున్నా డన్నమాట! ఔను, అంతే, మరి! అవకాశాలు లేకపోయినా బోలెడంతమంది మగాళ్లు సృష్టించుకుంటున్నారు, అవకాశాల్ని! అల్లాంటిది తను కేవలం నిర్లక్ష్యం చేసేడు. అంతేగాదూ? నిర్లక్ష్యం, వుదాసీనత,—యివే తనలోని పెద్ద లోపాలు! లోపాలే గాదు యివి దుర్గుణాలే! కేవలం నిర్లక్ష్యం

మూలంగా యెందరెందరు మగాళ్లు తమజీవితాల్లో సుఖావకాశాల్ని జారవిడుచుకుంటున్నారు! కాని, చూచేరూ, కొన్ని స్వభావాలకి, యే పనిచేయడానికీ గగనంగానే వుంటుంది! పక్కమీంచి లేవడం, యెక్కడికేనా వెళ్ళడం, పోనీ—షికారు పోవడమే, యే సమస్యనైనా పరిశీలించడమే, ఆఖరికి మాట్లాడడం కూడా యీ జనానికి పెద్దసమస్యగా వుంటుందంటే నమ్మండి.

పోనీ, ప్రేమించడంలాంటి పనికూడా తాను చేయలేదు, ఆఖరికి. ప్రేమ ప్రవాహంలో మునిగి మైమరచి యే అబలా అతని హృదయఫలకంమీద సొక్కిపోలి వాలలేదు. ప్రేమికుల నిరీక్షణామధుర బాధ, ప్రియురాకరగ్రహణంలోని దివ్యకంపం, మోహోద్రేకపూర్ణుడైనప్పటి తన్మయత,—యిల్లాంటి వాటిని గూర్చి యీయనికి యేమీ తెలియదు.

మొదటిసారి పెదవులు పెదవులు కలుసుకొన్నపుడు, నాలుగు చేతులు ఆలింగనబద్ధములైనపుడు కలిగే అద్వైతభావానుభూతిని అనుభవించిన జీవితమే సంపూర్ణమైనది. రెండు ప్రాణులు ఆలింగనవశములై, అనిర్వచనీయానందానుభూతి ననుభవించే యేకప్రాణిగా యైనపుడు నీ హృదయాన్ని యెట్లాంటి దివ్యసౌఖ్యానుభూతి మునకలెత్తిస్తుంది!

ఇదంతా భావించుకుంటూ డ్రెస్సింగ్ గౌనులోనే, అంగారగుప్తి (కణకణలాడే నిప్పులతో నింపి, కాళ్ళకు వెచ్చబెట్టడానికై పెట్టుకునే పెట్టె) మీద పాదాలాన్చుకుని కూర్చుని వున్నాడు, సావెల్ మహాశయుడు. నిశ్చయంగానే అతని

జీవితం పాడైపోయింది; బ్రతుకు బండలైపోయింది. పోనీ, ప్రేమంటే తానెరుగడా? అంటే, అబ్బే! తానూ ఒకప్పుడు ప్రేమించేడు. కాని, తనప్రేమను పైకివెల్లడించే ధైర్యంలేక పోయింది. తాను మరొకరికి తెలియకండా, రహస్యంగా విషాదకరంగా, నిర్లక్ష్యంగా,—యింకెందుకూ? తనస్వభావానికి అక్షరాలా అనుగుణంగానే ప్రేమించాడు. తనస్నేహితుని భార్యను, తనకు ఆమే స్నేహితురాలే,—మదాం సాద్రిస్‌ని ప్రేమించేడు. అయ్యయ్యో! తాను ఆమెని చిన్నతనంలోనే చూసివుండకూడదూ? అంతా మించిపోయేకనే తనకామె పరిచయం కలిగింది. అప్పటికామెకి పెళ్ళి ఐపోయిందాయె! కన్యగా తానామెని చూసివుంటే నిస్సందేహంగా పాణిగ్రహణం చేయమని ఆమె నర్థించి వుండేవాడు. తప్పకండా ఆ పనిచేసేవుండునులెండి. కాని...తానామె నెంత ప్రేమించేడు! ఆమెను మొట్టమొదట చూసిన క్షణాన్నుంచీ నిర్విరామంగా ఆమెను ప్రేమిస్తూనే వున్నాడు, సావెల్ మహాశయుడు.

ఎట్లాంటి యింద్రియోద్రేకమూ లేకండా తానామెనెన్నిసార్లు అనిమిషుడై చూసేడో! ఆమెను వీడ్కొని, యింటికి పోయేటప్పుడెంత దుఃఖం కలిగేదో! ఆమెనుగురించి తలపోస్తూ, కంటిమీద కునుకులేకండా యెన్ని రాత్రులు గడిపేడో! ఇవన్నీ సావెల్ జ్ఞాపకం తెచ్చుకున్నాడు.

ఇంతెందుకూ? ఆమె చాలా అందమైంది; పుష్టిగా, నిర్మోల్లాసిగా, ధవళాంగిగా వుండేదని తను యెరుగును గదా? సాద్రిస్‌ను ఆమె వరించివుండేదా? అబ్బే! అల్లా యెప్పటికీ జరిగేదికాదు! ఆమె కిప్పుడు యాభైయెనిమిదేళ్లు. ఐనా యింకా ఆమె యెప్పుడూ వుల్లాసంగానే వుంటూంది. ఆమె తననే గనక ప్రేమించి వుంటేనా! ఓహోహో! ఆమె ప్రేమ లభిస్తే తన జీవితం యెల్లావుండేదో! తన కామె యందంత ప్రేమ వుంది అంటే, ఆమెకు, మదాం సాద్రిస్‌కి మాత్రం తనమీద, సావెల్ మీద ప్రేమ కలిగివుండదూ?

ఆమెయే గనక కాస్త వూహించగలిగి వుంటేనా!... ఐతే ఆవిడ అసలుయేమీ వూహించకండానే, గ్రహించకండానే వుందా? తన్నుచూచిఐనా యేమీ గ్రహించి వుండదూ? గ్రహించేవుంటే ఆమె యేమనుకొని వుంటుందిచెప్మా? తానే గనక అడిగేసి వుంటే యేమనేదో?

ఇల్లాంటి ప్రశ్నలే సావెల్ తన్నుతాను అంతుపోకండా వేసుకున్నాడు. తనగతాన్నంతనీ సింహావలోకనం చేసుకున్నాడు. ఏ నాటివో పాతస్మృతులన్నీ తిరగేసి, సూక్ష్మవివరాలన్నీ గుర్తుకు తెచ్చుకోడానికి ప్రయత్నించేడు కూడాను.

సాద్రిస్ యింటిదగ్గర తాను గడపిన సుదీర్ఘసాయంతనములన్నిటినీ స్మృతికి దెచ్చుకున్నాడు. అప్పుడు మదాంసాద్రిస్ యావనవతి; యెంతో ఆకర్షకంగా వుండేది.

ఆమె తనతో చెప్తూవచ్చిన విషయాల నెన్నింటినో అతడు గుర్తు చేసుకున్నాడు. ఆమె తనతో మాట్లాడేటప్పుడు ప్రయోగించిన చిరునవ్వుల్లో యెంతఅర్థంవుంది! ఆమెస్వరంలోని మధురతరసూక్ష్మభేదాలో! వాటన్నిటిలోనూ యెంత విశేష ముంది, మరి! ఇవన్నీ జ్ఞాపకంచేసుకున్నాడు, సావెల్ బాబు.

స్కాడ్రిన్ దంపతులూ తానూ కలిసి సీనీ నదీతీరాల్లో వెళ్ళిన వాహ్యాళులూ, ఆదివారాల్లో పచ్చికబీళ్ళమీద లఘు భోజనాలు చేయడాలూ, అన్నీ నెమరుకు తెచ్చుకున్నాడు. సబ్-ప్రిఫెక్టు ఆఫీసులో పనిచేస్తూండే వాడా రోజుల్లో, స్కాడ్రన్. తానూ, ఆ దంపతులూ ఓ నాటి మధ్యాహ్నం నదీతీరాన చిన్నతోటలో చేసిన కాలక్షేపం హఠాత్తుగా సావెల్‌కి స్ఫుటంగా గుర్తుకొచ్చింది.

ఆ రోజున తామంతా ప్రాతఃకాలాన్నే బైలుదేరేరు, తినుబండాలు చిన్నసజ్జల్లో వేసుకుని. అది వసంతఋతువు. ఎవరికేనా మత్తెక్కించి, వుల్లాసం కలిగించే ప్రాతఃకాలవాయువులు వీస్తున్నాయి. ప్రతీదీ నవ్యంగా కనిపిస్తూంది. ఎటు జూచినా ప్రకృతిలో సౌఖ్యమే కానవస్తూంది. వాతావరణ మంతా మనోహరమైన సువాసనలతో మత్తెక్కిస్తూంది. పక్షుల కిలకిలారావాలు మరీ సంతోషంగానూ, వాటి పక్ష విక్షేపాలు మరీ చురుకుగానూ కనిపిస్తున్నాయి. నీటికి బహు సమీపంగా విల్లోవృక్షాలక్రింద పచ్చికమీద కూర్చుని ఫలహారాలు చేసేరు, బాతాఖానీ వేస్తూ. నదీజలాలు సూర్య

కిరణాల్లో మిలమిలా మెరుస్తూన్నాయి. ఆ వసంతోదయవేళ నవకందళముల పరిమళములను మోసుకొస్తూన్న గంధవహుడు పుష్కలమనోహరంగా వీస్తూన్నాడు. తామప్పుడు తాగిన మధువు యెంత రుచ్యంగా వుంది! ఆ రోజున ప్రతీదీ యెంత ఆనంద దాయకంగా వుందని!

ఫలహారాలు పూర్తైనాక సౌద్రిన్ అక్కడే పచ్చికపై వెల్లకిలా పండుకుని, కాస్సేపట్లోనే గాఢనిద్రలో మునిగేడు. ఆ తర్వాత లేచినప్పుడాతడన్నాడు, 'నేనింత మంచినిద్ర జీవితంలో యెప్పుడూ పోలేదు!'

సౌద్రిన్ నిద్రించేక మదాం సౌద్రిన్, సావెల్ చేయి పట్టుకుని, నదీతీరాన్నే షికారు బైలుదేరింది.

ఆమె ఒయ్యారంగా సావెల్ భుజంమీద ఆనుకుని నడుస్తూంది. ఉండివుండి నవ్వుతూ, అతనితో అంటూవచ్చింది: 'మిత్రమా! మేను పరవశమైపోతూంది. సొక్కిపోతున్నా, నేను!' అతని గుండెలు గుబగుబలాడేవి, ఆమెవైపు చూసేవాడు. తానామెవైపు మరీ తేరవగా చూడలేడుగదా యనీ, తన చేతులు వణకడం మనసులోని కోరికల్ని బైటపెట్టలేదు గదా యనీ ఆలోచిస్తూ, వెలవెలబోయేవాడు.

ఆమె తన కేశబంధంలో గడ్డిపూలూ, లిల్లీలూ తురుముకుని అతణ్ణి అడుగుతూంది: 'నేనిల్లావుంటే మీకునచ్చిందా?'

తనప్పుడేమీ జవాబీయనేలేదు! ఏం చేతనంటే చెప్పడానికి తనకేమీ తెలియలేదు. తానామె యెదుట మోకరించి

ప్రేమభిక్ష వేడియుండాల్సింది. కాని, అయ్యయ్యో! తనకేం వచ్చిందో?... తన మౌనాన్ని కామె పగలబడి నవ్వింది. అసంతృప్తిని సూచించే నవ్వు, అది! నవ్వు నాతని మొహాన విసరకొట్టి, 'ఓయి, త్యాగమూర్తీ! నీకేం వచ్చిందోయ్? ఆఖరికి మాటేనా ఆడలేకపోయేటందుకు!' అని అడుగుతున్నట్లుంది.

తన కేసువు వచ్చేస్తూన్నట్లు వుక్కిరి బిక్కిరైపోయి, ఒక్కమాటేనా పలకలేక పోయేడు.

ఆ విషయాలన్నీ అతని కిప్పుడు గుర్తుకు వచ్చేయి, అప్పుడే జరుగుతూన్నట్లు. అంతా కళ్ళకి కట్టినట్లే! 'ఓయి త్యాగమూర్తీ! నీకేం వచ్చిందోయ్! ఆఖరికి మాటేనా ఆడలేకపోయేటందుకు!' అనడంలో ఆమె అభిప్రాయం యేమిటి?

మరేమో, ఆమె యెంత సుతారంగా తన భుజంమీద ఆనుకుందో జ్ఞాపకం చేసుకున్నాడు. తామప్పుడు ఓ చెట్టునీడ క్రిందుగా పోతూంటే ఆమె చెవి తన చెక్కిలిని తాకినట్లయి, తాను తల చటుక్కున పక్కకి తీసుకున్నాడు. తన శరీరాన్ని అతనికి తాకించాలని ఆమె అనుకునివుండదని భావించి జంకడంవల్లనే అతనావిధంగా తప్పుకున్నాడు!

'వెనక్కి తిరిగిపోయేందుకు టైముయిపోలేదూ?' అని తానామెతో అన్నప్పుడు ఆమె విలక్షణమైన చూడ్కులతో 'తప్పకండాను!' అంటూ మళ్ళీ విచిత్రంగా చూసింది. అప్పుడు

తానేమీ ఆలోచించనే లేదు, తన తెలివి తెల్లారా! మరి, యిప్పుడుకూడా అదంతా తన కళ్ళకి కట్టినట్లుంది?

"మీ యిష్టప్రకారమే చేయవచ్చు, మిత్రమా! మీరు అలిసి పోయినట్లయితే వెళ్ళిపోదాం లెండి."

మరిన్నీ తానప్పు డేమన్నాట్ట?

"నేను అలిసి పోవడంకాదు. స్కాద్రిన్ యీ పాటికి నిద్రలేచి వుంటాడేమోనని!"

అక్కడికీ ఆమె మళ్ళా అందిగదా: "ఆయన లేచే రేమోనని మీరు భయపడుతూంటే అది వేరేవిషయం! పోనీలే, వెళ్ళిపోదాం, పదండి."

వెనుతిరిగి వెళ్ళేటప్పుడు ఆమె యేమీ మాటాడనూ లేదు, అతని భుజంమీద ఆనుకోనూ లేదు. ఔను! ఎందు చేతో?

ఆ సమయంలో అతనికి యీ ప్రశ్న, 'ఎందుచేత?' అనేది తోచనేలేదు! అల్లాంటి దిప్పుడు, యిందులో తనకు అర్థంగానిదీ, విశదంగానిదీ యేదో వుందని భయపడుతూన్నాడు.

అదేమిటి చెప్మా?

సావెల్ మొగం జేవురించింది. తనవయసు ముప్ఫైయేళ్ళే అనిపించి, గబుక్కున లేచి నిల్చున్నాడు. అంతా అతనికిప్పుడు అర్థమైంది. మదాం స్కాద్రిన్ 'నిన్ను ప్రేమిస్తున్నాను!' అని స్పష్టపరిచింది, తన హావభావాదులచేత! ఆ విషయంలో తన కిప్పుడు పూర్తిగా నమ్మకం కుదిరింది!

కాని......అది సంభవమా? సాధ్యమా? తన మనసులో ప్రవేశించుతూన్న యీ అనుమానం మళ్ళా అతణ్ణి బాధించ నారంభించింది. తాను, అప్పుడే యీ విషయాన్ని గ్రహించలేక పోవడం యెందుకు జరిగింది? స్వప్నేపి తానిది కానక పోవడం యెల్లా తటస్థించింది?

అయ్యయ్యో! ఎంతపని జరిగిపోయింది! సిరివస్తుంటే ఆహ్వానించి, అనుభవించకండా, మోకాలడ్డిన మూర్ఖుడు తనకంటె యెవడు? తన బుద్ధిమాంద్యానికి చాలా విచారించుతూన్నాడు. కాని....

'నేనా విషయం తెలుసుకోవాలి. ఈ విధంగా యింకా సందేహ సముద్రంలో పడి కొట్టుకుంటూ వుండలేనింక. ఇప్పుడే వెళ్ళి తెలుసుకుంటా!' అని తనలోతా నొక నిశ్చయానికి వచ్చేశాడు. గబగబా దుస్తులు ధరించేసి బైలుదేరేడు. 'నాకు అర్థమైరేడెళ్ళు! ఆవిడికి యీ భైయెనిమిది! ఆ విషయంలో యిప్పుడింక అడిగినా తప్పని యెవరికీ శంకించేందుకు అవకాశంలేదు. నిర్భయంగా అడగొచ్చు!' అనుకుంటూ నడుస్తూన్నాడు, సావెల్.

స్మోరిన్ యిల్లు ఆవలివీధిలో, కొసని; సరిగ్గా తమ యింటికి యెదుటి భాగంలోవుంది. గుమ్మంలోకి బోయి తలుపు తట్టేడు. పనిమనిషి వచ్చి తలుపుతీసింది. ఆమె పిట్టలాంటి చిన్నమనిషి.

"సావెల్ బాబుగారా? ఇకేమిటి బాబూ, యిప్పుడు దయచేసేరు? మరేం ప్రమాదం జరగలేదుగద?"

"లేదులే, పిల్లా! వెళ్ళి, మీ అమ్మగారితో చెప్పిరా, నేను అర్జంటుగా మాట్లాడే పనిమీద వచ్చేనని." అన్నాడు సావెల్.

"అమ్మగారండి, మరేమో, శీతకాలంకోసం పియర్ పళ్ళు పాకంపట్టి, లేహ్యం (జామ్) చేస్తున్నారండి. పొయిదగ్గ రున్నారు, అమ్మ. చిన్నబట్టకట్టుకుని వున్నారండి, బాబూ. మీకు తెలుసుగదాండి."

'ఔనులే. కాని, వెళ్ళిచెప్పిరా. అతిముఖ్యమైన పనిమీద ఆమెను చూడాలంటున్నానని."

పనిమనిషి లోపలికి వెళ్ళిపోయింది. ఉద్రేకంతో పెద్ద అంగలేస్తూ ఆ చావడిలోనే సావెల్ అటునిటు గబగబ పచారు చేస్తున్నాడు. ఐతే అతనిలో కంగారేమాత్రం గానరావడం లేదు, అబ్బే! ఇందులో కంగారు పడాల్సిందేముంది? ఆమెని యేదో ఆ సందర్భం వచ్చింది గనక చిన్నమాట అడగ దలచు కున్నాడు; అంతే! ఏదో ఫలానా పిండివంట యెల్లా చేయాలీ? అని అడుగబోయినట్లే! కాకపోతే, 'నాకు అరవైరెండేళ్ళున్నా యని తెలుసుగాదూ?' అన్నట్లు!

తలుపు తెరచుకుని మదాం సాగ్రిన్ హాల్లోకి వచ్చింది. ఆమె యిప్పుడు వస్తానులా వుంది. బలిసి గుండ్రంగా, నిండు చెక్కిళ్ళతో, కంచుమోగినట్లు మాట్లాడుతూవుండే మనిషి

పంచదారపాకం గారుతూన్న చేతులురెండూ వంటికి తగల కండా యెడంగాపెట్టుకుని వుందామె. కమీజు చేతులు చంకల్లో కంటా మడిచి వుండడంవల్ల నగ్నమైవున్న హస్తాలతో వచ్చింది. వస్తూనే ఆదుర్దాగా అడిగిందాతణ్ణి :

'ఏమండీ! ఏం జరిగిం దేమిటి? మీ కేమీ సుస్తీ చేయ లేదుగద?''

'అబ్బే! అటువంటి దేమీలేదు. గాని మిమ్మల్నో విషయం అడగాలని వచ్చేను. అది తెలుసుకోడం నాకు చాలా అవసరం. నా గుండెల్ని దహించేస్తూన్న సందర్భం అది. నా ప్రశ్నలకు దాపరికం లేకండా జవాబిస్తా నని మీరు మాట యివ్వాలి మరి.'

ఆమె నవ్వి అంది: 'నే నెప్పుడూ దాపరికంగా మాట్లా డను. ఆ సంగతేదో చెప్పండి, మరి!'

'సరే, ఐతే. నేను మిమ్మల్ని చూసిన మొదటి రోజు నుంచీ ప్రేమిస్తూనే వున్నాను. ఇందులో మీ కేమేనా సంశయం వుందా?'

జవాబుగా ఆమెతిరిగి నవ్వింది. ఈ తూరి ఆమెనవ్వులో, మాటల్లో పడుచుతనం నాటి కళా, మార్దవం కానవస్తున్నాయి:

'అయ్యో! తెం విత్సు-వా! మీ కేం పట్టుకుందండీ!... నే నా సంగతి ఆ రోజునుంచే యెరుగ దును గా దండీ.'

సానెల్ కి దడ పుట్టింది. నోటమాట తోణకడం లేదు. నత్తుతూ, 'ఐతే, మీ రెరుగుదురా?...ఐతే...' అని ఆగేడు.

'ఐతే, ఏమిటండీ?' అనడిగింది.

'ఐతే,...మీరేమని వుందురు?...నేనడిగితే యేమని, యేమని...యేమని...జవా బిచ్చేవారు?'

ఆమె ఫక్కున పగలబడి నవ్వారంభించింది. వంటికి తగలకండా యెడంగా జాచిన హస్తాలనుంచి నవ్వు అమురుకి పానకంబొట్లు తివాచీమీద పడుతూన్నాయి.

'నేనా? నే నేమనేదాన్నా?...కాని, మీరేమీ అడగందే? కోరనిదే? పిలువని పేరంటంగా నా మనసులోనిది ప్రకటించుకోవాల్సిన అవసరం నాకేముంది?'

అత డామెవైపు కింకో అడుగువేస్తూ.

''చెప్పండి, ఐతే,...మీకు జ్ఞాపకం వుందిగాదూ, ఆ రోజున జరిగింది? ఫలహారం తర్వాత సౌద్రస్ గడ్డిమీద నిద్రపోవడం, మనం నదిగట్టునే మలుపుదాకా షికారు వెళ్ళడం...''

అతిడు దేన్నో యెదురు చూస్తూ, కొంచెం ఆగేడు. ఆమె నవ్వాగి, అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది.

'ఆ! జ్ఞాపకంలేకేం! అంతా జ్ఞాపకంవుంది.''

అతిడు శరీరమంతా వణికిపోతూంటే మళ్ళీ అంటు కున్నాడు:

'మరి...ఐతే...ఆరోజున...నేనేగనక...నేను కొంచెం చొరవతీసుకొంటే......యేమైవుండేది?'

ఆమె మళ్ళా నవ్వనారంభించింది. కేవలం సుఖవంతు రాండ్రైన స్త్రీలుమాత్రమే ఆ రీతిగా నవ్వగలరు. తనకప్పుడు

పశ్చాత్తాప పడాల్సినదేమీ లేదన్నట్లు ద్యోతకమవుతూంది, ఆమె నవ్వులో. ఏ విధమైన దాపరికమూ లేకండా, పరిహాస సూచక స్వరంతో యిల్లా అన్నదామె:

'ఏమైవుండేది ? నేను లొంగివుండేదాన్ని !'

అంటూనే మదాం సొదిస్ గిరుక్కున తిరిగి వెళ్ళి పోయింది, లేహ్యం పాకం పట్టుకునేందుకు.

సావెల్ హడావుడిగా వీధిలోకి పరుగెత్తేడు. ఏదో పెద్ద ఆఘాతం తగిలిన వాడివలె తలవంచుకుని నడుస్తున్నాడు. ఆ వానలో పెద్దఅంగలతో, యెటుపోతూన్నదీ ఆలోచించకండానే, యంత్రంలాగ నదీతీరానికి నడిచిపోతూన్నాడు. నదీతీరానికి వెళ్ళేక, కుడికి తిరిగి గట్టునబడి పోనారంభించేడు. అతడి బట్ట లన్నీ తడిసి నీళ్ళు కారుతూన్నాయి. టోపీతడిసి గుడ్డపీలికలాగ కుంగిపోయి, ఒకటేధారగా కారుతూంది. సావెల్ ముక్కుకి సూటిగా నడుస్తూనే వున్నాడు. ఆఖరికి ఆ స్థలానికి వచ్చేడు. అక్కడే తామంతా ఆ రోజున ఫలహారాలు చేసినది. అప్పటి స్మృతే తనమనసు నింతసేపూ ఆక్రమించుకుని కూర్చుంది. మోడులైవున్న అక్కడి చెట్లక్రింద చతికిలబడి, గుండె చెరు వయేలా విలపించేడు, ఆ వృద్ధ బ్రహ్మచారి.



# జనకుడు

## 1

అతడు నివసించేది బటిగ్నోల్లిస్‌లోనూ, వుద్యోగం విద్యాశాఖ కార్యాలయంలోనూ గావడంచేత రోజూ ఆమ్నిబస్‌మీద పారిస్ నగరంమధ్యకి పోతూండేవాడు. అతని కెదురుగా రోజూ ఆ అమ్మాయి కూర్చుని ప్రయాణం చేసేది.

ఆమె రోజూ అదేవేళకి బైలుదేరి అదే ఆమ్నిబస్‌లో యెక్కి, తాను నౌకరీచేసే బట్టలదుకాణానికి వెడుతూంటుంది. ఆమెశరీరవర్ణం కపిలం; యీ రంగుయువతుల కున్నట్లే కళ్ళు కాటుకరంగుగా, నల్లకలువల్లా వుంటాయి. ఆమె శరీరలావణ్యంలో దంతకాంతులు ద్యోతక మవుతూంటాయి. నిత్యం ఆ సందులోనుంచే ఆమె రాక నాతడు గమనించేవాడు. భారమైన ఆ బండి నందుకునేందు కామె తరచు పరుగెత్తుకొచ్చి, గుర్రాలింకా పూర్తిగా ఆగకండానే మెట్లమీదికి దూకేది. ఆయాసపడుతూ బండిలోకి వచ్చికూర్చుని, ఒక్కసారి నలువైపులా కలయచూసేది, బేడిసల్లాంటి కళ్ళతో.

ఆమెను చూచిన మొదటిసారే ఫ్రాంకో టెస్సీర్ హృదయ మానందతరంగితమైంది. ఎప్పుడేనా ఒక్కొక్క యువతిని చూసినప్పుడు ఆమెపరిచయం లేకపోయినా వెంటనే ఆమెను హృదయానికి హత్తుకోవాలని గాఢమైన వాంఛ కలుగు

తూంటుంది. అట్టియువతి ఆశని అజ్ఞాతవాంఛల్ని, అంతరంగిక రహస్య కోరికల్ని పరిపూర్తి చేసినదన్నమాట; తన కెరుక లేకండానే తన హృదయాగాధాల్లో దాచుకొనే ఆదర్శ ప్రేమ వాంఛలు కామె జవాబన్నమాట!

అనుకోకండానే అత డామెను పరికించి చూసేడు. ఆశని చూపుల ఆమె కంగారుపడి, సిగ్గుతో యెరబ్రారింది. అది గ్రహించి, ఆతడుచూపులు మరల్చుకోవాలని యత్నించేవాడు. కాని మళ్లీమళ్లీ అతనిచూపులు ఆతని యిష్టంలేకండానే ఆమె మీద వాలేవి. అతడు మరో వైపు చూద్దామనుకుంటున్నా వినకండా అతనిచూపులు మాటిమాటికీ ఆమెమీదికే మరలు తూండేవి! కొద్ది దినాల్లోనే ఆ యువతీ యువకులు కృతపరిచయు లైనారు, యెల్లాంటి మాటామంతీ లేకండానే. ఆమ్నిబస్ నిండి వున్నపు డాతడు తన చోటామెకు యిచ్చేవాడు, ఆమెకు చోటిచ్చి బైటకు వెళ్లాల్సివచ్చినందుకు విచారించినా. ఈ ఘట్టా నికి వచ్చేసరి కామె చిరునవ్వుతో అతన్ని పలుకరించేటంతవరకూ వారి పరిచయం వృద్ధిబొందింది. అయినా అతనిచూపు పడ్డప్పు డల్లా ఆమె తనకళ్ళు వాల్చేసుకునేది. ఆతనిచూపులంత బరువుగా వుండేవో యేమో! కాని, తన వైపు ఆతడట్లు చూస్తూన్నందుకు ఆమెలో అతృప్తి కలిగినట్లేమీ లేదు!

ఆఖరికి మాట్లాడుకోవడంతో వాళ్లు యీ ప్రకరణాన్ని ముగించేరు. త్వరలోనే వాళ్లిద్దరిమధ్యా ఒకరకమైన అతిసన్ని హిత పరిచయం యేర్పడిపోయింది. రోజూ ఆ అరగంట సన్ని

హితత్వం వారిద్దర్నీ మరింత దగ్గరకు తెచ్చింది. ఆ అరగంటే ఆ 'ని జీవితమంతట్లోకీ అత్యంతసుఖప్రపూర్ణమైనదిగా తోచేది. మిగతా రోజంతా ఆ మెను తలుచుకుంటూనే గడిపేసేవాడతడు. విసుగెత్తించే ఆఫీసుగంటల్లో ఆమె విగ్రహ మాతని మనస్సులో తిష్ఠవేసుకునే కూర్చునేది. ప్రేమించినస్త్రీ మనహృదయంలో వదలే ఛాయ, యెంత తేలియాడేదైనా పట్టువీడనిదై యుంటుంది. ఆ చిన్నారి వ్యక్తిని తాను సంపూర్ణంగా పొందగలిగితే యిక జీవితమంతా అవ్యక్తానందమే! మనసుకువచ్చిన స్త్రీ తనదైతే కలిగే ఆనందానికి హద్దులుండవుగదా!

ఇప్పుడామె ప్రతీపుదయం తన కరచాలనం చేస్తోంది. ఆ స్పర్శాసుఖాన్నాతడు దినమంతా తనతో భద్రపరచుకొని, ఆమె చిన్నవేళ్ల మృదుపీడనాన్ని ఆ మరుసటిదినంవరకూ గుప్తపరచుకునేవాడు. ఆమెవ్రేళ్ల ముద్రలు తన యరచేతి భద్రంగా వున్నాయని అతడు భ్రమిసేవాడు. ఆ అర్ధగంట ఆమ్నిబస్ ప్రయాణంకోసం ఆతడు మిగతా కాలమంతా కనిపెట్టుకుని వుండేవాడు. ఆఫీసులేని ఆదివారాలాతనికి యుగాల్లా వుండేవి. ఇదిల్లా వుండగా ఆమెకూడా అతణ్ణి ప్రేమిస్తోందనడానికి సందేహంలేదు. అందుచేతనే ఆ వసంతంలో ఓ ఆదివారంనాడు తానాతనితోకూడా షికారు వెళ్లడానికి అంగీకరించింది. పారిస్ పరిసర గ్రామమైన మైజన్—లఫిట్టీకి వెళ్ళి అచ్చటి ప్రకృతి సౌందర్యశోభను చూడాలనీ, లేపచ్చికబీళ్ళపై సుఖాసీనులై అల్పాహారం తీనుకోలనీ నిశ్చయించుకున్నారా యిద్దరూ.

## 2

రైలుస్టేషన్‌కి ఆమెయే ముందుగావచ్చి వుండడం అతని కాశ్చర్యం కలిగించింది. సమీపించగానే ఆమెఅంది: 'వెళ్లే ముందు నేను మీతో మాట్లాడాలి. రైలుకింకా యిరవై నిముషా లుంది; నేను చెప్పాల్సిం దెంతోసేపు పట్టదు.'

తన చేతిలోవున్న ఆమె చేయి కంపిస్తూవుంది. ఆమె చెక్కిళ్లు తెల్లబారి, చూపులు వాలిపోయాయి. 'మీరు నా విషయంలో పొరబడకండా వుండాలని కోరుతున్నా. మీరు మాట యిస్తేనే, ఒట్టుపెట్టుకుంటే తప్ప ...... నా విషయంలో మర్యాద తప్పనని,......యేమీ చేయనని......' అంది, ధైర్యం కూడబల్కుకుని.

హఠాత్తుగా ఆమెముఖం మంకెనపూవైంది. ఇంకేమీ మాట్లాడలేకపోయింది. ఏమి జవాబీయాలో అతనికీ తోచలేదు. అతనిమనసులో ఆనందమూ, నిరుత్సాహమూ ఒకేసమయంలో కలిగినాయి. హృదయపు లోతుల్లో అల్లా జరగాలనే అతను వాంఛిస్తూండి వుండచ్చు. కాని......రాత్రి తెల్లవార్లూ రక్తం వుప్పొంగి వొళ్లు గగుర్పొడిచే వూహాలతో యేవేవో ఆకాశసౌధాలు నిర్మించుకుంటూ వచ్చేడు. ఆమె ప్రవర్తన లాఘవమైనదైతే తానామెను అంత గాఢంగా ప్రేమించగలడా? అబ్బే! కాని, ఆమె లాఘవమైనదైతే తనకెంత సులభంగానూ, సుఖంగానూ, ఆకర్షణీయంగానూ వుండేదని! సాధారణంగా అందరు పురుషులకూ సహజమైనట్లే స్వార్థపరమైన అంచనాలూ,

వ్యూహాలూ, సన్నివేశాలూ తన మనసులో ఆతడూ వేసుకున్నాడు, కల్పించుకున్నాడు.

ఆతడేమీ మాట్లాడకపోవడం చూసి, ఆమె కళ్లు చెమ్మగిలుతూంటే, ఆందోళనతో, కంఠం డగ్గుత్తికపడగా మళ్లా అంది: 'నన్ను మర్యాదగా చూస్తానని మీరు ఒప్పేసుకోకపోతే నేనింటికి తిరిగి వెళ్ళిపోతా!'

ఇంక అప్పుడాతనికి మాట్లాడక తప్పలేదు. ఆమె చేతిని మృదువుగా ఒత్తుతూ, తడబడుతూ అనేశాడు: 'మీయిష్టప్రకారమే నడుచుకుంటానని మాట యిస్తూన్నా!' ఆమె మనసులోనే తృప్తిపడినట్లు, చిరునవ్వు తెచ్చుకుని, మళ్లా అడిగింది: 'ఆమాట మీరు మనఃపూర్తిగా అంటున్నదేనా?'

'ఔను!' అన్నాడాత డామెకళ్ళల్లోకి చూస్తూ.

'ఐతే, యిప్పుడు తీసుకోండి; టిక్కెట్లు!' అందామె, అంగీకారం సూచిస్తూ.

రైలులోవారు యేమీ మాట్లాడుకోలేదు. బండినిండా జనసమ్మర్దమే. మైజన్ — లఫిట్టీ స్టేషన్‌లో దిగి, వాళ్ళిద్దరూ మౌనంగానే సీనీనదివైపు సాగేరు. సూర్యుడు నదీ జలాలమీదా పచ్చికమైదానంమీదా, చెట్లచిగుళ్ళమీదా తన కిరణజాలాన్ని బరపుతూ, తళతళ లాడిస్తూన్నాడు. వాళ్ళిద్దరూ చెట్టాపట్టాలు పట్టుకుని నది వెంబడే నడుస్తూ, వొడ్డునే యీదే చేపలగుంపులు చూస్తూ, సంతోష తరంగిత హృదయాలతో నడుస్తున్నారు. తేలికైన శరీరాలతో, పులకిత హృదయాలతో నడుస్తున్న

ఆ యువతీ యువకుల పాదాలు భూమి నంటకండా గాలిలోనే తేలియాడుతూన్నట్టుంది!

'నన్నంత మూర్ఖురాలనుకుంటారో మీరు!' అందామె చాలసేపైనాక.

'ఏం!' అన్నాడాతడు అర్థంగాక.

'ఈ విధంగా ఒంటరిగా మీతో రావడంవల్ల!'

'అబ్బే! ఎంతమాత్రం అనుకోను. ఇందులో తప్పే ముంది?'

'అఁ హఁ! కానేకాదు. ఇల్లా మీతో రావడం తప్పే. నేను కాలుజార దలచుకోలేదు, మరి. అల్లాంటప్పుడు...ఆడ పిల్లలు తప్పుచేసే దీ విధంగానే! కాని,...విసిగిపోతాఁపండీ, రోజూ ఒక్కలాగే, అదేపని చేస్తూవుంటే! రోజులూ, నెలలూ, యేళ్లూ ఒకేలాగ, ఒకేపని చేస్తూవుంటే యెంత చిరాగ్గా వుంటుందో మీకుమాత్రం తెలియదేమిటిలెండి. అమ్మా, నేనూ యింట్లో ఒంటరిగానే... పాపం, అమ్మ జీవిత మంతా కష్టాలే. ఆవిడకి జీవితంలో వుత్సాహం, సంతోషం యెక్కడివి? ఎన్ని కష్టాలున్నా లెక్కజేయకండా కులాసాగా, నవ్వుతూండా లనుకుంటూ, నేను. కాని, అస్తమానం అల్లా వుండలేక పోతున్నా...అదంతా యెల్లావున్నా, నేను యిల్లా రావడం మాత్రం తప్పేనండీ. మీకుమాత్రం వచ్చినందుకు చింత వుండదనుకోండి!'

జవాబుగా అత డామెను గాఢంగా ముద్దెట్టుకున్నాడు, చెవిమీద; అదే తనకి అందుబాటులో వుండడంవల్లనేలెండి, చెవిమీద ముద్దెట్టుకుంట! దానిమీద నామె వులికిపడ్డట్టు లేచి విదలించుకుని, కోపంగా దూరానికి పోయి అంది, 'ఛా! యిదేమి టండీ! ఒట్టు పెట్టుకునికూడ యిదేం పనండీ!' ఆపిమ్మట వా ళ్లిద్దరూ మళ్లా మైజర్-లఫిట్టేకి తిరిగిపోయేరు, కాస్త యెడం యెడంగానే నడుస్తూ.

అల్పాహారంకోసం పెటిట్-హాఁవ్రీ హోటలు ప్రవేశిం చేరు. బాగా క్రిందుగావుండే యింట్లో వుందా హోటలు. నదీ తీరాన్నే ఓ పచ్చికబీట్లో, నాలుగు బ్రహ్మాండమైన పోప్లార్ వృక్షాలకింద, పాతుకుపోయినట్లున్న యిల్లది. హోటల్‌లో వేడిగా, వుక్కగా వుంది. దగ్గరగా కూర్చోడం వాళ్లకి యిబ్బెట్టుగా వుంది. చిన్నసీసాలోని తెల్లని మద్యం వాళ్లని యెర్రబారేటట్లు చేసింది. దానితో వాళ్లు కుంగిపోయి, దిగులుగా వున్నట్లయేరు. కాని, కాఫీ పుచ్చుకున్నాక వాళ్లల్లో మళ్లా వుత్సాహం రేకెత్తి, షికారు పోదామనుకున్నారు. సీనీనది దాటి లా ఫ్రెట్టే గ్రామంవైపు, గట్టువెంబడే నడక సాగించేరు. ఉన్నట్లుండి, మౌనాన్ని భంగంచేస్తూ, అత డడిగేడు: 'మీ పే రేమిటి?'

'లూసీ' అం దామె.

'లూసీ?' అని ప్రతిధ్వనించేడు ఆతడు.

అక్కడ నది పైకడమలుపు తిరిగింది. దూరంగావున్న గ్రామంలోని యిండ్ల తెల్లని ప్రతిబింబాల్ని నదీప్రవాహం ప్రక్షాళనం చేస్తూంది. లూసీ డెయిజీపువ్వులు కోసి దండ గుచ్చుతూంది. ఫ్రాంకో మాంఛి హుషారుగా పాడ నారంభించేడు. చెంగలిబీళ్లో వదలిన కోడెదూడలా మాంఛి మస్తు మీదున్నట్లున్నాడు, ఆ యువకుడు. నదీతీరాన్నే యెడమ భాగంలోని వాలంతా ద్రాక్షతోటలతో నిండివుంది. ఉన్నట్లుండి ఫ్రాంకో విస్ఫారిత నేత్రాలతో ఆశ్చర్యంగా చూస్తూ, నిశ్చలంగా నిలబడిపోయి, 'ఓహోహో! అటు చూడండి!' అన్నాడు.

ద్రాక్షతోటలు అక్కడితో ఆఖరైపోయినాయి. ముందున్న వాలంతా విరియబూచిన లీలక్ పొదలతో నిండివుంది. అదంతా ఊదారంగుపూలతో, పెద్ద తివాచీ పరచినట్లుంది. ఈ తివాచీ అక్కడికి రెండు మైళ్లున్న గ్రామంవరకు వ్యాపించివుంది! ఆమెలోకూడా ఆ మనోహర దృశ్యం ఆశ్చర్యానందాల్ని కలిగించింది. 'ఆహాహా! ఎంత అందంగావుంది!' అని గొణుగుతూంది. వాళ్లు ఒక బీడుదాటి చిన్నకొండను సమీపించేరు. అది చిత్రమైన కొండ. పారిస్ నగరానికంతకీ లీలక్ పుష్పాల్ని సప్లయి చేసేది, ఆ కొండే! చిన్న ట్రోపుడు బండ్లమీద పువ్వులరాసులు పోసుకుని పారిస్‌లో పువ్వులమ్మే వాళ్లందరికీ యీ కొండమీంచే వస్తాయి, లీలక్ పువ్వులు!

చెట్లమధ్యగావున్న సన్నని కాలిబాట నువెళ్ళి ఖాళీజాగా చూచుకుని కూర్చున్నా రిద్దరూ.

తేనెటీగలు జుమ్మంటూ చుట్టూ యెగురుతూన్నాయి. వాటి రొద మంద్రస్థాయిలో సంగీతంలా యెడతెగకండా విని పిస్తూంది. నిర్మేఘమైన వినీలాకాశంలో ప్రకాశిస్తూన్న సూర్యుడు తన కిరణాలతో కొండవాలులమీది పుష్పకన్యలకి గిలిగింతలు పెడుతూన్నాడు. ఆ పూలసముద్రం మీంచి సౌరభ తరంగాలు లేస్తూ, పూలు విడిచే వూర్పుల్లాగ వాళ్ళ మీదికి ప్రసరిస్తూన్నాయి.

దూరాన చెర్చిగంటలు వినబడినాయి. సంకోచిస్తూనే వాళ్ళిద్దరూ మెల్లిగా ఒండొరులను కౌగలించుకున్నారు. సంకోచం తొలగి, అంతలో బిగియార కౌగిలించుకున్నారు. ముద్దులు పెట్టుకోడంగాక వారింకో సంగతే యెరుగరు. ఆమె కన్నులరమోడ్చి, రెండుచేతులతోనూ ఆతణ్ణి గుండెలకు హత్తుకుంది. ఆమెలో యుక్తాయుక్త వివేకం స్తంభించింది. తీయనికోరికలతో ఆమె శరీరమంతా భగ్గు మంటూంది. తానేమి గావిస్తూన్నదీ యెరుగకండానే తన శరీరాన్నామె అతనికి సమర్పించేసింది. కాని త్వరలోనే ఆమె ప్రకృతానికి వచ్చింది. ఏదో ఆపత్తు తటస్థించినట్లు వెక్కివెక్కి యేడుస్తూ, చేతుల్లో ముఖం దాచుకుని కుమిలిపోనారంభించింది.

ఆతడామె నూరడించ యత్నించేడు. ఆమె వూరుకోడం లేదు. ఏడుస్తూనే లేచి బైలుదేరింది, యింటికి పోడానికి. 'అయ్యో! దేవుడా! అయ్యో! దేవుడా! యెంతపని జరిగింది!' అని యేడుస్తూ, ఒక్కక్షణమేనా నిలబడకండా బైలుదేరింది.

'లూసీ! లూసీ! ఇక్కడ కాస్సేపు ఆగుదాం. ఉండవ్?' అంటున్నా ఆమె వినిపించుకోడంలేదు. ఆమెముఖం యెర్రబడి పోయింది; కళ్ళు లోతుకుపోయినాయి. పారిస్ రైలుస్టేషన్ చేరేక, వెడుతున్నా ననేనా అతనితో చెప్పకండా వెళ్ళి పోయింది.

## 3

మరునాడు ఆమ్నిబస్‌లో ఆతడామెను కలుసుకున్నపుడు చాల మారిపోయినట్లూ, చిక్కిపోయినట్లూ కనిపించింది. ఆతనితో మెల్లగాఅంది, 'నేను మీతో మాట్లాడాలి. బౌలి వార్డు దగ్గర దిగిపోదాం.'

ఇద్దరూ దిగి, పేవుమెంటుమీాద నిలబడగానే ఆమే మళ్ళా అంది: 'మనం యింక కలుసుకోకూడదు. ఒకరొకరినుంచి దూరంగా వుండాలి. ఆ సంఘటన జరిగేక యింక మిమ్మల్ని కలుసుకుంటూాండ జాలను.'

'ఏమి? ఎందుచేత?' అనడిగేడు.

'కలుసుకోలేను. అంతే. నేను అపరాధినైనా. మళ్ళీ పొరబడ దలచుకోలేదు. ఇంకెందుచేత?'

ఆతడామెను బ్రతిమాలేడు. ఇంద్రియవాంఛ లాతణ్ణి పూర్తిగా బానిసను చేసినాయి. ఆమెను పూర్తిగా తనదాన్నిగా చేసుకోవాలనే కోరికతో అతను దహించుకు పోతున్నాడు.

ప్రేమసముద్రంలో మునిగి తేలుతూ రాత్రిలను క్షణాలుగా గడసాలని ఆత ఉవ్విళ్ళూరుతూన్నాడు. కాని, ఆమె నిశ్చలంగా జవాబిచ్చింది: 'అబ్బే! నేనురాను. మనం కలుసుకోకూడదు.'

అత డంతకంతకి మరింతగా వుద్రిక్తుడవుతూ, ఆఖరికి పెళ్ళి చేసుకుందామనికూడా అనేశాడు. కాని, ఆమె నిరాకరించి వెళ్ళిపోయింది.

ఒకవారం వరకూ తిరిగి ఆమె కనబడలేదు. ఆమె వునికి ఆతనికి తెలియదు. ఇంక ఆమెను కలుసుకోలేనని నిరాశ చేసుకున్నాడు. తొమ్మిదోరోజున అతని యింటిగంట నెవరో మోగించేరు. ఎవరోనని తలుపు తెరచి చూస్తే, ఆమె! ఆమె ఆతనిచేతుల్లో వాలింది. ఆమె యింకే అభ్యంతరం చెప్పలేదు. మూడు నెలలవరకూ వారిద్దరూ ఆనందసముద్రంలో విహరించేరు. క్రమంగా ఆమెయందాతనికి మోజు తగ్గ నారంభించింది. స్త్రీల కమూల్యమైన రహస్యం వుందే, దాని నా సమయంలోనే ఆతనితో ఆమె చెప్పింది. సరే, యింకేం, ఆమెను యెల్లాగో ఒకలాగ వదలివేయాలని అతడు నిశ్చయించుకున్నాడు. కాని, అదెల్లా చేయాలో, యెల్లా ప్రారంభించాలో కూడ అతనికి తెలియడంలేదు.

ఆ కంగారులో ఆతడు తెగించి ఓ నిశ్చయానికి వచ్చేసి, ఒకరాత్రి బస మార్చేసి హఠాత్తుగా మాయమై పోయేడు.

ఈ దెబ్బతో ఆమెకి దిమ్మతిరిగిపోయింది. తన్నీరీతిగా మోసగించి వదలేసిన పురుషుణ్ణి ఆన్వేషించలే దామె. తల్లి

పాదాల మీాద పడి యేడ్చింది. తన దురదృష్టాన్ని చెప్పకుని క్షమించమంది. కన్నతల్లి క్షమించకేమి చేయగలదు? కొద్దినెల ల్లోనే ఆమెకొక మగబిడ్డ కలిగేడు.

## 4

ఒక్కొక్కటే వసంతాలు గడిచిపోతూన్నాయి. ఫ్రాంకో జెస్సీర్ వయోధికు. ఆ కాలమంతట్లోనూ అతనిజీవితంలో పెద్దమార్పు లేవీ కలుగనేలేదు. సాధారణంగా అందరు వుద్యో గులవలెనే నిరుత్సాహకరమై, పీడకలలాంటి జీవితాన్ని గడ పుతూ, యేలాంటి ఆశలూ, ఆశయాలూ లేకండానే వుండి పోయేడు. ప్రతిరోజూ అదేవేళకి నిద్రలేవడం, అదేమాదిరి భోజనం చేయడం, అవే పరిచితమైన వీధులమ్మట బడి పోవడం, అదే గేటులోంచి వెళ్ళి, ఆ బంట్రోతు వందనాన్నే మొక్కు-తీర్చుకున్నట్లుగా అందుకోడం, ఆ ఆఫీసులోనే, ఆ కుర్చీలోనే కూర్చుని, అదేమాదిరి పనినే చేస్తూన్నాడు, యీా సంవత్సరా లన్నీ. తోటివుద్యోగులమధ్య నుంటూన్నా ఆతడు రోజంతా కూడా ఒంటరితనాన్నే అనుభవించేవాడు. రాత్రిళ్ళు తన గదిలో యెల్లాగా ఒంటరిగాడేగదా. ఈ విధంగా యేకాకి జీవితాన్ని గడపుతూ, ముసలితనంలో వుపయోగిస్తుందని నెలకో నూరుఫ్రాంకులు వేరే భద్రపరచుకునేవాడు, జెస్సీర్.

ప్రతి ఆదివారం ఛాంప్స్ ఎలిసీస్‌కు వెళ్ళి, షికారుకి వచ్చిన అందమైన స్త్రీలనూ, సంపన్నులనూ, వాహనాలనూ

చూస్తూండేవాడు. మరునాడు మిత్రులతో పిచ్చాపాటీ మాటాడుతూ 'నిన్న బాయ్ డీ బొలోన్ నుంచి తిరిగివచ్చిన శకటాలు యెంతశోభగా వున్నా యనుకున్నారు! చూడని వాళ్ళవి కళ్ళుగాదోయ్!' అనేవాడు. అప్పుడప్పుడు ఆదివారాల్లో పార్కులకూ వెళ్ళేవాడు. ఒక ఆదివారం ప్రాతఃకాలం, వాతావరణం చాలాబాగావుంది. ఆ రోజున మోస్యూ పార్కుకు వెళ్ళేడు. బాటలపక్క పచ్చికమీద తల్లులూ, దాదులూ కూర్చుని, ఆడుకుంటూన్న పిల్లల్ని చూస్తూ ఆనందిస్తూన్నారు. హఠాత్తుగా ఒస్సీర్ దృష్టి ఒక స్త్రీ మీదపడింది. ఆమె చెరోచేతా యిద్దరుపిల్లల్ని నడిపించు కెడుతూంది. చూడ్డంతోనే ఒస్సీర్ వులిక్కిపడ్డాడు. వెళ్ళేది ఆమే! ఆమె కుడిచేయి పట్టుకు నడుస్తూన్న పిల్లవానికి పదేళ్ళుంటాయి, రెండో చేయి పట్టుకున్న పిల్లకి నాలుగేండ్లు.

అతనికి గాభరా బైలుదేరింది. ఎల్లాగో కొంచెం దూరం నడిచి, భావోద్రేకంతో వుక్కిరిబిక్కిరవుతూ ఓ బెంచీ మీద కూలబడిపోయేడు. ఆమె తనను గుర్తించలేదు! అంచేత ఆమెను మళ్ళా చూద్దామనుకుని తిరిగి సమీపించేడు. ఇప్పుడామె కూర్చునివుంది. ఆ పిల్లవాడు ప్రశాంతంగా ఆమెప్రక్క నిల్చుని దేన్నో చూస్తున్నాడు. చిన్నపిల్ల యిసుకలో బొమ్మరిండ్లు కడుతూంది. ఆమెయే! నిశ్చయంగా ఆమె! కాని...యీమెలో గౌరవకుటుంబపు స్త్రీలలో వుండే గాంభీర్యత కానవస్తూందే! ఆమె దుస్తులుమాత్రం నిరాడంబరంగా వున్నాయి. ఆత్మసంయ

మనంగలదానికివలె, మాంచి గౌరవనీయురాలివలె వున్నదామె. దగ్గరికివెళ్ళే సాహసం లేక దూరాన్నుంచే ఆమెను చూస్తూన్నాడు, జెస్సీర్. అంతలో ఆ పిల్లవాడు తలెత్తిచూసేడు. జెస్సీర్ ఆపాదమస్తకం వణికిపోయేడు. ఆ బాలుడు తన ఔరసుడే! అందులో సందేహమేమీ లేదు. తన చిన్ననాటి ఫోటోగ్రాఫులో తాను చూసిన పోలికలన్నీ ఆ పిల్లవానిలో అచ్చుగుద్దినట్లున్నాయి! ఆమె బైలుదేరేదాకావుండి, వెంబడించుదామనుకుని జెస్సీర్ ఓ పొదరింటిచాటున కూర్చున్నాడు.

ఆ రాత్రంతా అతనికంటిమీద కూర్కు లేదు. ఆ బాలుని గూర్చిన తలంపే అతణ్ణి మరీ వేధిస్తూంది, గుండెల్లో గాలమై. తన కుమారుడు, అయ్యో!...తానా విషయం యిదమిత్థమని తెలుసుకో కలిగితే? ఆ విషయం నిశ్చయమైతేనా! కాని, తానేం చేయాలి? చేయగలడు?...ఆమె అదివరలో కాపురముండిన యింటికెళ్ళి, ఆమె భోగట్టా అడిగేడు. అప్పటి ఆమె దుఃఖావస్థ చూచి, నీతివంతుడైన పొరుగుపెద్దమనిషి ఆమెను పెండ్లియాడేడని తెలిసింది. ఆయన చాల గౌరవకుటుంబీకుడూ, ధనికుడూకూడను. ఆమె గావించిన తప్పు తెలిసికొనే ఆమెని పెండ్లియాడేడట, ఆయన! ఆమె పిల్లవాణ్ణికూడా, జెస్సీర్ ఔరసుణ్ణి!—ఆయన తన స్వీయునిగా స్వీకరించేడు!

అదిమొదలు జెస్సీర్ ప్రతి ఆదివారం మోన్సూ పార్కుకి వెడుతూండేవాడు. వెళ్ళినప్పుడల్లా ఆమెనుచూస్తూండే

వాడు. అంతకంత కాతని మనసులో ఆ పిల్లవాణ్ణి గుర్చిచ్చి యెత్తి కౌగలించుకోవాలనీ, తనివితీరా ముద్దులతో ముంచెత్తాలనీ, దొంగతనంగానైనా యెత్తుకుపోవాలనీ తీవ్రమైన కోరిక, ఆరాటం పెంపొందుతూ వచ్చింది.

తనయేకాకిత్వం, అవివాహితత్వం పీడగా తోచి, కుములనారంభించేడు. తనంటే యెవరికి గావాలి, యీ లోకంలో? ఎవరికి పట్టింది, తనంటే? ఇలాంటి మానసికదైన్యంలో అతడు భయంకరయాతన పడిపోతున్నాడు. పశ్చాత్తాపంలో పితృప్రేమ కట్టలు తెంచుకుని వుబికిం దాతనిలో. వాంఛ, అసూయ, పశ్చాత్తాపం,—యివన్నీ అతణ్ణి దహించేస్తున్నాయి. తన సంతానాన్ని ప్రేమించాల్సిన అవసరాన్ని ప్రకృతి ప్రతిప్రాణిలోనూ నిక్షేపించింది. అతడు యెల్లాగైనా ప్రయత్నించి, ఆ పిల్లవాణ్ణి ముద్దెట్టుకోవాలని నిశ్చయించేడు. ఒకరోజున ఆమె పార్కులో ప్రవేశిస్తూంటే ఆతడు దారిలో నిల్చుని, వెలవెలబోతూ వణుకుతూ అన్నాడు: 'నన్ను గుర్తించలేదు?' ఆమె కన్నెత్తిచూసి, గుర్తించింది. భయభీతులతో త్వరత్వరగా ఆపిల్లలిద్దర్నీ తనవెంట యీడ్చుకుంటూ పరుగెత్తిపోయింది. అతడు విన్నదనంతో యింటికిబోయి, వూరటలేక చాలసేపు విలపిస్తూనే వున్నాడు.

నెలలు గడిచినాయి, కాని ఆమె కనబడలేదు. పశ్చాత్తాపం ఆతణ్ణి నిర్విరామంగా దహిస్తూనేవుంది. పితృప్రేమ ఆతని మనస్సు నాక్రమించుకుని, వూరట కలుగనీయడంలేదు. కొడుకు నొక్కసారి ముద్దాడగలిగితే సంతోషంగా ప్రాణాలు

వదలగలిగేవా ణ్ణనుకునేవాడు. కొడుకును కౌగలించుకోడానికి యే కష్టకార్యానికైనా సంసిద్ధుడే, యే ప్రమాదాన్నయినా యెదుర్కోడానికీ వెనుదీయడు, ఆతడు. ఆమెకి జాబు వ్రాసేడు, కాని జవాబు లేదు. ఇరవై వుత్తరాలు రాసినా లాభం లేకపో యింది. ఇక ఆమె నిశ్చయాన్ని సడలించడం అసాధ్యమను కున్నాడు, జెస్సీక్. తెగింపు కలిగింది. ఆమె భర్తకే, ఆ పెద్ద మనిషికే జాబురాయాలని సంకల్పంకలిగింది, అతని మనసులో. 'అంతగా వస్తే పిస్తోలుదెబ్బ తిండానికైనా సంసిద్ధుణ్ణే!' అను కున్నాడు. నాలుగుమాటల్లో జాబురాసేడు.

'మాన్సూర్ !

నాపేరు తలుచుకుంటేనే మీకు యెంతో అసహ్యం కలుగవచ్చు. కాని, నే నిప్పుడెంతో పశ్చాత్తాపపడుతూన్నాను. దుఃఖసముద్రంలో మునిగిపోనున్న నాకు మీరొక్కరే ఆధా రంగా కనబడుటచే యీ జాబు వ్రాస్తున్నా. ఒక్క ఐదేనిము షాలు మాట్లాడ్డానికి అవకాశ మీయ ప్రార్థన.

చిత్తగించవలెను,

ఫ్రాంకో జెస్సీర్.'

దీనికి మరునాడే జవాబు వచ్చింది.

'మాన్సూర్ !

రేపు మంగళవారం సాయంత్రం ఐదుగంటలకి మీకోసం యెదురు చూస్తూంటా.'

204

# 5

మేడ మెట్లెక్కుతూంటే జెస్సీర్ గుండెలు గుబగుబలాడిపోతున్నాయి. ఎన్నోసార్లు ఆగాల్సివచ్చింది. అతనిగుండెల్లో గుర్రాలు పరుగెత్తినట్లు దబదిబమని చప్పుడు బైలుదేరింది. అతికష్టంమీద వూపిరి తీయగలుగుతూన్నాడు; పడిపోకండా బిరికీలు పట్టుకొని యెన్నోసార్లు ఆపుకున్నాడు.

మూడో అంతస్థు మీదకు వెళ్ళి గంట మోగించేడు. దాది వచ్చి తలుపు తెరిచింది. అతడు తడబడుతూ అడిగేడు: 'మాన్సూర్ ఫ్లామెల్ యిక్కడేనా వుండేది?'

'ఔనండి, అయ్యా! లోపలికి రాండి!'

అతడు హాల్లోకి వెళ్ళికూర్చున్నాడు. ఒంటరిగానే యేదో మహాపదలో వున్నట్లు నిశ్చేష్టుడై వేచియున్నాడు. కొంచెం సేపట్లో ప్రక్కద్వారం తెరచుకుని, పొడవరీ, గంభీరుడూనైన పురుషుడొకడు లోనికి వచ్చేడు. అతడు పుష్టిగా, నల్లని ఫ్రాకు కోటు ధరించివున్నాడు. వస్తూనే జెస్సీర్‌ను కూర్చోమని ఓ కుర్చీని చూపించేడు, ఆయన. జెస్సీర సంభ్రమంగా కూర్చుని, కంగారు పడుతూన్నట్లు ప్రారంభించేడు.

'మాన్సూర్!......నావిషయం తమకు తెలుసునో లేదో...నాపేరే...మీకు తెలుసునను...'

అతని మాటకి అడ్డొచ్చి, మధ్యలోనే ఫ్లామెల్ అన్నాడు:

'అయ్యా! మీరు నాకేమీ చెప్పకండానే అంతా తెలుసుకున్నా. నాభార్య మీ విషయం నాతో చెప్పింది.'

ఆతని మాటలు ఖండితంగా వున్నా మర్యాదగానూ, గంభీరంగానూ వున్నాయి. అత డెంతో వుత్తముడనీ, గౌరవ నీయుడనీ సహజంగానే తెలుస్తూంది. ఆెస్సీర్‌కి మనసుకుదుట బడింది. 'అయ్యా! నేను చెప్పదలచిన దిది. పశ్చాత్తాపంతో, సిగ్గుతో, దుఃఖంతో చచ్చిపోతూన్నాను. ఒక్కసారి పిల్లవాణ్ణి చూస్తాను. కేవలం ఒక్కసారే! చాలు.'

మాన్స్యూర్ శ్లామెల్ గంట మ్రోగించేడు. దాది ప్రవే శించగానే 'వెళ్ళి, లూయీని తీసుకురా.' అన్నాడు. ఆమె వెళ్ళిపోయేక వారిద్దరూ ముఖాముఖిగా మౌనంగా కూర్చు న్నారు, నిరీక్షిస్తూ. హఠాత్తుగా పదేళ్ళపిల్లవాడు లోనికి జొరబడి, తనతండ్రిగా భావిస్తూన్న పురుషుని దగ్గిరికి పరుగెత్తు కెళ్ళి, నూతన వ్యక్తిని చూసి చటుక్కున నిలబడిపోయేడు. శ్లామెల్ ఆబాలుని జేరదీసి, ముద్దెట్టుకుని, 'నాయనా! ఆయన దగ్గరకివెళ్ళి ఒక్కసారి ముద్దెట్టుకొనిరా.' అన్నాడు. ఆ బాలుడు ముద్దొస్తూ నడిచి వెళ్ళేడు, ఆెస్సీర్ దగ్గిరికి. ఆయన్నిచూస్తూ, సంకోచంగా నిల్చునివున్నాడు, ఆ బాలుడు.

ఆెస్సీర్ లేచినిల్చుని, చేతిలోవున్న టోపీని జారవిడిచేడు. పుత్రుని చూస్తూ, తనుకూడా పడిపోతాడా? అన్నట్లుందాతని వైఖరి. శ్లామెల్ ముఖం తిప్పేసుకుని, కిటికీలోంచి బైటికి చూస్తూన్నట్లు నటిస్తూన్నాడు, మర్యాదకోసం.

ఆ బాలుడు ఆశ్చర్యంతో చూస్తూ నిలబడిపోయేడు. కాని అంతలో క్రిందపడిన టోపీని తీసి, ఆ పెద్దమనిషి చేతికి

అందిచ్చేడు. అప్పుడు మెస్సీర్ ఆ బాలుని యెత్తుకుని వుద్రేకంతో మొరటుగా ముద్దెట్టుకో నారంభించేడు. ముద్దులు వర్షంలా ముఖం, కళ్లు, నోరు, చెక్కిళ్ళు, జుట్టు, ఒకటేమిటి? అందిన చోట్లనల్లా కురుస్తూంటే ఆ బాలుడు బెదిరిపోయి, తలత్రిప్పు కుని చేతులు అడ్డం పెట్టుకుంటూ, చిన్నచేతులతో మెస్సీర్ ముఖాన్ని దూరంగా త్రోసేస్తూన్నాడు. ఉన్నట్లుండి మెస్సీర్ ఆ బాలుని క్రింద దించేసి, 'సెలవు!' అని కేకేసి, దొంగవలె ఆ గదిలోంచి ఒక్కవురుకున బైటికి వెళ్ళిపోయేడు.

# గొడుగు

మదాం ఓరెల్లీ చాలపొదుపరి. ప్రతిపైసవిలువా ఆమెకి బాగా తెలుసు. ధనం వృద్ధిపొందడంలోగల సూత్రాలన్నీ ఆమె నాలుకచివరే వుంటాయి, అర్థశాస్త్రం చదువుకున్నది గాక పోయినా. అందుచేత యింటినౌకర్లు నిత్యం బజారువెచ్చాల్లో కొసరుగా మిగుల్చుకునే కానులు,—వాళ్ళు వాటినే 'కొసరు డబ్బులు' అంటారులెండి,— వాళ్ళింటి వంటమనిషికి లభించేవి గావు. ఇంతెందుకు మాన్స్యూర్ ఓరెల్లీ సాదరుకి పావలా డబ్బులుకూడ వుండేవికావనుకోండి! వాళ్ళ సంసారం కాస్త జరుగుబాటుగలదే, కానైతే. పైగా వాళ్ళకి పిల్లాపీచూ లేరు

కూడాను. ఏ లోటూ లేకున్నా మదాం ఓరెల్లీకి ఒక్క కానీ ఖర్చుచేయడమంటే గిట్టదు. అది ఆమె స్వభావం. పెట్టెలోంచి రూపాయి తీయాల్సివచ్చినపుడామె రక్తం ధారపోస్తున్నట్లే బాధపడిపోతుంది. ఎంతో అవసరం వచ్చి, నాలుగుడబ్బులు ఖర్చు చేయాల్సివచ్చిన రోజున ఆమెకి నిద్రపట్టేదికాదు.

మాన్సూర్ ఓరెల్లీ భార్యతో తరచు అంటూండేవాడు: 'నిజానికి నువ్వింకా వుదారంగా వుండొచ్చు? మనకి పిల్లలు లేరాయె! ఆస్తి బోలెడున్నా, రాబడే మిగులుతున్నా యిదేం ఖర్మం?'

'ఆఁ! పోదురూ! ఏమో, ఏం జరుగుతుందో యెవరు చూడొచ్చేరంటా? ఉన్నప్పుడు దూబరా చేసుకుని, తీరా అవసరం వచ్చినపుడు తెల్లమొగం వేసుకోడం మంచిదంటారా? కావలసినదానికంటె కాస్త అధికంగానే వున్నందువల్ల ప్రమాదం యేమీ వుండదులెండి!' అనేదామె. దానికి జవాబు చెప్పలేక వూరుకునేవాడు, ఆయన.

మదాం ఓరెల్లీకి నలభై యేళ్ళుంటాయి. పిట్టలాంటి మనిషి. ఎంతో శుచిగా, శుభ్రంగావుంటుంది. కాని ముఖం కాస్త ముడుదలుబడినట్లూ, వాడినట్లూ వుంటుంది. చురుకైనదేగాని తొందరమనిషీ, శీఘ్రకోపి అనిచెప్పాలి. తన్నామె పెట్టే యిబ్బందుల్నిగూర్చి మాన్సూర్ ఓరెల్లీ యెప్పుడూ సణుగుతూనే వుండేవాడు. కాని యేమీ చేయలేక పోయేవాడు. తన ఆడంబరాన్నీ, బడాయినీ చాటుకోడానికి అవకాశం లేనందున ఆమె

పెట్టే కఠిననియమాలు కొన్ని ఆయనికి మరీ బాధాకరంగా వుంటూాండేవి.

ఓరెల్లీ వుద్యోగం యుద్ధశాఖ కార్యాలయంలో. అప్పర్ డివిజన్ గుమాస్తా, ఆతడు. తనభార్య బలవంతంవల్లనే ఆతడీ నౌఖరీ చేస్తున్నాడు, అసలు. వాళ్ళస్థిరాస్తిమీాది రాబడే వాళ్ళ కుటుంబానికి యెక్కీ-తక్కీను. ఐనా ఆవిడ శతపోరి, భర్తచేత ఆ నౌకరీ చేయిస్తూంది, వచ్చేడబ్బు వూరికే పోగొట్టుకోడం యెందుకని !

అప్పటికి రెండేళ్ళ పైచిలుకునుంచీ ఆ పాతగొడుగు తోనే ఆతడు ఆఫీసుకు వెడుతూన్నాడు. దాన్నిండా బోలెడు మాసికలున్నాయనుకోండి. ఆఫీసుపనితో విసిగెత్తిపోయివున్న గుమాస్తాలందరికీ యీా గొడుగే కాస్త వినోదం కలిగించేది. అంతా చేసే వేళాకోళాలకి అతడు విసిగిపోయి, కొత్తగొడుగు కొనిస్తేనేగాని వల్లగాదంటూా భార్యదగ్గిర మారాం మొదలెట్టేడు. పెద్దపెద్దకంపెనీలు ప్రచారార్థమై అమ్మే చౌకరకం వస్తువులుంటాయిగదా ! ఆ మాదిరి చౌకగొడు గొకటి ఎనిమిదిన్నరఫ్రాంకులికి కొని యిచ్చిందామె, భర్తపోరుపడలేక.

పారిస్‌లో వేలాదిగా ప్రతిచోటూా విక్రయించబడే యీా చౌకగొడుగును చూాసి, ఆఫీసులోవాళ్ళు పళ్ళామరింత వేళాకోళాలు ఆరంభించేరు. ఓరెల్లీకి యిది భరించరానిదై పోయింది. ఈ గొడుగును చూాసేటప్పటికి వాళ్ళల్లో ఒకడికి కవితావేశం కలిగి ఓ గీతంకూడ అల్లేడు ! బ్రహ్మాండమైన

ఆ భవనం అంతా ప్రతియూ స్తయూనాలు యెక్కడనూ పైనా యీ గీతం మారుమోగుతూండేది.

ఓ కెల్లీకి యీసారి మహాచెడ్డకోపం వచ్చేసింది. సరా సరిగా యింటికెళ్ళి భార్యకి నోటీసిచ్చేశాడు; తనకి ఓ సరికొత్త గొడుగు, సిల్కుది, మాంఛి ఖరీదైనది, యిరవై షాల్లింగులకి కొనియిస్తే తప్ప ఆఫీసులో మళ్ళా అడుగుపెట్టనని. పైగా అది అంత ఖరీదుదని తనకి నమ్మకం కలిగేందుకు బిల్లుకూడా పట్టుకు రావాలని షరతు పెట్టేడు!

ఆమె బజారుకెళ్ళి పద్దెనిమిది షాల్లింగులకు గొడుగునొక దాన్ని కొని తెచ్చింది. భర్తకి గొడుగు నందిస్తూ, మొహం జేవురించగా, ఖండితంగా చెప్పింది:

'ఈ గొడుగుతో కనీసం ఐదేళ్ళు గడుపుకోవచ్చు!'

ఓ కెల్లీకి యేనుగు నెక్కినట్లుంది. ఆతని యీ విజయానికి ఆఫీసులో నిజంగానే చిన్న స్వాగతం లాంటిదికూడా లభించింది! అతడా సాయంకాలంయింటికి వెళ్ళేక, ఆమె గొడుగును చూస్తూ, బాధగా,—

'అదేమిటండీ, రబ్బరుత్రాడుతో అంత బిగించి కడితే యెల్లాగండీ? సిల్కుగుడ్డకూడాను? దాన్ని కోసేస్తుందేమో! జాగ్రత్తగా వాడుకోమని చెప్పేను కాదూ? మళ్ళా యింతలో యింకో గొడుగు కొనియిమ్మంటే యిచ్చేదాన్నిగాదు!'

అంటూ గొడుగు తీసికొని విప్పి చూసి ప్రాణ్పడి పోయింది. కోపాశ్చర్యములతో ఆమె మొగం వెల్లనైంది.

గుడ్డలో అర్ధణాకాసంత చిల్లి, చుట్టతో కాల్చినట్లు కనిపిస్తూంది. కొంప అంటుకున్నట్లు ఆమె అరిచింది :

'అయ్యయ్యో! ఏమిటిది ?'

ఆమెభర్త అటు చూడకండానే ప్రశాంతంగా జవాబిచ్చేడు :

'ఏమిటది ? అల్లా అరుస్తావెందుకూ ?'

కోపావేశంతో ఆమెకి గుక్కతిరగడంలేదు. నోటమాట పెగిలిరావడంలేదు.

'మీ...మీరు...ది...ది...దీన్ని తగులబెట్టేరు! నిక్షేపంలాంటి గొడుగు! మీకు పిచ్చెత్తింది! సంసారం దిబ్బ చేసేటట్లున్నారు!'

అతడు భయపడిపోయి, కంగారుగా తిరిగిచూసేడు:

'ఏమిటి నువ్వనేది? నేనేం చేసేను ?'

'గొడుగు తగలబెట్టేరు! ఇదుగో? చూడండి!......'

అంటూ కొట్టబోయినట్లు గొడుగుతో అతనిమీదికి దూకి, గొడుగుగుడ్డలోని చిల్లి నాతని ముఖంమీద పెట్టింది. ఆ దృశ్యం చూసి, పరమాశ్చర్యంతో విభ్రాంతుడైపోయి, తడబడుతూ,—

'ఏమిటిది ? నాకేం తెలుసు ? నేనేం యెరుగను! ఒట్టు! ఇదెల్లా జరిగిందో నాకేమీ తెలియదు!' అన్నాడు.

'ఆఫీసులో చేసేపని యిదేననుకుంటా ? గొడుగు అందరికీ ప్రదర్శిస్తూ, తమాషా చూపుతున్నారేం? బడాయి చాటుకుంటూ ?' అంటూ కంయ్యిమంది.

'ఒక్కసారే నేను గొడుగు విప్పింది! ఇంకెంతమందిదో అందర్నీ ఓ మాటు చూడనిచ్చేనంతే! ఒట్టు!'

క్రోధంతో ఆమె వణికిపోతూంది, నానా హంగామా చేస్తూంది. గృహజీవితంలోని యే దృశ్యాన్ని చూడ్డానికి పురుషుడు, అందులోనూ శాంతస్వభావం గలవాడు, భయపడి పోతాడో అల్లాంటి దృశ్యాన్ని అటుకుగింజలాంటి ఆ యబల కనబరచింది. తుపాకిగుళ్ళు రైరై మంటూ వర్షంలా ముసురుకొనే యుద్ధరంగంలోకూడా భయపడని మగాళ్లు యింట్లో ఆడదాని ఆగడానికి బెదరడం విచిత్రంగదా!

సరే, ఆమె కొంచెం చల్లబడ్డాక, పాతగొడుగు గుడ్డలోంచి చిన్నముక్క తీసి, కొత్తగొడుగు చిల్లికి టాకీవేసి బాగుచేసింది. కాని యీ రెండింటిరంగూ భేదించడంవల్ల వెక్కిరించి చూపినట్లు కనిపిస్తూంది. ఈ గొడుగుతో మరునాడు ఓరెల్లీ వినీతుడయ్యే వెళ్ళేడు, ఆఫీసుకు. వెళ్ళీవెళ్ళడంతోనే గొడుగు నొకమూల కబోర్డులో పెట్టేసి, యేదో పీడకలనువలె దాన్నిగూర్చి మరిచిపోవడానికే యత్నించేడు, ఆ రోజంతా.

కాని, యింటికి వెళ్ళేటప్పుడైనా గొడుగు పట్టుకెళ్ళక తప్పదుగదా. ఇల్లు చేరడంతోటే గృహిణి అతని చేతిలోంచి గొడుగు నందుకుని, తెరచి చూసింది, పరీక్షగా. దాని దుస్థితి చూడ్డంతోటే ఆవిడ మూర్ఛబోయినంత పనైంది. గుడ్డనిండా రంధ్రాలే! చిన్నచిన్న చిల్లులు, బాగుచేయ వీలుగానట్టివి! ఎవడో పైపు కాలుస్తూ, దానిలో మండే పొగాకు పొడిని

యీ గొడుగుమీద పోసినట్లుంది! అబ్బే! ఇదింక యెందుకూ పనికిరాదు. ఐపోయింది, దీని పని.

గొడుగువైపు చూస్తూంటే ఆమె నోటమాట రాలేదు. తామసంవల్ల ఆమె వుక్కిరి బిక్కిరై పోతూంది. జరిగిన నష్టాన్ని చూచి, ఆతడుకూడా యేమీ మాటాడలేక, భయవిస్మయాలతో నిశ్చేష్టుడై వూరుకున్నాడు.

వారొకరి నొకరు చూసుకున్నారు. కాని జంకుతో ఆతడు తన చూపులు మళ్ళించేసుకున్నాడు. మరుక్షణంలో ఆమె ఆ గొడుగు నాతని ముఖంమీదికి విసరివైచింది. బహు తీవ్రమైన కోపోద్రేకాలతో ఆమె గొంతు పట్టు సడలింది. దానితో బిగ్గరగా అరుపులూ, తిట్లూ కురిపించ నారంభించింది:

'అయ్యో! త్వాష్ట్రమా!...చెయ్యాలనే చేసేవు... నీ చేతులు విరగా!...పశువు! ప్రతిఫలం ముట్టచెపుతాలే, తొందరపడకు! నేను మళ్లా గొడుగు కొంటే చూద్దువుగానిలే! దరిద్రపు మొహం!...'

ఇదే ప్రదర్శనం తిరిగి తిరిగి ఆవృత్తమై, తుఫాను గంటకుపైగా వీచింది. అప్పటి కాతనికి తన పరిస్థితి వెల్లడి చేసుకొనే అవకాశం కలిగింది. ఇదంతా యెల్లా జరిగిందో తన కర్థం గావడం లేదనిన్నీ, అసూయ వల్లనో, యేడిపించ డానికో యెవరో యీ పాడుపని చేసివుంటా రనిన్నీ ఆ వుద్యోగస్థుడు భార్యామణితో మొరపెట్టు కున్నాడు.

అంతలోనే బైట గంట మోగడంవల్ల, ఆ గండం గడిచి బైటపడ్డాడు. ఆ నాడు తా మాహ్వానించిన కుటుంబ మిత్రుడు వచ్చి చేరినందున ఆమె కోపం కాస్సేపు తప్పనిసరిగా మర్యాదకోసం కట్టుబాటు చేసుకోవలసి వచ్చింది.

ఐనా, మదాం ఓరెల్లీ ఆ గొడుగు విషయంలో వుపేక్ష వహించలేదు. పరిస్థితంతా వచ్చిన ఆ మిత్రుని ముందర బెట్టింది. కొత్త గొడుగు కొనడమనే ప్రశ్న లేనేలేదనుకోండి. భర్తకి యింకో కొత్త గొడుగు అనవసరమని ఆమె నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడి చేసింది. కాని ఆ మిత్రుడు కొంచెం తెలివి గలవాడు గనక దానిలో వున్న సాధక బాధకాల్ని విపులీకరించేడు. గొడుగు లేకుంటే వర్షానికీ, మంచుకీ అతని దుస్తులు పాడైపోతాయనీ, వాటి ఖరీదు గొడుగు ఖరీదుకంటె యెన్నో రెట్లుంటుందనీ ఆయన స్పష్టంగా చెప్పేడు. దానితో పేలాపగింజలా యెగిరిపోతూన్న ఆ గృహిణి కోపం చల్లారడం వల్ల అటుకుగింజలా అయి వూరుకుంది.

'సరే. అల్లాఐతే వర్షం కురిసినప్పుడు వంటింట్లో వాడుకునే పాతగొడుగు యిచ్చి పంపుతా, ఆఫీసుకి. కొత్త సిల్కు-గొడుగు కొనే ప్రశ్న లేనేలేదు!'

వంటింట్లో వాడుకునే పాతగొడుగు వేసుకుని ఆఫీసుకు వెళ్ళడమనే అభిప్రాయం చాల వెగటుగా తోచి, ఓరెల్లీ తిరగబడ్డాడు:

'ఐతే సరే! ఉద్యోగానికి రాజీనామా యిచ్చేస్తా! వంటేంటి గొడుగుతో ఆఫీసుకి వెళ్ళడం ఛస్తే చెయ్యను!'

అంద మీద నా మిత్రుడు కలుగజేసుకుని అన్నాడు:

'ఈ గొడుగుకే మళ్లా గుడ్డవేయిస్తే బాగుంటుంది. ఎంతో ఖరీదుగాదు.'

కాని, మదాం ఓరెల్లీ తన సహజ స్వభావాన్ని వదలలేదు.

'ఎంత లేదన్నా కొత్తగుడ్డ వేయించడానికి యెనిమిది ఫ్రాంకు లవుతుంది! పద్దెనిమిదీ, ఎనిమిదీ,— యిరవైఆరు! ఒక్క గొడుగుకి యిరవైఆరు ఫ్రాంకులే! ఇంతకంటె సర్వ నాశనం యేముందంటా!' అందామె.

మిత్రుడు మధ్యతరగతికి చెందిన సామాన్య సంసారి గావడంవల్ల, యేదో ఆలోచన తోచి, సూచన చేసేడు:

'మీరు ఫైర్ యిన్సూరెన్సు చేసేరుకదూ? వాళ్ళే అచ్చుకుంటారు, యీ నష్టం! తగులబడి పోయిన వస్తువు లన్నిటికీ కంపెనీవాళ్లు ముదరా యిస్తారు. ఎటొచ్చీ అగ్ని ప్రమాదం మీ స్వంతయింట్లో జరిగివుండాలి. అంతే.'

ఈ సలహా వినడంతోనే ఆ యబలామణి తక్షణం చల్లబడిపోయింది. ఒక్కక్షణం యేమిటో ఆలోచించి, మగ నితో అంది:

'రేపు మీరు ఆఫీసుకి వెళ్ళేముందు మకెర్నెల్లీ ఇన్సూరెన్సు కంపెనీకి వెళ్ళి, మీ గొడుగు స్థితివాళ్ళకి చూపించి, నష్టపరిహారం పుచ్చుకు రాండి!'

తేలు కుట్టినట్లు ఓరెల్లీ వులికిపడి, యెగిరి గంతేసినంత పనీ చేసేడు, ఆ సూచన వినగానే. అతనికంత ఆశ్చర్యం కలిగింది.

'నా ప్రాణం పోయినా నేనా పని చేయను! వెధవది పద్దెనిమిది ఫ్రాంకులు! పోతే పోయిందిలే! ఇంతమాత్రానికి మనం చెడిపోము!'

మరునా డుదయం బైటకుపోతూ అతడు బెత్తం పట్టుకు వెళ్ళేడు. అదృష్ట వశాత్తూ ఆరోజు మంచి యెండకాస్తూంది.

ఇంట ఒంటరిగా వుండిపోయిన మదాం ఓరెల్లీకి, పోయిన పద్దెనిమిది ఫ్రాంకుల నష్టం విషయం హృదయ శల్యమై కూర్చుంది. ఆ గొడుగును భోజనాల గదిలో టేబిలుమీద వుంచింది. ఎంతసేపు దాన్ని చూచినా యే నిశ్చయానికీ రాలేక పోయింది, పాపం!

మాటి మాటికీ యిన్సూరెన్సు కంపెనీయే జ్ఞాపకం వస్తూంది. కాని తాను కంపెనీకి వెడితే, అక్కడ తనను కలుసుకొనే పెద్దమనుషులు ప్రశ్నార్థకంగా చూచే చూపులనుగూర్చి తలుచుకుంటూంటే వెళ్ళేందుకు ఆమెకూ ధైర్యంచాలడంలేదు. అసలే ఆమెకి సభాపిరికి; పదిమందిలోకీ వెళ్ళడమంటే మా చెడ్డ భయం; యేమీలేనిదే వక్షిపుణ్యాన మొహం కందగడ్డలా

యెర్రబడిపోతూంటుం దామెకి! కొత్తవాళ్ళతో మాట్లా డేందు కామె యెంతో కంగారు పడిపోతుంది కూడాను.

కాని, పద్ధెనిమిది ఫ్రాంకులు నష్టం! ఆ బాధ కుకుపులా బాధించుతూం'దామెను. ఆ విషయం ఆలోచించకండా వుందా మని ఆమె యత్నించింది. ఐతే, క్షణక్షణానికీ ఆ పెద్దనష్టం జ్ఞాపకం వచ్చి, ఆమెకి మహా బాధ కలుగుతూంది. కాని ఆమె యెటూ నిర్ణయించుకోలేక పోతూంది. అంతలో వున్నట్లుండి, పిరికి వాళ్ళందరికీ వలెనే ఆమె సాహసంతో నిశ్చయించుకుంది:

'నేనే వెడతా! ఏం జరుగుతుందో చూద్దాం.'

కాని, మొట్టమొదట ఆ గొడుగును తయారు తిని పించాలి. జరిగిన ప్రమాదం స్పష్టంగా కనబడేటట్లు, నష్టం పూర్తి అయేటట్లు చేయాలి. గొడుగుబల్లమీంచి అగ్గిపెట్టె తీసి, గొడుగు గుడ్డలో అరచేతినేర కాల్చింది; తరువాత దాన్ని జాగ్రత్తగా చుట్టి, రబ్బరుతాడుతో బిగించి, కళ్ళాయీ, వస్త్రెవాటూ ధరించి ముస్తాబై, యిన్సూరెన్సు ఆఫీసున్న డీ రివోలీ వీధికి బైలుదేరింది.

గమ్యస్థానం దగ్గరి కొస్తూన్నకొద్దీ ఆమె నడకమంద గించింది. తానేమని అడుగుతుంది? వాళ్ళేమంటారో?

ఇండ్ల నంబర్లు చూసింది. ఇంకా యిరవైయెనిమిదే. ఇదీ బాగానేవుంది! ఆలోచించు కొనేందుకు అవకాశంవుంది! ఆమె అంతకంతకి మెల్లిగా నడువ నారంభించింది. హఠాత్తుగా ఆమె ఒకద్వారాన్ని చూచింది. దానిమీది పెద్ద యిత్తడి

పలకపైన స్పష్టంగా 'లా మకెర్నెల్లీ ఇన్స్యూరెన్సు ఆఫీసు' అని చెక్కి వుంది. అప్పుడే వచ్చేసిందే! ఆమెకు ఆందోళన కలిగింది, బిడియం వేసింది. ఒక్క క్షణం ఆగి, ముందుకు గబగబా వెళ్ళిపోయింది. మళ్ళా వెనక్కి వచ్చింది. ఇల్లా రెండుమూడుసార్లు అటూయిటూ వెళ్ళివస్తూండి అనుకుంది:

'ఏమైనాసరే లోపలికి వెళ్ళితీరాలి. అంచేత యెప్పుడో యెందుకు, యిప్పుడే వెడతా!'

కాని లోనికి ప్రవేశిస్తూంటే ఆమె గుండెలు గుబగుబలాడిపోయినాయి. ఆమె ప్రవేశించిన దారి పెద్దహాలు. చుట్టూ అన్నీ ద్వారాలే. ప్రతీ ద్వారానికీ స్ప్రింగు తలుపులూ, ఒక్కొక్క ద్వారపాలకుడూ కూడాను! అంతలో ఓ పెద్దమనిషి యేవో కాగితాల కట్టలు మోసుకుంటూ వెడుతూంటే ఆపి, బెదురుతూనే అడిగింది:

'క్షమించండి. అయ్యా! అగ్ని ప్రమాదాలకి నష్టపరిహారం యిచ్చే ఆఫీసు యెక్కడో చెప్పగలరా, దయచేసి?'

ఆ పెద్దమనిషి కైం! మనే కీచుగొంతుతో జవాబిచ్చేడు:

'ఎడమవైపునున్న మొదటి ద్వారమే. మీకు కావాల్సిన డిపార్టుమెంటు అదే!'

ఇది ఆమెకు మరీ భయకారణమైంది. అక్కడినుండి పారిపోవా లనిపించింది క్లెయిమ్‌కి పెట్టకండానే, తన పద్దెనిమిది ఫ్రాంకుల్ని నష్టపడైనా సరే అక్కడినుంచి వెళ్ళి పోవాలని

పించింది! కాని, మళ్ళా తన ఫ్లైనివాటి ఫ్రాంకుల మొత్తం జ్ఞాపకం వచ్చేసరికి ఆమెకి తెగింపు కలిగి, మేడ మెట్లెక్క నారంభించింది. అడుగడుక్కీ ఆగుతూ, ఆయాసపడుతూనేవుం దామె.

మొదటి అంతస్థులో ఓ తలుపు తట్టగా, స్ఫుటమైన కంఠం 'లోనికి రాండి, దయచేసి!' అంది.

ఆ ఆజ్ఞను యాంత్రికంగా అనుసరించి, ఆమె ఒక పెద్ద గదిలోకి వెళ్ళింది. గంభీరంగా కనబడుతూన్న ముగ్గురు పెద్ద మనుషులు నిలబడే మాట్లాడుకుంటున్నారు. ప్రతివాని కోటు మీాదా యేవో పతకాలూ, బిరుదులూ వ్రేలాడుతూన్నాయి.

'అమ్మా! మీాకేం కావాలి?' అనడిగేడు, వారిలో నొకడు.

ఆమెకు మాట రాలేదు. నత్తుతూ 'నేను...నేనేమో, వచ్చేను...అగ్ని ప్రమాదం...చిన్న దేలెండి...' అంది.

ఆతడు బహుమర్యాదగా ఆమె కొకకుర్చీ చూపించేడు.

'దయచేసి ఒక్కక్షణం కూర్చోండి. ఇప్పుడే మీా పని చూడగలను.'

అంటూ మిగతా యిద్దరివైపు తిరిగి సంభాషణ కొన సాగించేడు.

"సుజనులారా! మాకంపెనీ మీాకు నాలుగులక్షలకంటె హెచ్చు మొత్తం యీాయవలసిన బాధ్యతను వహించదు.

మరో లక్ష మామీద వేయడానికి చేసిన మీ క్లెయిము మేము అంగీకరించలేము. అంతేగాదు. పరిశీలకుని అంచనాకూడా..."

ఇక్కడకు వచ్చేసరికి శ్రోతల్లో ఒకాయన అడ్డొచ్చేడు:

'అయ్యా! ఇంక చాలు. మన తగాదా నింక కోర్టులే పరిష్కరిస్తాయి. సెలవు యిప్పించండి, యింక!' ఒకరి కొకరు బహు మర్యాదగా, లాంఛన యుక్తంగా అభివందనాలు గావించుకొన్నాక ఆ పెద్దమనుష్యులు వెళ్ళిపోయేరు.

ఆమె అల్లాగే కూర్చుంది, గాని తానుకూడా వాళ్ళతో బాటు వెళ్ళిపోయి వుంటే యెంత బాగుండేదో అనుకుంటూంది. అల్లా ఐతే ఆమె యెంత సంతోషించేది! తనకి కలిగిన నష్టాన్ని వదలి వేసేదే, అక్కడినుంచి పారిపోగలిగితే! కాని... యేం లాభం? అప్పటికే సమయం మించిపోయింది. ఆ పెద్దమనిషి గిరుక్కున తిరిగి వచ్చి, ఆమెకు అభివందనం గావిస్తూ, ప్రశ్నించేడు:

'అమ్మా! నేను తమకు యేమి చేయగలను?'

ఆమె మాట్లాడలేకపోతూంది. ఆఖరి కెల్లాగో తంటాలు పడి మాటలు కూర్చుకుని,—

'నేను...దీనికోసం...వచ్చేను' అంది.

ఆమె తనవైపు చాచిన వస్తువు నాతడు ఆశ్చర్యంతో చూస్తుంటే మేనేజరు నోటమాట రాలేదు. ఆ గొడుగుకు కట్టిన రబ్బరుతాడు విప్పాలని యత్నించి, కొంతసేపటికి కృతకృత్యురాలైంది, మదాం ఓరెల్లె. తొట్రుబడుతూ,

ఆ గొడుగు తాలూకు అవశేషాల్ని తెరిచి, ఆ పెద్దమనిషి ముందు ప్రదర్శించింది, ఆ యిల్లాలు!

ఆయన అత్యంతికరుణాసూచకస్వరంతో,—

'ఇది చాలా అనారోగ్యపరిస్థితుల్లో వున్నట్లుగా కన బడుతూంది, అమ్మా! నా కండ్లకి!' అన్నాడు.

'దీని కోసం నాకు యిరవై ఫ్రాంకులైందండీ!' అన్న దామె కొంచెం సంకోచిస్తూనే.

ఆయనకి ఆశ్చర్యం కలిగినట్లు కనబడింది. 'నిజంగా? అంతదాకా అయిందండీ?'

'ఔనండి! చాలా మంచి గొడుగు! దీని పరిస్థితి గమనించాలని కోరుతున్నా, మిమ్మల్ని!'

'ఆఁహాఁ! అదా? బాగుందండీ. చూస్తూనే వున్నా నుగా! కాని, యీ గొడుగు దుస్థితికీ నాకూ సంబంధ మేమిటా యని ఆలోచిస్తూన్నా నమ్మా!'

ఆమె మనస్సులో ఆరాటం బైలుదేరింది, కాస్త. ఏమో? యీ పెద్ద కంపెనీ, యిల్లాటి చిన్న వస్తువులకి పరి హారం యివ్వదేమో? కాని, అడిగితే తప్పేముంది? ధైర్యం రెండు చేతులా చిక్కబట్టి అంది,—

'అది తగులబడిపోయిందండీ!'

ఆ విషయాన్ని ఆయనా కాదనడు.

'అది నేను చూస్తూన్నా నమ్మా!' అన్నాడు.

ముందింక యేసునాళ్ళో తోచక ఆమె నోరు తెరచుకుని వుండిపోయింది. అంతలో హఠాత్తుగా అసలు సంగతి జ్ఞాపకం వచ్చినట్లుంది, తొందరగా యిల్లా చెప్పేసింది,—

'నాపేరు మదాం ఓరెల్లీ అండి. లా మఠెర్నెల్లీ కంపెనీలో మేము అగ్నిభీమా చేయించేము. ఈ నష్టానికి పరిహారం కోరడానికి వచ్చేను. ఈ మొత్తం రాబట్టమని మిమ్మల్ని కోరుతున్నాను.' ఆయన కాదంటాడేమో నని భయ పడుతూన్నట్లు యీ మాటలు గబగబా చెప్పేసింది.

ఏం చేయాలి? అనేదే మేనేజరుకి పాలుపోలేదు. కింకర్తవ్యతావిమూఢుడైపోయిన ఆ పెద్ద మనిషి సంకోచిస్తూనే,—

'అమ్మా! మేం గొడుగులు అమ్మము. ఇటువంటి రిపేర్లు అంతకంటే మావల్ల గాదండి!' అనేశాడు.

ఆ అల్పప్రాణిలో ధైర్యం మళ్ళా పుంజుకున్నట్లు కనబడింది. తన క్లెయిమును ఓ పట్టాన వదలిపెట్టదు, గట్టిగా పోట్లాడనిదే! ఇప్పుడింక ఆమెలో భయంకూడా యెగిరి పోయింది. అందుచేత,—

'మీరు చేయించడం దేనికి? నే నడిగేది రిపేరుఖర్చులు మాత్రమే! పనంతా నేనే చేయించేస్తాను లెండి.' అంది.

ఆ పెద్ద మనిషి యింక గాభరా తింటూన్నట్లు కన బడింది!

'నిజంగా యిది చాల చిన్నవిషయం అనుకోండి, అమ్మా! ఇల్లాంటి అల్పనష్టాలకి పరిహారం మిమ్మల్ని మమ్మల్నె వరూ యింతవరకూ అడగనేలేదు. జేబురుమాళ్ళూ, చేతొడుగులూ, కాలి జోళ్ళూ, చీపురు కట్టలూ,— రోజూ కాలిపోయే సావకాశంవున్న యిల్లాంటి చిన్న వస్తువులకి మేము నష్టం అచ్చుకోమంటే మీరూ ఒప్పుకుంటా రనుకుంటా!'

ఆమె ముఖం జేవురించింది. కోప పడ్డానికి సిద్ధమైనట్లుందామె వైఖరి.

'కాని, ఒక్క విషయం, అయ్యా! గత డిసెంబరులో మా యింటి పొగగొట్టం ఒకటి అంటుకుంది. దానివల్ల మాకు కనీసం ఐదు వందలు నష్టం కలిగింది! దాని కోసం మేము మీ కంపెనీమీద క్లెయిమ్ చేయనేలేదు. అది ఆలోచించైనా యిప్పుడు మాకు యీ చిన్ననష్టానికి పరిహారం యివ్వడం మీ కంపెనీ విధి!'

ఆమె అబద్ధ మాడుతూందని మేనేజర్ గ్రహించేసేడు.

'అమ్మా! అప్పుడు ఐదువందలకి అడగకండా యిప్పుడు ఐదారు ఫ్రాంకులకి పరిహారం యిమ్మనడం ఆశ్చర్యకరంగా లేదూ? దీన్ని మీరు గమనించినట్లు లేదు!'

ఈ యుక్తివల్ల ఆమె యెంతమాత్రం నిరుత్సాహం చెందలేదు. పైగా కాస్త పుంజుకుని,—

'క్షమించాలండి, అయ్యా! ఆ ఐదు వందల ఫ్రాంకులూ మాన్సూర్ ఓరెల్లీ గారివి. కాని, యీ పద్దెనిమిది ఫ్రాంకులూ నావి! వీటి సంగతే వేరు!'

ఆ కామినీపిశాచం తన నింక వదలి పెట్లేట్లు లేదను కుని, కాలం వ్యర్థమవుతూందని నిస్పృహ చెందేడు, ఆ పెద్ద మనిషి. కాని, కుతూహలమూ కలిగి,—

'దయచేసి, యీ నష్టం యెల్లా కలిగిందో చెపుతారా, అమ్మా?' అన్నాడు.

నెగ్గుతూ వ్నా ననుకుందా మె, దీనితో.

'అయ్యో! జరిగింది యిదండి. మా హాలులో చేతి కర్రలూ, గొడుగులూ వుంచుకునే యిత్తడి స్టాండు వుంది. నిన్న నేను రాగానే గొడుగు స్టాండుమీద పెట్టేను. దాని మీదనే చిన్న షెల్ఫ వుంది. దాంట్లో అగ్గి పుల్లలూ, కొవ్వొత్తులూ వుంచుతాంలెండి. చేయిచాచి నేను మూడు నాలుగు అగ్గిపుల్లలు తీసేను. ఒకటి గీస్తే వెలగలేదు. రెండోది వెలి గింది, కాని వెంటనే ఆరిపోయింది. మూడోదీ అంతే జరిగింది...'

మధ్యలో అడ్డొచ్చి, మేనేజరు పరిహాసానికి అడిగేడు:

'అవి ప్రభుత్వపు అగ్గిపుల్లలే అనుకుంటా నండి?'

ఆయన మాటల్లోని వ్యంగ్యాన్ని గ్రహించ నందున, ఆమె చెప్పకు పోతూంది.

'బహుశా వాళ్ళవే కావచ్చునులెండి. ఏదేమైతేనేం గాని, నాలుగోది వెలిగింది. కొవ్వొత్తి వెలిగించి పెట్టి, పడు కునేందుకు నా గదికి పోయినా. మరో పావు గంటకి యేదో గుడ్డ తగులడుతూన్న వాసన వేసింది. నా కెప్పుడూ నిప్పంటే

చెడ్డ భయంలెండి. మా యింట అగ్ని ప్రమాదం యేదేనా జరిగిందంటే అది నావల్ల మాత్రం కాదని ఘట్టిగా చెప్పగలను. మా పొగగొట్టం అంటుకున్నప్పటి నుంచీ నాకు నిప్పంటే మరీ భయం పట్టుకుంది. అంచేత నేను లేచి యిల్లంతా గాలిం చేసేను. వేట కుక్కలాగ యిల్లంతా పసిపట్టి చూచి, గొడుగు అంటుకున్నట్లు కనిపెట్టేను. బహుశా ఓ అగ్గిపుల్ల దాంట్లో పడి, తగులడి వుంటుంది. దీని కథ క్లుప్తంగా యిదండి. బోధ పడిం...'

మేనేజరు కొస అందుకుని మళ్ళా ప్రశ్నించేడు.

'బోధ పడింది. కాని, నష్టం యేమాత్రం వుంటుం దంటారు, అమ్మా?'

ఏం చెప్పాలో తోచలేదామెకి. ఎంత మొత్తం క్లెయిమ్ చెయ్యాలా? అనేద్ది నిశ్చయించుకోలేకపోతూంది. ఆఖరికి,—

'పోనీండి, అయ్యా! మీరే దాన్ని రిపేరు చేయిం చేయండి. అంతా మీ మీదే వదలి పెట్టేస్తా!' అంది.

సహజంగానే ఆయన దాని కంగీకరించలేదు.

'ఒద్దండి, అమ్మా! ఆ పని నావల్ల కాదు. మీ క్లెయిమ్ యెంతో చెప్పండి. అంతే నేను కోరేది!'

'దానికేం! అల్లాగే కానీండి! బహుశా, నే నను కుంటా...చూడండి అయ్యా! మీవల్ల ఒక్కకానీ అదనంగా రాబట్టాలని కోరేదాన్ని గాను. అంచేత...యేం చేద్దా మను కుంటున్నా నంటే...గొడుగు తయారు చేసిన వాళ్ళదగ్గర కెళ్ళి,

మళ్ళా సిల్కు-గుడ్డ వేయించి, బిల్లు మీకు యిస్తా ఏమం టారు, అయ్యా?'

'చాలునండమ్మా! భేషుగ్గావుంది, యేర్పాటు! ఈ వ్యవహారాన్ని యిల్లా పరిష్కరించుదాం లెండి. ఇదుగో! చీటీ. క్యాషియర్‌కు. మీరు బిల్లు యివ్వగానే డబ్బు చెల్లిస్తాడు లెండి!'

అంటూ ఆత డొక చీటీ నామెకు అందిచ్చేడు. దాని నందుకుని, ఆయనకి వందనం చేసి, లేచిం దామె. మళ్ళా అతడు మనసు మార్చుకుంటాడేమోననే భయంతో ఆమె త్వరత్వరగా బైటికి వెళ్ళిపోయింది.

బజారమ్మట గబగబా నడుస్తూనే వుంది, ఆమె కళ్ళు మంచి గొడుగులదుకాణంకోసం వెతుకుతూనే వున్నాయి. ఆఖరి కామె మొదటిరకం షాపును వెతికి పట్టుకుని, బహు ధీమాగా వెళ్ళి,—

'ఈ గొడుక్కి మంఛి గుడ్డ వెయ్యాలండీ! సిల్కు-గుడ్డ! ఒకటోరకం సుమండీ, మళ్ళా చెప్పలేదనేరు! ఎంత ఖరీదైనా ఫర్వాలేదు, కాని వున్నవాటిలో మాంఛి దిట్టమైనగుడ్డ వేయండి!' అంది.



# ఘాతం

తల్లి మరణశయ్యపై వుంది. డాక్టరుగారు నిల్చుని వున్నారు. ఆయన కెదురుగా వున్నాడా రైతు. కానున్నది కాకమానదనే విరాగంతో బహుప్రశాంతంగా వాళ్ళవైపు చూస్తూ, వాళ్ళమాటలు వింటూం దావృద్ధురాలు. ఆమె చనిపోతూంది. మృత్యువుమీద నామె తిరుగుబాటు చేయదలచుకో లేదు. తొంభైరెండేళ్ళామె వయస్సు! ఆ వయస్సులో మృత్యువుమీద యెవరికోగాని అయిష్టం కలుగదు.

జూలై సూర్యుడు కిటికీలోంచీ, తెరిచియున్న ద్వారం లోంచీ కిరణజాలాన్ని ప్రసరింపజేస్తూ, గదిని సుఖోష్ణం గావిస్తున్నాడు. ఆ యిల్లు మట్టిదే. నాలుగు తరాల రైతులు, మట్టి పిసుక్కునే మోటుజనంకట్టిన నేలఅది. పొలాల్లోని పైరుల వాసనలు మోసుకొస్తూంది, విసురుగా వీస్తూన్న గాలి. మధ్యాహ్నపు వేడిమికి ఆ పరిమళాలు పొడిపొడిగా వున్నట్లున్నాయి. దిక్కులు పిక్కటిలేలాగ కీచురాళ్ళు అరుస్తున్నాయి. తీర్థాల్లో కొనుక్కొచ్చిన యీలలతో చిన్నపిల్లలు యిల్లంతా రణగుణధ్వని చేస్తూన్నట్లుగా వుంది, యీ వాతావరణం.

డాక్టరు గొంతెత్తి బిగ్గరగా అంటున్నారు: 'హానోరీ! మీ అమ్మని యీస్థితిలో ఒంటరిగా వదలిపెట్టి నువ్వు వెళ్ళడానికి వీల్లేదు. ఈమె యే క్షణంలోనైనా చనిపోవచ్చు!'

ఆ రైతు యిరుకునపడిపోయి, ఆందోళనలో వేడుకుంటూ న్నాడు: 'డాక్టరుగారూ! ఎల్లాగో చెప్పండి? గోధుమపైరు యింటికి తెచ్చుకోవాలి. చాలదినాలుగా వాతావరణం అనుకూలంగాలేక చేను వుండి పోయిందండి. ఈ వేళే గాదండీ, కాస్త తెరపిగా వున్నది! ఏం అమ్మా! నువ్వేమంటావు?' నార్మనులు బహుకృపణు లనేది నిజమే. చనిపోబోతూన్నా ఆమె కృపణత్వం పీసమెత్తుకూడా తగ్గలేదు! గోధుమపంట యింటికి చేరవేసుకోవడం తనను కనిపెట్టుకుని వుండడంకంటె ముఖ్యమనీ, తన్ను దిక్కులేకండా చావమని వదిలినా పంట మాత్రం తెచ్చుకోమనీ చెపుతూన్నట్లు అంగీకార సూచకంగా కళ్ళతోనూ, ముఖవైఖరితోనూ సూచించిం దావృద్ధురాలు. డాక్టరుకి వొళ్ళు మండిపోతూంది. నేలను తన్నుతూ 'నీకంటె పశువే నయం! అన్నివిధాలా! విన్నావా? నేనుండగా నిన్నా పనిచేయ నియ్యను! తెలిసిందా? ఈవాళే గోధుమ యింటికి తెచ్చుకోక తప్పదంటావా, రాపెట్ అమ్మని పిలిచి, మీ అమ్మ దగ్గరుంచి మరీవెళ్ళు పొలం! అల్లాగైతే అదీదారే! లేదం టావా, నీకు రోగంవచ్చి, కుక్కలా దిక్కుమాలినచావు చస్తూన్నప్పుడు కూడా దయదలచను సుమా! హానోరీ! వింటున్నావా?' అన్నాడు.

ఆ రైతు కున్నగా పొడుగ్గా వుంటాడు. ఆతడు ప్రతిపనీ బహు తాపిగానే చేస్తాడు. ఓపక్క కాపీనము, మరోపక్క డాక్టరంటే భయము; యీ రెంటిమధ్యా యెటు నిశ్చయిం

చేందుకూ ధైర్యంచాలక, యేవేవో అంచనాలు వేసుకుని, నసిగేడు: 'రోగిష్టివాళ్ళదగ్గ రుండడానికి రాపెట్ అమ్మ యెంత తీసుకుంటుందండి, డాక్టరుగారూ ?'

'అది నాకెల్లా తెలుస్తుందోయ్ !' అని అరిచేడు, డాక్టరు. 'ఇక్కడెన్నిరోజులుండాల్లో, దాన్నిబట్టి వుంటుందది ! దానికో యేదో యేర్పాటు చేసుకోవోయ్, నీ యిల్లు బంగా రంగానూ ! ఒక్క గంటలో ఆమె యిక్కడుండాలసుమా ! జ్ఞాపకం వుంచుకో.'

రాపెట్ అమ్మకోసం వెళ్ళడానికి నిరుకు చేసుకన్నాడు, హానోరే. 'డాక్టరుగారూ ! కోపపడకండి. ఆవిడ కోసం వెడు తున్నా !' నన్నాడు. డాక్టరు వెళ్ళిపోతూ, బిగ్గరగా 'నాకు కోపంగా వున్నప్పుడు వేళాకోళంగా చెప్పనని తెలుసుగాదూ? జాగ్రత్త !' అని హెచ్చరించేడు. ఇంక తామిద్దరే వున్నారు యింట్లో. హానోరే తల్లివైపు తిరిగి, నిస్పృహా సూచక స్వరంతో, 'నేవెళ్ళి లా రాపెట్‌ను తీసుకొస్తానమ్మా ! డాక్టరుగారు వూరుకునేటట్లులేరు. నేను లేనప్పుడు నువ్వు పోవద్దు సుమా !' అంటూ బైటికి వెళ్ళేడు.

లా రాపెట్ ఒక రజకవృద్ధ. ఆ చుట్టుపట్ల యెవరు మృత్యుశయ్యపైనున్నా వాళ్ళదగ్గరకనిపెట్టుకుని వుండడానికి ఆ వృద్ధురాలినే పిలుస్తారు. తన వ్యాపారాల్లో తలపండిన దామె. మృత్యువాతైన ఖాతాదారుల్ని మళ్ళా కనబడకండా శవ వస్త్రంలోచుట్టి కుట్టి, శవపేటికలో పెట్టేసిన తర్వాత ఆమె

యింటికి వెళ్ళిపోయి యిస్త్రీపెట్టి పట్టుకుని సజీవ్ను న కాతా దాకుబట్టలు బాగుచేసే పనిలో మగ్నమైపోయిందని. ఆమె ముఖమంతా ముడుదలువారి యెండిన యాపిల్ పండులా వుంటుంది. అసూయా ద్వేషాంకూ, అంతులేని ఆశకూ పుట్టి నిల్లామె శుష్కహృదయం. ఇస్త్రీ పనిలో నిరంతరం వుండడం వల్ల ఆమె నడుం విరుగకొట్టినట్లుగా వంగివుంటుంది. మంగా సన్నజీవులబాధను చూడడంలో ఆమెకేదో పైశాచికానందం, ఆసక్తి వుండివుండాలి! చావబోతున్న జనుల అవస్థల్ని గురించి తప్ప మరేవిషయమూ యెప్పుడూ యెవరూ విని యుండలేదు, ఆమెనోట! తాను చూచిన రకరకాల మృత్యు వులనూ, వాటిలోని అత్యల్ప వివరాలలోసహా వర్ణిస్తూ, అవ్యక్తానందాన్ని అనుభవిస్తూంటుంది! కానైతే ఆమె చెప్పే ఆ సంగతులన్నీ గురువిందల్లా ఒక్కపోలికగానేవుంటాయి, అభేదంగా. పెద్దపెద్ద ఆటగాళ్లు తాము కొట్టిన మంచి మంచి 'షాట్' లను గూర్చి వర్ణించుకొన్నట్లు, రాపెట్ కూడా తన వృత్తిలోని విశేషాల్ని సగర్వంగా చెప్పుకుంటూంటుంది!

హానోరీ బోర్ట్ జెంప్స్ వెళ్ళేటప్పటికి కామె గంజి నీళ్ళు కలుపుతూంది. గ్రామ ప్రముదామణులదుస్తుల కోసమే యీ గంజినీరు తయారు చేస్తూందామె. కుటీరంలో ప్రవే శిస్తూనే ఆమె కుశలం పరామర్శించేడు, హానోరీ.

'రాపెట్ మామ్మా! వందనాలు! కులాసాగా వున్నావా!'

'ఏదో ఫర్వాలేదులే, గాయనా! ఇల్లావున్నా. నువ్వో?' అందామె తల యిటుతిప్పి.

'ఆహాఁ! నాకేం! నేను కావాల్సినంత బాగావున్నా. కాని...మా అమ్మే...చాల సుస్తీగా వుంది.'

'మీ అమ్మా?'

'ఔను! మా అమ్మే!'

'ఏమిటి సుస్తీ ఆవిడకి?'

'ఆవిడ యిహలోకయాత్ర చాలించ బోతూందిలే. అదే ఆవిడజబ్బు. అంతే!'

ఆ ముసిలిదానికి హఠాత్తుగా సానుభూతి పుట్టుకొచ్చి నట్టుంది, నీళ్ళలోంచి చేతులు పైకితీసి,—'ఆవిడ అంతసుస్తీగా వుందా?' అంది.

'డాక్టరుగారు చెప్పడం, ఆవిడ తెల్లవారే వరకూ వుండదనే.'

'పాపం! ఐతే చాలసుస్తీగానే వుందన్నమాట!'

హొనోరీ కాస్త తటపటాయించేడు, యిక్కడ. ఏవో నాలుగు ముక్కలు వుపోద్ఘాతం చెప్పింతర్వాత తన అవసరం చెపితే బాగుంటుందని ఆలోచిస్తున్నాడు. కాని, ఆతనికేమీ పాలుబోక సరాసరి వ్యవహారంలోకి దిగదలచుకున్నాడు.

'ఆవిణ్ణి కనిపెట్టుకువుండడానికి రావాలి, నువ్వు, మామ్మా! నేనేం ధనికుణ్ణి కాదుగదా, పనిమనిషినే పెట్టుకో లేకపోయేను, యింట్లో! చాకిరీవల్లనే పాపం! మా అమ్మ

యీ స్థితిలోకి వచ్చేసింది. జీవితమంతా పనే; బండచాకిరీయే! తొంభైరెండుదాటినా యిప్పటికీ రోజుకి పది గంటలు చాకిరీయే అనుకో. ఈ రోజుల్లో అల్లాంటి దార్ఢ్యం వున్నవాళ్ళే అరుదు....ఏమి యిమ్మంటావో నిరుకుచెయ్యి!'

లా రాపెట్ గంభీరతవహించింది: 'రెండు రకాలుగా తీసుకుంటా, రుసుం. ధనికులకైతే పగటికి నలభై సౌలు, రాత్రికి మూడు ఫ్రాంకులు; బీదవాళ్ళకి పగలు యిరవైసౌలు, రాత్రికి నలభై సౌలు రుసుం పుచ్చుకుంటా. నువ్వు యిరవైనలభై రుసుం యిద్దువుగాని.' రైతు ఆలోచనలో పడ్డాడు. అతనికి తల్లిసంగతి బాగా తెలుసు. ఆవిడప్రాణం మహాగట్టిది. ఆప్రాణి ఓపట్టాన బొందెలోంచిపోదు! బంకపీసాణం? ఆవిడ యింకోవారంవరకూ బ్రతికి తీసుతుందని అతగాడికి నమ్మకమే! డాక్టరు మాటేమిటంటారేమో? ఆఁ! డాక్టరుకేం తెలుసు లెద్దురూ, మహా! కష్టసుఖాలన్నీ బేరీజు వేసికొని, ఖండితంగా అన్నాడు:

'ఏమమ్మోయ్! అదంతా నాకు తెలియదుగాని ఆఖరిదాకా వుండడానికి యేదో యింతనిచెప్పు. అల్లాగో యిల్లాగో, ఒడబడతా, నేనూమరి. ఆవిడ త్వరగానే వెళ్ళిపోతుందంటారు, డాక్టరుగారు. అల్లా జరిగితే నీకులాభం. అంటే నాకునష్టమే కద! కాని, రేపూమాపెల్లుండీ, యింకా ఆపైనా బ్రతికవుందంటే నీకు నష్టం, నాకులాభం.'

ఆ రైతువైపు ఆశ్చర్యంగాచూసింది, లా రాపెట్. మరణసందర్భాన్ని వ్యాపార విషయంగా, పణంగా ఆమె అంత

వరకెన్నడూ పరిగణించియుండలేదు! అంచేత కాస్త తటపటా యించింది. కాని లాభం రావచ్చునేమో? అనే ఆశకలిగి, ఆమెలో ఆసక్తికలిగింది. మళ్ళా అంతలో అనుమానము వేసింది, యీ జిత్తులమారిరైతు తన్ను గజిబిజి పెడుతున్నా డేమోనని! అంచేత 'మీ అమ్మను చూచేవరకూ యేమీ చెప్పలేను.' అని వూరుకుంది.

'సరే, ఐతేరా. మా అమ్మని చూడు.'

ఆమె చేతులుకడుక్కొని తక్షణం అతనితో బైలు దేరింది. ఇద్దరూ మౌనంగానే నడుస్తూన్నారు. ఆవిడ చిట్టి చిట్టిఅడుగులువేస్తూంది, చురుగ్గా. అతడు పెద్ద అంగలు వేస్తూ, అడుగడుక్కీ యేదో కాలువ దాటుతూన్నట్లు నడు స్తూన్నాడు. ఎండలోపోతూన్న యీ యిద్దర్నీచూచి, మేత అడుగుతూన్నట్లు భారంగా తలలెత్తి ఆశగా చూసి, నీరసంగా మూలిగేయి, పొలాల్లో పడుకున్న ఆవులు వేడిని భరించలేక.

ఇంటిని సమీపిస్తూంటే హొనోర్ గొణిగేడు: 'ఇప్ప టికే అంతా ఐపోయి వుంటే!' అల్లా జరిగితే బాగుంటుందనే వాంఛ అతని స్వరంలో ధ్వనిస్తూంది, అనుకోక పోయినా.

కాని ఆ ముసిలిది యింకా చచ్చిపోలేదు. కుక్కిమంచం మీద వెల్లకిలా పడుకొనివుంది, బూడిదరంగు దుప్పటికప్పు కొని. కాయలు గాచిన అరచేతులు, పక్షవాతంతో ముడు చుకు పోయిన వేళ్ళుగల సన్నని శుష్కహస్తాలుచూస్తే యే జంతువు పంజాలో, పీతగోళ్ళో గుర్తొస్తాయి. ఓ శతాబ్దపు

బండచాకిరీతో పరిశ్రాంతములైన ఆ చేతుల్లోంచి మానవహస్త చిహ్నాలే తుడుచుకుపోయినట్లుంది!

రాపెట్ మామ్మ మంచం దగ్గిరికి వెళ్ళి, మరణాసన్న మైన ఆ వృద్ధురాల్ని చూచి, నాడి పరీక్షించింది; గుండెల మీదకొట్టి చూచింది; వూపిరి తీయడం వింది; కంఠధ్వని విన డానికేమో, యేవేవో ప్రశ్నలు అడిగింది; కాస్సేపు వివిధ పరిశీలనలు గావించి, బైటికెడుతూంటే హూనోరీ కూడా ఆవిణ్ణి వెంబడించేడు. తల్లి యింక ఆ రాత్రిదాటి బ్రతుక దను కుంటూన్నా, నిర్ధారణ కోసం ఆమె నడిగేడు: 'ఎల్లావుంది?' 'రెండురోజులు దాకా ఫర్వా లేదనుకుంటా.. ఏమో, మూడు బ్రతికినా బ్రతకచ్చు. మొత్తం ఆరు ఫ్రాంకులియ్యి, అంతా పూర్తయే దాకావుంటా,' అంది రాపెట్.

'ఆరుఫ్రాంకులే! ఆశకి అంతుండొద్దూ?' అని అరి చేడు హూనోరీ. 'నీకేమేనా మతి పోలేదుగదా? ఆవిడ మహా బ్రతికితే యింకో ఐదారుగంటలు! దీనికే ఆరు ఫ్రాంకులట!' కోపావేశాలతో యిద్దరూ కాస్సేపు తగువు లాడుకున్నారు. ఇంక యింటికి పోతానని ఆమె బైలుదేరింది. తన గోధుమ చేర్ర వేతకీ ఆలస్యమై పోతూంది, మరోప్రక్క. పోనీ ఆగోధుమలు యింటికి చేరేందుకు మరో మార్గమూ లేదాయె! అంచేత రాపెట్ మామ్మ అడిగిందానికి ఒప్పుకోక తప్ప దనుకున్నాడు, హూనోరీ.

'సరేలే, కానీ! అన్నిటికీ కలిపి ఆరు ఫ్రాంకులు; శవం బైటికిపోయేవరకూనేనా?'

30

'ఆఁ! ఔను ! అంతికీను, ఆరు ఫ్రాంకులు.'

ఆ తర్వాత రాపెట్ మామ్మ యింటికెళ్ళింది, హానోర్ పెద్దపెద్ద అంగలతో పొలంకేసి నడిచేడు. చేలమీదున్న గోధుమ గింజలు యెండకి పక్వమవుతూన్నాయి, అప్పుడే.

రాపెట్ వచ్చేటపుడు కొంత పనినికూడా తెచ్చుకుంది, యింటినుంచి. మరణశయ్యపైనున్న వాళ్ళదగ్గరున్నా, మరణించిన వాళ్ళ దగ్గరున్నా ఆవిడ పని మానదు. తన్ను నియమించిన కుటుంబం పనో, తన స్వంతపనో చేసుకుంటూనే అక్కడ కనిపెట్టు కుని వుంటుంది. ఆమె వాళీగాచేసేది కుట్టుపని; కాకుంటేవుతుకు, యిస్త్రీపనులు. ఆయా కుటుంబాల వాళ్లు చేయించుకునే పనికి అదనంగా ముట్టచెప్పాలిలెండి. దేని దారి దానిదే. హానోర్ తల్లి దగ్గర కూర్చుని రాపెట్ వాకబుచేసింది,—

'ఏమమ్మా! మదాం బోన్టెంప్స్! కడపటి పవిత్ర సంస్కారం చేయించుకున్నావా?'

'లేదు,' అందా రైతువృద్ధ, తల ఆడించడ ద్వారానే. నిష్ఠాపరురాలైన రాపెట్ విభ్రాంతురాలై, చట్టున లేచింది; 'అయ్యో! దేవుడా! ఇదేటమ్మా, మరీ విడ్డూరం! నేనేనా వెళ్ళి పురోహితుణ్ణి తీసుకొస్తా.' అంటూ రాపెట్ కాలు దేరింది వీధమ్మట. ఆమె వురుకులూ పరుగులూ చూసి, వీధుల్లో ఆడుకుంటూన్న పిల్లగాళ్ళంతా యేదో మూడిందను కుని భయపడి కకావికలై పోయేరు.

ఆహ్వానం అందగానే పురోహితుడు శ్వేతవసనములను ధరించి బైలుదేరేడు. భజంత్రీ మేళంలోని కుర్రవాడు గంట

వాయిస్తూ ముందు నడుస్తూన్నాడు. ప్రశాంతంగా వున్న ఆ పల్లెటి ప్రాంతంలోని జనులకు నిమంత్రితుడై పురోహితుడు వెడుతూన్నాడని తెలపడానికే ఆ ఘంటారావం వుద్దేశించబడి వుంటుంది. పొలాల్లో పనులు చేసుకుంటూన్న వాళ్లు టోపీలు తీసి చేత బట్టుకు నిలబడి, పురోహితుని తెల్లఅంగీ యే పాక చాటునో కనుమరుగై పోయేవరకూ వుండి, శిలువ వేసుకున్నాక మళ్ళా పనిలో వంగేవాళ్ళు. పొలాల్లో గోధుమ పనలు కడుతూన్న స్త్రీలు శిలువ వేసుకోడానికి ఒక్కసారి నిలబడుతూన్నారు. ఎర్రని దుస్తులు ధరించిన భజంత్రీ కుర్రాడు గంట వాయిస్తూ గబగబా నడుస్తూంటే, పురోహితుడు శిరస్సును కొంచెం ముందుకి వంచి, యేవో మంత్రాలు చదువుతూ వెంబడిస్తూన్నాడు. పురోహితుడు అచ్చంగా తెల్లటి వస్త్రాల్ని, తలపై నల్లని చతురస్రపు టోపీని ధరించివున్నాడు. వాళ్ళ వెనక్కాలే రాపెట్, సాష్టాంగంగా ప్రణామం ఆచరించ దలచిందా అన్నట్లు నడుముకివంగి వస్తూంది. చెర్చిలోకి వలె ఆమె రెండుచేతులూ జోడించుకుని వుంది. ఈ వింత చూచి బెదిరిపోయిన కోడిపెట్టలు బోది వెంబడే పరుగెత్తిపోయి, కంచెలోని కంతగుండా దూరి అదృశ్యమైపోయేయి. బీటిలో రాటను కట్టిన గుర్రపుపిల్ల పురోహితుని తెల్లని రూపాన్ని చూసి, కట్టు త్రాటి పొడవునా దౌడుతీస్తూ, వెనకటి కాళ్ళతో గాలిలో తన్నుతూ గెంత నారంభించింది.

చేలో పనలు కడుతూన్న హూనోరే యీ హడావుడి చూచి, కూడావున్న పనివాణ్ణడిగేడు: 'పురోహితు డెక్కడికిరా

వెడుతున్నాడు ?' కూలీ అతనికంటె తెలివైన వాడేమో, 'మీ అమ్మకి కడపటి పవిత్ర సంస్కారాన్ని తీసికెడుతూన్నా రయ్యా ! ఆ మాత్రం తెలియదూ ?' అని జవాబిచ్చేడు.

'ఔనురా ! నిజమే.' నని అంగీకరించి, హూనోరీ మళ్లా పనిలో వంగున్నాడు.

బోన్ టెంప్స్ అవ్వ కడపటిసారి పాపాంగీకారం గావించి, విముక్తిని స్వీకరించి, అభిషేక తీర్థం తీసుకొంది. ఈ కర్మకాండ పూర్తిచేసి, పురోహితుడు వెళ్ళిపోయేడు. ఉక్కగావున్న ఆ కొంపలో మళ్ళా ఆ ముదుసలు లిద్దరూ మిగిలేరు. రాపెట్ రోగివైపు చూస్తూ, యింకా యెంత సేపుంటుందా ? అని ఆలోచిస్తూంది.

ప్రొద్దువాలింది. చల్లని పిల్లగాలులు వీస్తూన్నాయి. కిటికీ తెర, తెల్లనిగుడ్డలు పసిమిగా కనిపిస్తూన్నాయి. తెరలమీద వ్రాలిన యీగలు చుక్కల్లా వున్నాయి. కిటికీ తెరలు గాలిలో యెగిరిపోడానికి కొట్టు మిట్టాడుతున్నాయి, ఆ వృద్ధురాలి ప్రాణాలకి వలెనే.

నిశ్చలంగా పండుకొన్న ఆ వృద్ధురాలు అతిసమీపంలో వున్న మృత్యువుకోసం నిరీక్షిస్తూన్నట్లు కండ్లు తెరచుకొనే వుంది. నిరీక్షించిన కొద్దీ మృత్యువు ఆలస్యం గావిస్తూంది. ఆమె ముఖంలో వుదాసీనతగాక మరేభావమూ గోచరించడం లేదు. ఊపిరితీస్తూంటే ఆవిడ గొంతులో గురక వినిపిస్తూంది. త్వరలోనే యీ వూపిరికూడా నిలిచిపోతుంది ! ప్రపంచ జనాభాలో ఒకస్త్రీ తగ్గుతుంది. ఆమె లేనివెలితి యెవరికీ పట్టదు.

చీకటి పడుతూంటే హానోరీ యింటికి వచ్చేడు. మంచందగ్గిరికి వెళ్ళి తల్లి యింకా జీవించే వుండడం చూసి 'ఎల్లా వుందమ్మా?' అనడిగేడు. రాపెట్ మామ్మని మళ్ళా తెల్లారగట్ల రమ్మని పంపేసేడు, తరువాత.

ఆమె వేకువనే తిరిగి వచ్చింది. అప్పటికే హానోరీ వండుకుని, కాస్త మంచిమాట చేసుకుంటున్నాడు.

'ఏమిటి? మీ అమ్మ యింకా బతికేవుందా?'

'ఆహా! నిక్షేపంలా! పైపెచ్చు కాస్త సులువుగా వుంది కూడాను!' అంటూంటే హానోరీ కనుగొనల్లో యీర్ష్య కనిపించింది. తల్లిని రాపెట్‌కి వప్పగించి, హానోరీ పొలం వెళ్ళిపోయేడు, కాస్సేపట్లో.

రాపెట్ మనసులో ఆందోళన బైలుదేరి, మరణా సన్నమైన ఆ వృద్ధురాలి సమీపానికి వెళ్ళింది. వృద్ధురాలు పూర్వస్థితిలోనే నిశ్చలంగా, నిర్వికారమై, కండ్లు తెరచి చూస్తూ, చేతివేళ్ళతో దుప్పటిని పట్టుకుంటూ, వదలుతూ వుంది. ఇదేస్థితిలో రెండు, మూడు, నాలుగు, ఆఖరికి వారం రోజులుకూడా వుండొచ్చు ననుకొనే సరికి రాపెట్ కృపణ బుద్ధిలో భీతికలిగింది. తన్ను మోసగించి, యింతనష్టం కలిగించిన జిత్తులమారి రైతుమీదా, త్వరగా చావని ఆ వృద్ధురాలి మీదా రాపెట్‌కి మహాకోపం వచ్చేసింది.

ఎంత కోపం వచ్చినా ఆమె కుట్టుపని మానలేదు. ఆమె దృష్టంతా బోర్డెంప్స్ అవ్వ శుష్కముఖంమీదే లగ్నమై వుంది. భోజనాల వేళకి యింటికివచ్చిన హానోరీ హుషారుగా

వున్నట్లు కనబడ్డాడు. అంతేగాదు, ఛలోక్తులాడుతూ, హెచ్చరి కగాకూడా వున్నాడు. గోధుమ పంటను మంచి అనుకూల వాతావరణంలో యింటికి జేరవేసు కుంటున్నాడంటే, ఆ మాత్రిం హుషారుండదూ?

రాపెట్ వొళ్ళు మండిపోతూంది. గడుస్తూన్న ప్రతీ క్షణమూ ఒక యుగంలా వుంది, ఆమెకి. ఈ జిత్తులమారి రైతు తన్ను గికురించి కాలాన్ని, ధనాన్నీ అపహరించేడు. ఈ మొండి ముసిలిపీనుగును పీకనొక్కి- చంపెయ్యాలన్నంత కోపం వచ్చేస్తూందామెకి! తన కాలాన్ని దొంగిలిస్తూన్న యీ ముసిలి గాడిద వూపిరిని గొంతు కాస్తంత ఒత్తి నిలిపేస్తే? కాని, అల్లా చేయడంవల్ల బోలెడన్ని ప్రమాదాలు వున్నాయి! ఇల్లాంటి ఆలోచనలతో ఆమె బుర్ర గిర్రున తిరిగిపోతూంది. అంతట్లోనే ఒకచక్కని ఆలోచనతట్టి, రోగి దగ్గిరికివెళ్ళి ప్రశ్నించింది: 'పిన్నీ! నువ్వెప్పుడేనా భూతాన్ని చూసేవా?'

ఆ వృద్ధ క్షీణ స్వరంతో 'లేదు' అంది.

అక్కడినుంచి రాపెట్ ఆమాట యీమాట చెపుతూ క్రమంగా దయ్యాలు, భూతాలు గూర్చి కథలు చెప్పనారంభించింది. మరణాసన్నమై, బలహీనమై పోయిన ఆవృద్ధురాలిని హడలగొట్టి వేయాలనేదే ఆమె ఆలోచన.

'చచ్చిపోబోయేవాళ్ళకే భూతం కనబడుతోంటుంది, పిన్నీ! చేతులో చీపురూ, నెత్తిన మూకుడు పెట్టుకుని, బిగ్గరగా అరుస్తూ వస్తుంది, భూతం. అది కనిపించిందంటే యిక అంతా అయిపోయినట్లే. భూతదర్శనం అయేక యింక ఒక్క క్షణమేనా ప్రాణాలతో వుండరు.'

ఈ వుపోద్ఘాతంతో ప్రారంభించి, ఆ యేడాదిలో భూత దర్శనం అయిన వాళ్ళందరిపేర్లూ యేకరు పెట్టింది, రాపెట్. జోసెఫైన్ లోయ్‌సెల్, యూలాలీ రాటియర్, సోఫీ పెడాగ్ను, సెరాఫైన్ గ్రిస్పీడ్ వగైరా లెందరికో భూతదర్శనం గావడం, చావడం గూర్చిన కథలన్నీ వర్ణించి చెప్పింది.

ఇదంతా వింటూంటే బోన్‌టెంప్స్ అవ్వ మనస్సు చెదిరిపోతూంది. చేతులు రాచుకుంటూ, అటునిటు ఆరాటంతో కదులుతూ, గోడవైపు తిరిగింది, దృష్టి మలుపుకోడానికి. అంతలో రాపెట్ ఒక్క వురుకున వెళ్ళి కబోర్డులోని దుప్పటీ తీసి, శరీరమంతా కప్పేలా ముసుగేసుకుంది. ఇనపబొచ్చె నెత్తిమీద బోర్లించుకుంది; బొచ్చె మూడుకాళ్ళూ చిన్న చిన్న కొమ్ముల్లాగ కనబడుతూన్నాయి. కుడిచేత చీపురు పట్టుకుంది; ఎడంచేత పాతబొక్కెన తీసికొని పైకెగరేసింది. బొక్కెన క్రింద పడి డబడబలాడుతూ పెద్ద శబ్దంచేసింది.

ఆ ప్రశాంత వాతావరణంలో బొక్కెన చప్పుడు కర్ణ భేదకంగా వినిపించింది. రాపెట్ గదిమూల్లోని పాతకుర్చీమీది కెక్కి, వికారచేష్టలు గావిస్తూ, నెత్తిమీది యినుప బొచ్చెలోకి భయంకరంగా అరుపు లారంభించింది. ముసిలిది భయభ్రాంతయై యిటుతిరిగి చూసేసరికి, కుడిచేత చీపురు నెత్తి, బెదిరించే పిశాచరూపం కనబడింది.

మరణాసన్నమైన ఆ వృద్ధురాలు పిచ్చిచూపులతో, అమానుష ప్రయత్నంమీద లేచి పారిపోవాలనుకొంది. ఆ యత్నంలో నామె పూర్వకాయం మంచంమీదించి బైటికి

వచ్చేసింది కూడాను. గాఢమైన శ్వాసతో ఆమె వెనక్కి విరుచుకు పడిపోయింది. అంతా ఆఖరైపోయింది. రాపెట్ పరికరా లన్నిటినీ యథాస్థానాల్లో నిక్షేపించేసింది. దుప్పటి కబ్బోర్డులోను, చీపురును కబ్బోర్డు మూల్లోను, యినపబొచ్చెను పొయిదగ్గరా, పాతబాల్చీని వెనక వసారాలోను, పాతకుర్చీ గోడమూల్లోను వుంచింది. చిరకాలానుభవ సిద్ధమైన ఆరిందా తనంతో చట్టున శవాన్ని సమీపించి, తెరిచివున్న నేత్రాల్ని మూసేసింది. మంచంమీద నొక కంచం వుంచి, దానిలో పవిత్రోదకం పోసి, దేవదారురెమ్మ ముంచింది. శవందగ్గరే మోకరించి, మృతజీవి ఆత్మోద్ధరణకై అత్యంతభక్తితో ప్రార్థనా వాక్యాలు చదివింది. నిరంతరం అదేవ్యాపారం గావడంవల్ల అంత్యప్రార్థనాదులన్నీ రాపెట్ మామ్మకి కంఠతావచ్చునులెండి.

సాయంత్రం హొనోరీ యింటికి వచ్చేటప్పటికి రాపెట్ మామ్మ మహాశ్రద్ధగా యేకాగ్రతతో ప్రార్థనలు గావిస్తూండడం చూచేడు. వెంటనే అతగాడు మనసులోనే లెక్కచూచుకుని, తనకు ఒక్కఫ్రాంకు అంటే యిరవై సౌలు, నష్టం వచ్చిందని బేరీజు వేసుకున్నాడు! ఆమె అక్కడవుండి, వుపచారాలు గావించినది, మూడు పగళ్ళూ, ఒక్కరాత్రీను; అందుకోసం ఆవిడ కివ్వాల్సింది ఐదుఫ్రాంకులు, కాని, ఆవిడతో చేసికొన్న జట్టీప్రకారం ఖరాగా ఆరు ఫ్రాంకులు యివ్వాల్సిందే!





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B199 |
| పుస్తకం పేరు | మొపాసా కథలు గైడీ మొపాసా |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 241 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | |
| స్కాన్ చేసినది | thahira |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |